భాగవతదర్శనము

# భాగవతకథ



లేఖకులు:

శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారి మహారాజు

అనువాదకులు: శ్రీ కుందుర్తి వేంకటనరసయ్య

| సంపుటము | | భాగము |
|---|---|---|
| 1 | | 1 |

శ్రీరామ

### శ్రీ భాగవత దర్శనము

# భాగవతకథ

## (ప్రథమ ఖండము)

శ్లో॥ వ్యాసశాస్త్రోప వనతః సుమనాంసి విచిన్వతా,
కృతా వై ప్రభుదత్తేన మాలా భాగవతీ కథా॥

★

గ్రంథకర్త:
శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారిగారు
అనువాదకుడు:
శ్రీరామశరణ్ కుందుర్తి వేంకటనరసయ్య

★

ప్రకాశకులు:
శ్రీరామ శరణ మందిరము, బుద్ధాం.
నామప్రయాగ.

కాపీరైటు] 1963 [వెల రు. 2-50

# అనువాదకుని నివేదనము

శ్రీ శ్రీ శ్రీ ౧౦౮ ప్రభుదత్త బ్రహ్మచారి మహారాజు గారు మన యాంధ్రదేశమునకుఁజిరపరిచితులే. వీరు గుంటూరు రెండుసార్లు శ్రీ సీతారామనామ సంకీర్తన మందిరమునకు విచ్చేసిరి. అప్పుడు వారితో నాకు గట్టి పరిచయము కలదు. పరిచయమేకాదు వారు నన్నుఁ జాలగ ప్రేమింతురు. వారు త్రివేణిలో జరిపిన విరాట్ సంకీర్తన యజ్ఞమునకును వెళ్ళితిని. తర్వాత అనుష్ఠానమునకై ఉత్తర దేశము రెండవసారి వెళ్ళి నపుడు వారితో గోవర్ధనగిరి దగ్గఱ కుసుమ సరోవర తీరమున పది పంద్రెండు దినములుండుటయు, నప్పుడు వారు భాగవత సప్తాహము కావించుటయు జరిగినది. వారి యాజ్ఞచే నిదివఱకు వారు రచించిన 'శ్రీ శ్రీ చైతన్య చరితావళి'ని అనువదించితిని. వారి మిగిలిన గ్రంథము లన్నిటిని నేనే యనువదింపవలెనని వారి యాజ్ఞయగుటచే నాకు హిందీలో నధిక పాండిత్యము లేకపోయినప్పటికిని నా చేతనైనంతవఱకు భావము పోకుండ ననువదించితి ననుకొనుచున్నాను. తప్పులను పండితులు మన్నింపవలయును. తెలుఁగులోనైనను భాషా శుద్ధతను గమ నింపలేదు. భావశుద్ధతనే గమనించితిని. సహృదయులు లోప ములు తెలిపిన సవరించుకొనువాఁడను.

భాగవతకథ ప్రథమభాగము చాలకాలముగ ఐపోయి నది. నేటికి ద్వితీయముద్రణ నందుచున్నది. పాఠకులు మా యీ కృషిని అభిమానించి సహకరించవలయునని కోరుచుంటిని.

ఇట్లు
శ్రీరామచరణ పరిచరణుడు
కుందుర్తి వేంకటనరసయ్య

శ్రీహరిః

# ప్రకాశకుని వక్తవ్యము

శ్లో॥ వంశీ విభూషిత కరాన్నవనీరదాభాత్
పీతాంబరాదరుణ బింబఫలాధరోష్ఠాత్ ।
పూర్ణేందు సుందరముఖా దరవింద నేత్రాత్
కృష్ణాత్పరం కిమపి తత్త్వమహం న జానే॥

మాకు చాల దినములనుండి శ్రీ మహారాజుగారి గ్రంథము లన్నిటి కొక స్వతంత్ర ప్రకాశన విభాగమును దెఱువవలెనను కోరిక యుండెడిది. మహారాజుగారి 'భగవన్నామ సంకీర్తన మహిమ' యను చిన్నపుస్తకమును నేనిదివఱకు ప్రకటించితిని. దానిని నేను మూఁడువేలచ్చు వేయించితిని. కాని అన్నియు ఖర్చైనవి. అది యిప్పుడు దొరకదు. తెలుగు మొదలగు నన్యభాషలలోఁ గూడ దాని యనువాదము ను బ్రకటించిరి. ఈ కార్యము సువ్యవస్థిత రూపమున నడుపవలెనని మా యందఱి కోరిక. కాని మే మెన్నిసార్లు హెచ్చరించినను మహారాజుగారు దీని నంగీకరింపలేదు; వా రంగీకరింపనిది మే మేమి చేయుటకు సాహసములేదు. వారు దీనిని శుద్ధ వ్యాపారమని, మీతోపాటు నేను కూడ దీనిలో నిరుకుకొందును, అప్పుడు దీనిమూలకముగా సమస్త సంకల్పములు రేగునని యనిరి. "మిమ్ములను మేము చేయుమనుటలేదు, మీరు మీ పుస్తకముల నన్యప్రకాశకుల కిచ్చుచునే యున్నారు. వారిలోఁ జాలమంది కావలసినదానికంటె నెక్కువ ఖరీదును వేయుదురు. దీనిమూలకముగ వారికి

కొంచెము ఆర్థికలాభము కలిగితీరును. కాని పాఠకులకు లభింపవలసినంత ప్రయోజనము లభింపదు. ఇఁక వ్యాపార విషయ మున్నది. ఆ విషయములో మే మేదియో వ్యాపారము చేయనే చేయుచున్నాము గదా! ఇది కూడ కానిండు. డెబ్బదివ 'డెట్లో యెనుబదివ దట్లే'' అని మేమంటిమి. కాని వారు "ఇవన్నియు మీ కృత్రిమాలోచనలు. ఇట్లు చెప్పి నన్ను దీనిలో దింపి 'ఊఁకలో నిప్పుపెట్టి, ఊరి వెలుపలకుఁ బోయినట్లు' తొలఁగి పోవుదురు. మీ వ్యాపారమూ, మీరు మీపిల్లజెల్లల కొఱకు చేయుచుందురు. ఇదియా పరమార్థము కొఱకు? ఇది యంతయు నా నెత్తిన పడును. అప్పుడు నా మాల, సంచి మూలబడును. 'ప్రేమ మఱపునకు వచ్చెను. బుద్ధి పనిచేయక పోయెను. కాని కన్ను, నూనె, కఱ్ఱ జ్ఞాపక' మున్నట్లు ఇది కాలేదు, అది కాలేదు అనునది మిగులును. 'హరిభజనమున కని వచ్చి, ప్రత్తిరాట్నము ముందు పెట్టుకొనినట్లు' యీ ప్రస్తావనను టలాయించుచునే యుండెను."

ఇచ్చట ఒకరిద్దరు ప్రకాశకుల యొక్క అనుచిత వ్యవహారము వలన గత సంవత్సరము వారి మనస్సులో సంక్షోభ మెక్కుడుగఁ గలిగెను. ఇదియే సమయమనుకొని (రామజీ, పరమహంసాదులు) మేము మరల ఈ ప్రస్తావనఁ దెచ్చితిమి. మేము చెప్పియొప్పించిన పిమ్మట ఈ ప్రస్తావనము విషయములో నీ షరతులపై నొప్పుకొనిరి. ''నే నేమియుఁ జేయను. ఎవ్వరిని చందాదారులుగఁ జేరుమని కోరను. దీని కొఱకై ధన మెవ్వరి నడుగను. ఇతర ప్రకాశకులకు వ్రాసి యిచ్చినట్లు మీకును వ్రాసి యిచ్చెదను. తర్వాత మీకు

తెలియవలెను, మీ పనికి తెలియవలెను. లాభ నష్టములకు నేను భాగస్థుఁడనుగాను " ఇవి షరతులు. మేము భగవంతు నిపై భారమువేసి అంగీకరించితిమి. దాని పరిణామమే నేఁడీ ద్వితీయ గ్రంథమును పాఠకుల కరకమలములందు చాల సంతోషముతోఁ సమర్పించుచున్నాము. మొట్టమొదట 'శ్రీశుక' అను పేరుగల విశుద్ధ ధార్మిక నాటకము సంకీర్తన భవనములోఁ బ్రకటించితిమి. ఇప్పుడీ రెండవ గ్రంథము 'శ్రీ భాగవతదర్శనము'న కంతర్గతమైన " భాగవతకథ " యొక్క ప్రథమ ఖండము. ఈ గ్రంథము గొప్పదగును. ఒక విధముగ శ్రీ మద్భాగవతాధారమున నిది స్వతంత్రగ్రంథము. ఇది కనీసము ౫౦ – ౬౦ భాగములతోఁ గాని, యింత కధికముగఁ గాని పూర్తియగును.

పాఠకుల చరణములకు నా నివేదన యిదియే. దీనిలోఁ బనిచేయు మే మందరము చిన్నవాండ్రము; అనుభవ శూన్యులము. ఎప్పుడు నిట్టిపని చేసియుండలేదు. ప్రకాశన సాధనమేమియు మా దగ్గర లేదు సర్వసాధనా హీనుల మైనప్పటికి మేము కేవలము భగవంతుని యొక్కయు, భగవద్భక్తుల యొక్కయు కృపా విశేషముచేతనే యింతటి మహాత్కార్యము నొనర్చుటకు సాహసించితిమి. మొదట మే మీ కార్యమును జేయఁ దలఁచినప్పుడు ' ఇది యేమంత కఠినకార్యము కాదు. ఒకటి రెండు పుస్తకములు వెలువడునప్పటికి, వెంట వెంటనే వేలకొలఁది చందాదారులు చేరుదురు. అప్పుడన్నియు ఖర్చగును. మరల క్రొత్త క్రొత్తవి బయలు వెడలును ' అనుకొంటిమి. కాని దీని నారంభించునప్పటికి యిది కష్టసాధ్యమైన పని

యని గ్రహించితిమి. ప్రథమ ఖండమును ప్రకాశించుటకు తంటాలు పడుచుండఁగానే, స్వంత ముద్రణాలయ మున్నఁ గాని యిట్టి మహాగ్రంథ మెట్టి స్థితిలోనైనను బూర్తిగఁ బ్రకటింపఁబడ దని గ్రహించితిమి. ఇప్పుడు కాగితము దొరకుట యెంత దుర్లభమో, అచ్చుస్థితి యెట్లున్నదో అది అనుభవించినవారికిగాని తెలియదు. ఇదంతయుఁ జెప్పుటచే మా యభిప్రాయ మేమనఁగా మనకు స్వంత ముద్రణాలయము లేకపోవుటచే నొకవేళ రాఁబోవు – ఖండములు సరియైన సమయమునకు వెలువడక పోయినచో మేము వివశుల మని గ్రహించి క్షమింపవలె ననియే. ప్రతిఖండము సమయమునకు వెలువడునట్లు మా చేతనైనంతవఱకు ప్రయత్నించెదము. కాని యింకను మేము తపాలా సంబంధమగు రిజిష్టరీ చేయించవలయును. రిజిష్టరీ కాకున్న తపాలా వ్యయ మధికముగ నగును. కావున రెండుగాని, మూడుగాని ఖండము లొక్క సారిగాఁ బంపినచోఁ బాఠకు లన్యథా తలంపవలదు. ఈ గ్రంథ మెంత యధికముగఁ బ్రచారమునకు వీలుండిన నంత ప్రచారము కావలెనని మా యాశయము. ఏలననఁగా సనాతన ధర్మమున కిప్పుడు కలిగిన పతన మిదివఱ కెన్నడును కలుగలేదు. ఈ పాశ్చాత్య విద్య మన సర్వస్వమును నాశము చేసినది. ఇది మన సామాజిక; రాజనైతిక పతనమును గావించనే కావించినది; అన్నిటికంటె నధిక కుఠారాఘాతము నీ విద్య మన మతముపై విడిచినది. ఈ విద్య బాల్యకాలము నుండియు మన హృదయములలోఁ జొరపడి, మనము మన

పురాతన సంస్కృతిని, సభ్యతను నొక్కసారిగా మఱచు నంతగ నాటుకొనినది.

మన పిల్లలు మనోరంజనము కొఱకు చదువు కథలు, నవలలు బాలబాలికల మనస్సును మలినము కావించునంతటి చెడ్డవిగ నుండును. వారి వైషయికవృత్తి జాగృతి చెందును. వారు విషయభోగమును అవైధసంబంధమునే సుఖసాధన ముగ భావింతురు. మన పిల్లలు ధార్మిక కథలను జదువు నెడల వారికి మనోరంజనముతోఁ బాటుగా ధార్మిక జ్ఞానము కూడ కలుగును. తమ యాచార విచార సదాచారముల విషయములోఁ గూడ నసభిజ్ఞులుగ నుండరు. హిందూమత గౌరవమును గూడ తెలిసికొనఁ గలుగుదురు. అందఱు వారి యున్నతి విషయములో నెట్టిన నసుకొననిండు, కాని హిందు వులయున్నతి ధర్మము వలననే కలుగును. కావున నిట్టి హిందూ ధర్మమునకు సారసిద్ధాంత రూపమైన గ్రంథ మొకటి యధి కముగఁ బ్రచారము కావలెనని మా యాశయము. మేము చక్కని సరళ సాహిత్యమునందు, సనాతన సంస్కృతియందుఁ బ్రేమ గలవారి కప్పుడప్పుడు సేవఁజేయువత్తుము. కాని పాఠ కులు మాయీ కార్యములో చేయూత నొసంగి, సమస్త విధముల మా యుత్సాహమును బెంచినచో నీ కార్యము చక్కఁగ నెఱవేరుటకు వీలగును. పాఠకులీ యుపాయములచే దీనికి సహాయ పడవచ్చును.

౧ ఈ గ్రంథమును స్వయముగఁ జదువవలెను. తమ స్త్రీలచేతను, బాలకులచేతను, పరివారముచేతను పఠింపఁ జేయువలయును.

౨ మీా పరిచయ బంధువులచే దీనినిఁ జదివించుట. ప్రతి పాఠకుఁడు ౧౦—౨౦ మంది తన ప్రియస్నేహితులను జందాదారులుగఁ జేర్పించవలెను.

3 సాధారణాదాయము కలిగిన బీదవాఁడీ గ్రంథమును ఖరీదిచ్చి కొనఁజాలనంత పెద్ద గ్రంథముగ నిది పెరుగును. వారి కొఱకై ధనవంతులు, సమర్థతగల వారీ గ్రంథమును సార్వజనిక గ్రంథాలయములలో దీని నుంచుటకుఁ బ్రయత్నించవలెను. డబ్బుగా దానమిచ్చిన నది వ్యయమైపోవును. ఈ గ్రంథదానమువలనఁ బుస్తకాలయ మున్నంతవఱకు ఆ దాతపేరు శాశ్వతముగ నుండును. దాని జదువుటకుఁ గొనిపోవు పాఠకులందఱు దానిమీఁద దాతపేరును జూచి వానికి ధన్యవాదము లర్పింతురు. దాత అందఱకు విద్యాదాన మొనర్చిన ఫలభాగి యగును. విద్యాదానమునకు మించిన దానము లేదు. ఏ దాతయైన నెన్ని గ్రంథాలయములకు నెన్ని పుస్తకము లీయఁదలఁచిన వాటి కేర్పాటంతయు మేము చేయుదుము. వార్తాపత్రికలలో సూచన నిచ్చి గ్రంథాలయములనుండి యుత్తరముల తెప్పించుకొందుము. లేక దాతయే గ్రంథాలయముల కీయఁదలఁచిన వాటి కీయవచ్చును.

౪ ప్రచార దృష్టితోఁ బ్రజలకీ కథలను వినిపింపుఁడు.

౫ మేమీా కార్యములో సాఫల్య మొందుటకు పాఠకుల మమ్ముల నాశీర్వదింపవలయును.

చివరకు మేము మూకు కాగితము మొదలగునవి లభించుట కత్యంత సాహాయ్యమును గావించిన రాయ్ బహాదుర్ మహేశానంద ఘిల్డియాల్జీగారికి మా యత్యంత కృతజ్ఞతను ప్రకటించుచున్నాము. వారు మావారే. ఎల్లప్పుడు మా యందఱిఁ గృప చూచెదరు. మా కంటె పెద్దలు. కావున మేము వారికి ధన్యవాదము లిచ్చుటేమి సర్వదా వారి కృపకు బాత్రులమై యున్నాము; ఉండఁగలము.

ఈ కార్యమును విశుద్ధ భగవత్సేవ యను భావముతో మేము చేయునట్లా సర్వాంతర్యామి యగు ప్రభు పాదపద్మములకు మా ప్రార్థన మర్పించుచున్నాము.

సంకీర్తన భవనము<br>ఝూసీ (ప్రయాగ).<br>శంకరలాల్ ఋషికుమార్<br>దుశాలేవాలే<br>మోతీబజార్, ఢిల్లీ.

వినీత సేవకుఁడు,<br>శంకరలాల్ గుప్త.

# నా పతనము

శ్లో॥ శిరః శార్వం స్వర్గాత్ పశుపతిశిరస్తః క్షితిధరమ్।
మహీధ్రా దుత్తుంగాదవనిమవనేశ్చాపి జలధిమ్॥
అధోఽధోగంగేయం పదముపగతా స్తోకమథవా।
వివేకభ్రష్టానాం భవతి వినిపాతః శతముఖః॥ ♦

(శ్రీ భర్తృహరి నీతిశతకము ౧౦ శ్లో॥)

ఇప్పటికి ౨౩-౨౪ సంవత్సరములకుఁ బూర్వము కాశీలోఁ గొంతకాలము నేను సాహిత్యజీవనమును గడపితిని. ఆ సమయమున హృదయములోఁ గొంచెము వైరాగ్యముండెడిది. భగవంతుని బొందుట కభిలాష కూడ యుండెడిది. సాహిత్యక జీవనము నాకు నచ్చలేదు. భగవంతుని 'ప్రభో! నన్ను లేఖకునిగాను, ప్రకాశకునిగాను చేయకుము. నీ చరణములందు భక్తి నీయవలయును. భవదీయ చరణారవింద మకరందపానముచేయు మత్తమధుకరమగుదును. పిచ్చివాండ్రవలె, స్వేచ్ఛాచారు లగు పశువులవలె, వనములలోఁ దిరుగు జంతువులవలె నిన్నే దలఁచుచు నున్మత్తుఁడనై చరించెదను. విశ్వబ్రహ్మాండ విషయముల నన్నిటిని విస్మృతి చెందవలె'నని

---

♦ విష్ణుపాదాబ్జ సంభూతయైన భగవతీ భాగీరథీ శ్రీవిష్ణుపద స్వర్గమునుండి పతితయై శివుని శిరస్సుమీఁదను, అక్కడనుండి హిమశైలము పైనను, అక్కడనుండి భూమిమీఁదను, తర్వాత భూమిపైఁ బ్రవహించుచు సముద్రములోఁ జేరినది. ఇట్లే వివేక భ్రష్టుఁడగు పురుషుఁ డొక్కసారి పతనమయ్యెనా, యింకను బోనుపోను పతనమే యగుచుండును. వానికి పోనుపోను అవనతియే జరుగుచుండును.

ప్రార్థించితిని. దీనికి ప్రయత్నముకూడ చేసితిని. వ్రాయఁగూడ దని నియమముకూడ పెట్టుకొంటిని; కాని విధి విధానమును వ్యర్థము కావించు సామర్థ్య మెవనిలో గలదు. ప్రారబ్ధమును బురుష ప్రయత్నముచేఁ దొలగింప నెవరికి సాధ్య మగును. బ్రహ్మవ్రాతపై మేకును గొట్టగలవాఁ డెవఁడు? నా వైరాగ్యము కర్పూరమువలె నెగిరిపోయెను. ఇప్పు డేదైన నున్నచో నది కర్పూర మెగిరి పోయిన తర్వాత డబ్బీలో మిగిలిన సుగంధము వంటిదని గ్రహించవలయును.

"జ్వర వైరాగ్యము లోక్కరీతిగ నుండు" వను సామెత కలదు. అట్లెల్లప్పుడుండిన వాఁడు చాలదినము లీ మర్త్యలోకములోఁ జిక్కుకొని యుండఁడు. మానవ శరీరము సత్త్వ రజస్తమో గుణములచే నేర్పడినది. సముద్రములో నెల్లప్పుడును చిన్నవి, పెద్దవి, మధ్యరకపు టలలు లేచు చుండును; అట్లే మానవ శరీరములో త్రిగుణమయ మగు తరంగము లేచును. సత్త్వగుణము వృద్ధియైనప్పుడు విషయవైరాగ్యము పరమార్థ చింతనములం దభిలాష కలుగును. ఎటుచూచినను ప్రకాశమే కనఁబడును. సాంసారిక విషయచ్ఛేదనము చేయఁ బరువిడును. అట్టి స్థితిలో మానవుఁడు సంసారబంధనములను వీడి, వైరాగ్యము నాశ్రయించి, యేకాంతవాసము కావించుటకు బయలు దేరును. పూర్వజన్మోపార్జిత అసంఖ్యాకములగు పుణ్యకర్మలొనర్చిన వానికిని, ననేక జన్మలలో సాధన చేసినవానికిని యేకాంతవాసమందును, భగవచ్చింతనమందును మనస్సు లగ్నమగును. అట్టి వారీ సంసారబంధనమును దెగఁగోసి పరమపద ప్రాప్తి చెందెదరు; ముక్తులగుదురు. ఇట్టివారిలో యోగభ్రష్టు

లరుడుగ నుందురు. వారి వైరాగ్య మెన్నడును దిగదు. క్షయ రోగికి జ్వరమువలె, వైరాగ్యము వాని కెల్లప్పుడు నుండును.

సత్త్వగుణ ప్రాబల్య మున్నప్పుడు మొదట మొదట వానికి వైరాగ్యముండి కాలాంతరమున నావైరాగ్యము క్షీణ మగును. వైరాగ్యము క్షీణించఁగానే యీ ప్రపంచ మసత్య ముగఁ దోచక, పదార్థము లన్నియు సత్యముగఁ దోచును. రోగము వచ్చిన ఔషధముకావలెను; ఔషధము డబ్బువలనఁ గాని లభింపదు. ధనము ధనికుల వద్ద నుండును. ధనికులు సాధారణముగ విషయలోలురుగ నుందురు. వారు స్వార్థము లేక ధనమీయరు. అందువలన వారికి ప్రభావమునుజూపియో, సిద్ధులఁజూపియో, ధర్మము నడ్డముగాఁ బెట్టుకొనియో, పర లోకభయమును జూపియో, స్వర్గాదిలోకముల నాశపెట్టియో, యంత్ర, మంత్ర, ఇంద్రజాల, గారడీ, పొగడ్తలు మొదలగు వాటిచే వారి వద్దనుండి ధనము గ్రహింపఁ గోరిక కలుగును. దానిని బూర్తికావించుటకు సామగ్రిని ప్రోవుచేయవలెను. అట్టి దుకాణమును బెట్టవలెను. తిరిగి తిరిగి మరల సంసారమే వచ్చి పడినది.

మొదటినుండియు స్వార్థసిద్ధికొఱకు కపట వైరాగ్య వేషము వేసినవారి సంగతి మన కక్కఱలేదు. వానికి వైరా గ్యము కలుగనే లేదు. అతఁడా విశుద్ధ డాంబికుఁడు; కాని జీవితములో యథార్థ మగు వైరాగ్యము కలిగి, తర్వాత నది శిథిలమగుచో, వానికి చివరకు రెండు దశలు కలుగును— ఒకటి విషయములలోఁ బడిపోవుటయు, రెండవది ఏదో పార మార్థిక వ్యాపారము.

అందఱి నాడించువాఁడు శ్రీహరియే. జీవు లంద ఱితని సాంజ్ఞ చేతనే ఆడుదురు. జీవుల అభిమానము వ్యర్థము. ఆతఁ డే సమయమున, నెవనిచే నేది చేయింపఁ దలఁచునో, వాని కట్టి బుద్ధినే యిచ్చును.

ప్రకృతి వశముచే నెప్పుడో యొకప్పుడు కొంత లిఖించుటకు బాధ్యుఁడ నగుదును. ఇది పరోపకారము, సాహిత్య సేవ, పారమార్థికోన్నతి, ప్రచారమునకు సాధనము అను నివి యన్నియు మనస్సు సరిపెట్టుకొనుట కనుకొను మాటలు. ఆ ప్రభువే సర్వమును జేయించువాఁడు. ఆయన ప్రేరణలేక జీవుఁ డేమి చేయఁగలుగును? నేను ప్రకాశన కార్యములోఁ గూడ సహాయము కావించి యొక నూతన ప్రయత్నము సృజింప వలసివచ్చు నని యెన్నడును దలఁపలేను. వెంటనే అప్పటికప్పు డేవనియు కాదు. దాని బీజము చాల దినముల క్రిందటనే యేర్పడును; అది మూర్తిమంతమై సమ్ముఖమునకు వచ్చినప్పు డది ప్రజల యెదుట ప్రకటమగును. వృక్షములోపలనే ఫల మేర్పడును; కాని అది బయటకుఁ గనఁబడినప్పుడు 'దీని కప్పటి కప్పుడు ఫలము పుట్టిన' దని యందుము. ఇట్లే యీ ప్రకాశన సంకల్పము ప్రజల మనస్సులలోఁ జిరకాలము నుండి యుండెను; ఇప్పుడు సమయము వచ్చినప్పటికి వెంటనే వ్యక్తమయ్యెను. చాలసార్లు ఈ ప్రస్తావము నాదగ్గఱకు వచ్చెను, కాని నేను దానికి వ్యతిరేకించితిని. కారణ మేమనఁగా నే నీ కార్యమునకు సర్వథా అయోగ్యుఁడను.

ఈ సంవత్సరము 'అష్టాదశ పురాణసత్ర' మారంభమైనది మొదలుకొని రామజీ చాలసార్లు మిక్కిలి పట్టుదలతో

'మహారాజ! మనము ప్రకాశనకార్య మారంభింపవలెనని తీవ్రేచ్ఛయున్నది' అనెను.

'సోదరా! చూడుము. ఈపని మనచేత కాదు. వంశ పారంపర్యముగా నీపని చేయుచున్నవారే దీనిని చక్కగ నెఱవేర్పఁగలుగుదురు. ఎవరు చేయుపని వారు చేయవలెను. చాకలిపిల్లవాడు చక్కగా గుడ్డ లుదుకఁగలఁడు. మనము మాలను, సంచిని జింతింపఁగలము. సత్యనారాయణ కథ చదువఁగలము. పూజా పారాయణములు చేయఁగలము. ఈ వ్యాపారము వ్యాపారస్థులకే శోభించును. ఒక సామెత యున్నది—

'ఖత్రీ దాతా లాఖ్ మేఁ, కాయథ సౌ మేఁ సూమ్
బనియా బూఁగ్ హజార్ మేఁ, బామన్ బూంగ్ హీ బూంగ్'

(క్షత్రియులలో లక్షకొకఁడు దాత. కాయస్థులలో నూటికొకఁడు పిసినికొట్టు. వ్యవహారము తెలియనివాఁడు వైశ్యులలో వేయికొకఁడు. బ్రాహ్మణులలో నందఱు వ్యవహార మందకుశలులే.)

వ్యవహార మందకుశలుఁడైన వానిని, చాకచక్యము నేర్పు లేనివానిని బూఁగ్ అందురు. వైశ్య బాలకులలో బాల్యకాలము నుండియే వ్యాపార చాకచక్య ముండును. చిన్న వైశ్యబాలకుఁడు కూడ పెద్దపెద్దవారి చెవులను కోయఁ గలఁడు. నేను దక్షిణదేశ యాత్రకు పోయినప్పుడు ౧౩ ౧౪ వర్షముల మార్వాడి పిల్లవాఁడు నా పెట్టెలోనికి వచ్చి కూర్చుండెను, ఇది ఖాండ్వాకు దగ్గఱలో

జరిగిన విషయము. అతఁడు గొప్ప చురుకుగాను మిక్కిలి శిష్టుఁడుగాను, అతి కార్యదక్షుఁడుగను గనఁబడెను. మాటవరుసకు నేను 'అబ్బాయీ! నీ వెక్కడికి వెళ్ళుచున్నా'వంటిని. అతఁడు 'మాకు ఫలానిచోట ఫరము న్నది. అక్కడ పని చూచుకొనఁ బోవుచున్నా' ననెను. నాకు చాల ఆశ్చర్యము కలిగెను. 'అబ్బాయీ! నీవు ఒంటరిగా నెట్లు వెళ్ళుచున్నావు? మీ తండ్రినిగాని, సోదరునిగాని, పోనీ గుమాస్తా నౌకర్లనుగాని దీసికొనిపోవుట లేదు. నీవు ఒంటరిగా వెళ్ళుచున్నావు. చాల సాహసము' అని నేనంటిని. పిల్లవాఁడు నవ్వి 'అయ్యా! దీనిలో సాహస మేమున్నది? సి. పి. లో నావి చాల చోట్ల ఫరము లున్నవి. నే నెప్పుడు నిట్లే వెళ్ళుచుందును. తండ్రి చనిపోయినాఁడు. సోదరులు లేరు. నేనే రెండు సంవత్సరములనుండి పని చూచుకొనుచున్నాను. నౌకరు స్టేషనులో నన్నుఁ గూర్చుండఁబెట్టినాఁడు. అక్కడ స్టేషనులో గుమస్తా కలియును. వానికి తంతినిచ్చితిని. అట్టియెడ నింకొక మనుష్యునకు వ్యర్థముగ బాడుగ (చార్జి) ఖర్చుపెట్టు టెందులకు?' అనెను. అప్పుడు నేను నా నెత్తి కొట్టుకొంటిని. మా గ్రామములలో ౧౨-౧౫ సంవత్సరముల పిల్లలు గుడ్డ కట్టుకొను టెఱుఁగరు. అర్ధణాయిచ్చి కూర తేలేరు. ఈ కుఱ్ఱవాఁడింత గొప్ప ఫరము నెట్లు నిర్వహించుచున్నాఁడో అనుకొంటిని.

ఇంతకు విషయ మేమనఁగా నిప్పుడు వృత్తిసంకరము, వర్ణసంకరము, ఆశ్రమసంకరము నైనది. పూర్వము కులపరంపరగా వచ్చు సదోష వృత్తినైనను మానవుఁడు బుద్ధిపూర్వకముగ విడిచెడువాఁడు కాఁడు. ఇంత గొప్ప మహా భారత

యుద్ధ మీ యాధారముమీఁదనే జరిగెను, 'మేము సమర్థులమై, పరాశ్రయమున నుండి, భిక్ష మెత్తుకొని రోజులు గడుపఁ జాలము. ఇది మా వర్ణధర్మమున కనుకూలమైనది కాదు' అని ధర్మరాజనెను. వంశపరంపరా వృత్తిలో మన పూర్వజుల సంస్కారములు మనకు స్వతః ప్రాప్తించును. నేఁ డందఱును దమ కులాగత వృత్తిని వీడి యన్యవృత్తుల నాశ్రయించిరి. కాలధర్మము. ఇప్పుడా పైతృక వృత్తులచేఁగూడ పని గడువదు. జీవన నిర్వాహము కాదు. పరమతస్థుల సంసర్గముచే మన యాధారణ నష్టప్రాయమైనది. ఇప్పుడెట్టులో యొకటుల పొట్ట నింపుకొనుట ధర్మమైనది. ఇదంతయు కాలప్రభావము.

నేను పొరబడితిని, ప్రసంగాంతరమునకు వచ్చితిని. ఈ విషయము రామజీకి తెలిపితిని. కాని మాఘమాసములో బీరమ్ బాబు వచ్చెను. వారుకూడ పుస్తకము లిచ్చుట నుండియే వెలువడవలెననియు, తాము గూడ యథాశక్తిగఁ గనిపెట్టియుండెద మనియుఁ జెప్పి దానిని బలపఱచిరి. చైత్ర మాసోత్సవమున కందఱును సమావేశమైరి. శంకరజీ, బీరమ్ బాబు, హరిశంకర బాబు, కబూల్‌సింహాజీ, దాదూజీ, సెక్రటరీ సాహెబ్, రాయ్‌బహదూర్ సాహేబ్ మొదలగువారందఱును గలిసి, మిగిలిన పను లన్నియు నెట్లగుచున్నవో యిదియు నట్లే యనిరి. మీరు చేయవలసిన దేమియు లేదు, అన్నియు మేమే చూచెదమనిరి. శంకరజీ తన వంతు పరిశీలనా కార్యమును గైకొని 'మీరు 3-ర ఖండములు నాపరిశీలనక్రింద వెలువఱచుఁడు. తర్వాత మీరు చూడనక్కఱలే' దనెను.

వీరందఱు నన్ను గుండములోఁ బడవేయఁ జూచుచున్నారని నేనంతయుఁ దెలసికొంటిని. ఈ భక్తులు వారి కిష్టమైన ఱెక్కలు కట్టి ఆకాశమున కెగుర వేయఁ గలరు. తలఁచుకొనిన నెట్టి రసాతలమునకు నైన బడవేయఁగలరు. ఇవన్నియుఁ దెలిసియు నా పూర్వజన్మవాసన యనుఁడు, లోభమనుఁడు, మానప్రతిష్ఠా ప్రసారము చేసికొను నభిలాష యనుఁడు, ప్రారబ్ధచక్ర మనుఁడు మొత్తమునకు నేను దీని నొప్పుకొంటిని. దాని ఫలస్వరూపమే, యీ ప్రథమ ఖండము వెలువడి పాఠకుల కరకమలములం దున్నది.

నియమానుసారముగ నా కీ ప్రకటనతోనే విశేష సంబంధము లేకపోయినప్పటికిని, నా యితర పుస్తకములు భిన్న భిన్న ప్రకాశకులచే భిన్న భిన్న సమయములలో వెలువడినవి. అట్లే యిదియు వెలువడుచున్నది. క్రొత్త విషయమేమియు లేదు. కాని అన్యప్రకాశకులకంటె నీ పుస్తక ప్రకాశకులతో నాకు ఘనిష్ట మమత్వ మున్నదను సంగతిని దాఁచుట దంభము మహాపాపమే యగును అనర్థమునకు మూలము, పతన కారణము మమత్వమే ఇంటి పిల్లి యెలుకలను దినిన బాధయే లేదు. కాని పంజరములోని చిలుకను దినిన బాధ కలుగును. ఎలుకలు, చిలుక రెండును నింటిలోని జంతువులైనప్పటికిని చిలుక మీఁద మమత్వమున్నది, ఎలుకల మీఁద లేదు. అన్యప్రకాశకుల కంటె వీరి లాభనష్టముల మీఁదకు ధ్యానమెక్కువగఁబోవును. ఇదియే నా పతనము. కాని యీ పతనమును నేను బుద్ధి పూర్వకముగ నంగీకరించితిని. ఏలననఁగా నీకార్యమునకు భగవచ్చరిత్రలతోడను,

భాగవత కథలతోడను, భగవన్నామ సంకీర్తన ప్రచార ప్రసారములతోడను సంబంధముకలదు. ఈవిషయమునుగూర్చి నే నెల్లప్పుడును జాగరూకతతో నుండినను నీ లక్ష్యమును సర్వదా స్మరించుకొనుచుండినను, నేను పతనమైనప్పటికిని యుత్థానమార్గమున ముందువాఁడ నయ్యెదను. అట్లుగాక యీలక్ష్యమునుండి జారి లాభనష్టముల గుండములోఁ బడి పోయితినా, అది శుద్ధ పతనమే యగును; అపు డనేక వ్యాపారులతోఁబాటు మేమును లెక్కింపఁబడుదుము.

ఈ ప్రథమఖండ ప్రకాశనములో నే యే వీళ్ళేర్పడినవో, ఏయే విఘ్నబాధ లేర్పడినవో వీటి నన్నిటిని విస్తార పూర్వకముగ వర్ణన చేయుచో దీనికంటె నింకఁబెద్ద గ్రంథ మగును. అప్పుడిది భాగవతీ కథ కాక పాఠకుల కేమాత్రము సంబంధము లేని "ప్రకాశన దుఃఖరోదన కథ" యగును. భోజనాలయములో వర్షకాలములో తడికట్టెలతో వంటచే యుట క్రొత్త వంటవాని కెంతటి బాధ కలుగునో అది వంటల వారికిఁ దెలియును. యజమాని పరివారమునకు తయారు చేసిన వంటతోడనే పని. సరిగా తయారు కాకపోయెనా పప్పుడకనేలేదే, కూరలో నీరు విడివిడిగాఁ గనఁబడుచున్నదే, రొట్టె పచ్చగానే యున్నదే, బియ్యములో నూక లున్నవే,— యీ నెపములన్నియు వచ్చును. వారట్లుచేయుట మంచిదే. వంటవాఁ డీవిషయమగు నౌకరినే పొందును కావున నే నాపని చేయలేనని దారి పట్టుమందురు. 'సుద్ధకూలి' శుద్ధమగుపని' అనునట్లు మామీఁద కృతజ్ఞత చూపవలసిన పనిలేదు. కావున ప్రకాశనములోఁ గలిగిన యిబ్బందుల నిచ్చట చెప్పుటలేదు.

నేను శారీరకముగ నెక్కడికి పోఁజాలను రాఁజాలనని నియమ రజ్జువుచే బంధించుకొనినప్పటికిని, అటునిటుఁ బరువిడువారు మాదక్‌జీ, పరమహంసజీ, రామ్‌జీ మొదలగువారు కలరు. అయితే ఇదికాలేదు, అదికాలేదు, సకాలమునకు వెలువడదు మొదలగు మానసిక సంకల్పములు చేయవలసియే వచ్చును. ఇది నాకేమి తక్కువజంజాటమా యేమి ?

కావున నెవరైన నది చేయుఁడు, లేక యిది చేయుఁడు. ౩-౮ ఖండములు మాత్రము నేను చెప్పినట్లు వెలువరుతును. తర్వాత మీపని, మీరు మీయిష్టము; బీరంబాబు యిష్టము; సూర్యనారాయణబాబు, ఆదిత్యబాబు యిష్టము; విపినజీ యిష్టము; పరమహంసజీ, రామ్‌జీ, శంకర్‌జీ యిష్టము అనిన నెట్లు ? అప్పుడు మా రామ్‌జీ మరల చేతులు జోడించును. ఈ విషయములో నా ప్రవృత్తియు లేదు, యోగ్యతయు లేదు, వీనితోఁ జెప్పితిని; వానితోఁ జెప్పితిని యను చింత నాకక్కఱ లేదు. కావున సోదరులారా ! ఈ జంజాటము నా వశమున లేదు. నేను స్పష్టముగఁ జెప్పుచున్నాను.

'సోలహ్ రోటీ ఖాఉఁ, భరోసో రామ్‌కో
మేరే వశ కీ నాహిఁ, ఘుఁసో కోఈ గామ్ కో'

(౧౬ రొట్టెలు తిందును. నాకు అండ ఆ రాముఁడే. నావల్ల నేమియుకాదు. ఎవరినైన నూరిలోనికి తరుమండి.)

ఒక గ్రామములో నొక బావిని ద్రవ్వుచుండిరి. గట్టి ముద్దలను చేసి ముంచిఁగి తీయువానిని 'సేహా' అందురు. ఒక బాటసారి యా దారిని బోవుచుండెను. వానికి బాగుగా

నాఁకలి యయ్యెను. ఏదైన యుక్తిచేసి పొట్ట నింపుకొనవలె ననుకొనెను. ఆతఁడు బావి దగ్గఱకు పోయి, యిటునటు తొంగి చూచుచుండెను. బావి తీయువారు పిఁడుకూడ మంటిముద్దలను దీయువాఁ డనుకొని 'నీకుకూడ మంటి ముద్దల నెత్తుట చేతనగునా యేమి?' అని అడిగెను. ఆతఁ డుపేక్షా స్వరముతో 'ఏదో కొద్దిదో గొప్పయో' అనెను. ఇంటినుండి రొట్టెలు వచ్చియుండెను. అప్పుడు బావి తీయువారు 'అయితే, నీవు ముందు రొట్టెలను దిను' మనిరి. వానికి కావల సినదే అది. మంచి లావుపాటి రొట్టెలను, శనగ కూరతో పదునాఱింటిని దినెను. తిని పైగా మజ్జిగ త్రాగెను. పొట్ట నిండి పోయెను. హుక్కా పొగాకు త్రాగి స్వస్థుఁడైన తర్వాత బావి తీయువారు 'చౌధరీగారు, ఇప్పు డింక బావిలో దిగుఁ' డనిరి. అప్పుడు చౌధరీ మహోదయుఁడు చేతులు జోడించి యిట్లనెను.

"సోలహ్ రోటీ ఖాఉఁ, భరోసో రామ్ కో
మేరే వశ కీ నాహీఁ, ఘుఁసో కోయి గామ్‌కో."

(౧౬ రొట్టెలు తిందును. నాకు అండ ఆ రాముఁడే. నావల్ల నేమియు కాదు. ఎవరినైన నూరిలోనికి తరుమండి.)

అట్లే వ్రాయించుకొనఁ దలఁచిన నా నెత్తిన యెక్కి యెన్ని కావలెననిన నన్ని వ్రాయించుకొనుఁడు. నెలకు రెండు ఖండములను వెలువఱచినప్పటికిని యెటులో పూర్తి చేయుదును. కాని యీ ప్రకాశనరోగము నా వలన గాదు. వ్రాయుటలోఁ గూడ, ఎప్పుడు నెవరో పురికొల్పిననే

యగును. ఇప్పటి వఱకు జరుగుచున్న దేమనఁగా వ్రాసిన దానిని శ్రీనివాసుఁడు ప్రతిదినము కథ చెప్పుచుండును. త్వరగా వ్రాయుటలో చాల తప్పులు కూడ నేను వ్రాసి యుండవచ్చును. వ్రాసి రెండవసారి పఠించుటకుకూడ వ్యవధి లేదు. ప్రూఫులు దిద్దుటలో తప్పులు పోవు ననుకొంటిని. కాని నేను గంగ కీవల ఝూసీలోను, అచ్చు గంగ కావల ప్రయాగ లోను, అదియుఁజాల తంటాలుతో, చాల శీఘ్రముగ నయ్యెను. అందువలన ప్రూఫులను జూడఁజాలక పోతిని. ఒకవేళ తప్పు లుండినఁ బాఠకులు స్వయముగ దిద్దుకొనుఁడు. మా వివశతను గ్రహించి మమ్ములను క్షమింపుఁడు.

ఎంత సుందరముగ దీనిని వెలువరించవలెనని యిక్కడ కార్యకర్తల కభిలాష యుండినదో అంత సుందరముగ వారు వెలువరింపఁజాలక పోయిరి. ఏలననఁగా నెండాకాలపు శలవుల తర్వాత విద్యాలయము లన్నియుఁ దెఱచుసమయ మిదియే ముద్రణాలయము లన్నియు పాఠ్యపుస్తకములతోను. విద్యాలయ సంబంధమైన కార్యములతోను నిమగ్నమై యుండెను. చిత్రముల బ్లాకులు మొదలగునవి కూడ సుందరముగా, సమయమునకు సిద్ధము కాలేదు. ఈ సమస్త సాధన సామగ్రి లభించుటకు నేడుచాల తిప్పలుపడవలసి వచ్చినది. కాని పాఠకులు దీనిని తమదిగా భావించి, యుత్సాహ పూర్వక ముగ దీని ప్రచారములో సహాయము చేయు టెడలను, శీఘ్రాతి శీఘ్రముగ శాశ్వత చందాదారులుగ నైనవో కార్యకర్తలు మీకు సుందరాతి సుందరముగను, దృఢముగను తేలికగను సేవ చేయఁగలుగుదురని యాశించుచున్నాను.

వ్యవహార సంబంధమైన విషయము లన్నియు నైనవి. నాకు శ్రీహరి చరణారవిందములం దహైతుకభక్తి కలుగు నట్లు నాకు ఉదారతా పూర్వకముగ నాశీర్వాదములు ప్రసాదింపవలయు నని నేను చివరకు నా 'భాగవతీకథా' పాఠకుల కొఱకు ప్రార్థన చేయుచున్నాను. 'భాగవతీకథ'ను భగవద్భక్తులే పఠింతురు. ఇసుమంతైన భక్తిలేని వారి చేతులలోని కిది పోనే పోదు. ఒకవేళ పొరపాటున పోయినప్పటికిని వారు దీనిని గాంచి, ముఖము చిట్లించుకొని యచ్చట నుంతురుగాని, చదువనే చదువరు. భగవద్భక్తులైన వారే చదువుదురు. లేదా భగవద్భక్తులు కాఁగోరు వారు కూడ చదువుదురు. ఇట్టి భగవద్భక్తులు హృదయపూర్వకముగ నిచ్చిన యాశీర్వాదము లెన్నడును వ్యర్థములు కావు. అందఱు నన్నాశీర్వదించు నెడల, నీ పతనము నుండి బయటపడి ఉత్థాన పథమున నగ్రసరుఁడను కాఁగలను. నిరంతరము భగవత్ స్మృతి కలుగుటయే అన్నిటికంటె సర్వశ్రేష్ఠ మగు నుత్థానము.

'హరిస్మృతిః సర్వవిపద్విమోక్షణీ'

త్రివేణీ సంగములో,
సంకీర్తన భవనము, ఝూసీ
(ప్రయాగ)
ఆషాఢ శుక్ల ౧౧, సం. ౨౦౦3
విక్రమ శకము.

భాగవతుల చరణరజము
ప్రభుదత్త బ్రహ్మచారి



శ్రీహరిః

# సమర్పణము

కృష్ణకథా రస పాన కాన కరి మమ భరిహైం ?
కరి హరి దరశన అశ్రునయన కబ ఝర-ఝర-ఝరిహైం ?
కబహౌం జీవన మూరి, ధూరి-పగ భక్తని మానూం ?
కబ శ్రీరాధారమన చరన సరబసు కరి జానూం ?
జే నిత అస వాంఛా కరహీం, తజహీం జగతకీ సబవ్యథా॥
ఉనహీం భాగవత కరని మహం, అరపతి 'భాగవతీ కథా॥'

పురాణసత్ర మండపము ఝూసీ (ప్రయాగ)
ఆషాఢ శు॥ దేవశయనీ ౧౧,
౨౦౦౩ విక్రమ శకము.

ప్రభుదత్త

# విషయసూచిక



అనువాదకులు　　　గ్రంథకర్తలు

శ్రీ హరిః

# భాగవతకథ

## భూమిక

శ్లో॥ త్రివేణీం మాధవం సోమం
భరద్వాజంచ వాసుకిమ్।
వందేఽక్షయవటం శేషం
ప్రయాగం తీర్థనాయకమ్॥*

జగదుద్ధారిణి యగు శ్రీగంగ యెక్కడకు వచ్చి పట్టపురాణియగు శ్రీయమునతోఁ గలిసెనో, ఆ పరమపావన పుణ్యప్రదేశమగు ప్రయాగరాజము యొక్క మహిమను వర్ణింప నేరితరము? ఎచ్చట నెప్పుడును క్షయించని నిత్య శాశ్వత అక్షయ వటము ప్రతిష్ఠితమై యున్నదో, యెచ్చట త్రైలోక్యపావనము చేయునట్టియుఁ, త్రిగుణమయము, త్రిదేవమయము నైన గంగా యమునా సరస్వతు లను మూఁడు ప్రవాహము లున్నవో, ఎచ్చట వారాహ వేషమును ధరించి శ్రీమాధవుఁడు నిత్యనివాసము కావించుచున్నాఁడో, ఎచ్చట శివుఁడు తన యనేక యద్భుత రూపముల ధరించి యీ క్షేత్రమునకు నాల్గువైపుల విరాజిల్లుచున్నాఁడో, ఎచ్చట బ్రహ్మదేవుఁ డక్షయ వటమూలము నందు నిత్యసన్నిహితుఁడై

---

* శ్రీ త్రివేణీ, శ్రీ మాధవుఁడు, శ్రీ సోమేశ్వరుఁడు. శ్రీ భరద్వాజముని, శ్రీ వాసుకి, శ్రీ అక్షయవటము, శ్రీ శేషుఁడు, తీర్థనాయకుఁ డగు ప్రయాగరాజును నేను ప్రణామము చేయుచున్నాను.

యుండునో అట్టి త్రిమూర్తులకు నివాసభూతమైన ప్రయాగ క్షేత్ర మాహాత్మ్యమును వర్ణించుట సూర్యుని దీపముతోఁ జూపించుటయే యగును. స్వయముగ నా తీర్థరాజముకూడ సమస్త త్రిభువనములలోని తారక తీర్థముల కొక ఛత్రస్రామ్రాట్టు. ధర్మార్థ కామ మోక్షములతో నిండిన దాని రత్నభాండారమునుండి నిరంతరము వాటిని పంచుచున్నప్పటికి నది సర్వదా నిండుగనే యుండును. కోటి కోటి తీర్థములు దేనికి వేగవతీ, బలవతీ యగు సేనయో; ఉగ్రాతియుగ్ర పాపములను వినాశము చేయుటలో నేది సదా అవ్యగ్ర భావముతో తత్పరమై యుండునో; గంగా యమునల యొక్క యుత్తాల తరంగములు దేనికి తెల్లని నల్లని చామరములో, ఆకుపచ్చని చిగురుటాకులు గల అక్షయవటము దేనికి నీలాతపత్ర ఛత్రమో, అట్టి తీర్థరాజము యొక్క పావనతను గూర్చి వర్ణన చేయుట పవిత్రతను గూడ సంకోచ పఱచుటయే యగును.

ఈ తీర్థనాయకున కిట్టి పావనత్వ ముండుటచే ప్రసన్నుఁడై లోకపితామహుఁడు దీనిని తన క్షేత్రముగాఁ జేసికొనెను. అందుకనియే దీనికి 'ప్రజాపతిక్షేత్రము' నియుఁ బేరు గలదు. కమలోద్భవుఁ డగు బ్రహ్మ యిచ్చట ప్రకృష్ట మగు యాగముల నెడతెఱిపిలేక చేసెను. అందువలన నిది 'ప్రయాగ' యను పేర ప్రసిద్ధమయ్యెను. యజ్ఞముల శాశ్వతము కావించుటకై వేదగర్భుఁ డగు చతురాననుఁడు మూఁడగ్నులకు మూఁడు విశాలకుండముల నేర్పఱచెను. ఈ మూఁడు కుండముల మధ్యగా గంగా యమునలు ప్రవ

హించెను. శ్రీ సరస్వతి గుప్తరూపమున వచ్చి యీ రెంటితోఁ గలిసెను. అందువలనఁ బ్రయాగకు షట్కోణములుగను, మూఁడు విభాగములుగ నయ్యెను. షట్కోణములుగ నైన యీ క్షేత్రము మూఁడు భాగములుగ విభాగింపఁ బడినది. గంగా యమునా సంగమమున నిలుచుండిన షట్కోణములు స్పష్టముగఁ గనఁబడును. గంగకు రెండు తటములు, యమునకు రెండు తటములు, రెండు తటములు మిశ్రిత ప్రవాహములకుఁ గలవు. గంగా యమునల మధ్య గార్హపత్యాగ్ని కుండ మున్నచోటకు ప్రయాగ యను పేరు వచ్చెను. యమున కావలి యొడ్డున దక్షిణాగ్నికుండ మున్నచోటకు అలర్కపురము (అరైల్) అందురు. గంగకావలి యొడ్డున నాహవనీయాగ్ని కుండమున్న పుణ్యప్రదేశమునకు ప్రతిష్ఠానపురమని పేరు. పురాణములలోఁ బ్రతిష్ఠాన పురమునకు మిక్కిలి మహిమ కలదు. ఇచ్చట సమస్త తీర్థములు ప్రతిష్ఠింపఁబడుటచే దీనికి ప్రతిష్ఠానపుర మను పేరు వచ్చినది. త్రివేణీ సంగమము ప్రతిష్ఠానపురము (ఝూసీ) నకు దగ్గఱనే కలదు. చంద్రవంశీయుల కిది మొదటి రాజధాని. ఇప్పుడును నిచ్చట ననేక తీర్థములు కలవు. ఆవలియొడ్డున దారాగంజిలో బ్రహ్మ దశాశ్వమేధములను జేసిన దశాశ్వమేధ ఘట్టమునకు సరిగా నెదురుగా నీవలియొడ్డున ఝూసీలో యజ్ఞతీర్థ మున్నది. ఇప్పుడును గోడకట్టుటకు నేల త్రవ్వుచుండఁగా దాని క్రింద నుండి యజ్ఞభస్మము వంటిది చాల మట్టి బయలు దేరినది. ఇప్పుడు నిత్య పురాణప్రవచనము, కృష్ణకీర్తనము జరుగు చోటను, తులసీవనము, పురాణ పఠనము జరుగుటచేతను

నది శ్రీహరి నివాసమైనది. ఆ పవిత్ర యజ్ఞతీర్థములో గుప్తముగాను, ప్రకటముగాను చాలమంది సంత, మహాత్ములు సమావేశ మగుచుందురు. ప్రతిష్ఠానపురము ( ఝూసీ ) లో వేలు, లక్షల సంవత్సరములు గల మహాత్ములు గుప్తముగ నివసింతు రని పరంపరగా ప్రసిద్ధమైయున్నది. ఇది యను భూత సత్యము కూడా. ప్రకటరూపముగ ప్రతిష్ఠానపురము (ఝూసీ) సాధు, సంత మహాపురుషుల పట్టణము. సంత మహాంతులయొక్క చాల ఆశ్రమములు, కుటీరములు గంగా తీరముననే యున్నవి. ఈ దీనహీనుఁడు, మలినమతియు, సాధనావిహీనుఁడు, క్షుద్రసేవకుఁడు కూడ ఆ యజ్ఞతీర్థమందే ఒక్క శిష్యునిమాత్రమే తోడుచేసుకున్నవాఁడై నివాసము చేయుచున్నాఁడు. అక్కడ దగ్గఱలో నింకను సాధువులు, సన్న్యాసులు, విరక్తులు, బ్రహ్మచారులు నివసించుచున్నారు.

ఈతఁ డిట్లు శిష్యలోలుపుఁడై సుడిగుండములో నేల పడినాఁడు? ఈతఁడు తన యింటిని వదలి తన బంధువుల నందఱిఁ జూడకున్న వాఁడొంటరిగా విరక్త భావముతో నుండ వలెను. శిష్యునకు సుతునకు భేద మేమున్నది? రెండును బంధములే. ఇది 'గుంటలోనుండి బయటపడి బావిలోఁబడిన'ట్లున్నది. గృహస్థ సంబంధమును వదలి తీర్థమునకు వచ్చి యిచ్చట నూతన గృహస్థుఁడై మరల పడిపోయినాఁడు. శిష్యులను బ్రోవు చేసిన గౌరవ ప్రతిష్ఠలు పెరుగును. వాటి కాశపడెనా పతనము తప్పదు. కావున పూజాప్రతిష్ఠలు దూరముగ నుండి మెదలకుండ శాంతిగా భజన చేసికొనవలె నని మీరనవచ్చును.

శిష్యులను బ్రోవు చేసిన బంధన మగుట సత్యమే శిష్యులు గురుపూజాప్రతిష్ఠాదులు తమ కర్తవ్య మనుకొని చేయుదురు. మానప్రతిష్ఠల కాసించెనా పతన మడుగడుగునకు తప్పనిదై యుండును. కాని, ఏ కార్యములోఁ బతన భయము లేదో నాకు జెప్పుఁడు? ఒక ప్రసిద్ధ మహాపురుషుఁడాతని జీవితములో నొక్క సన్మాన పత్రమైన గ్రహింపలేదఁట. ఎక్కడఁ డాతనికి సన్మాన పత్రమీయవలె ననుకొనుచుండిరో, అక్కడనే ఆతఁడు నిషేధించెడువాఁడు. ఆతఁడు సన్మాన మాన పత్రములను త్యాగము కావించి నాఁ డనుకొనుఁడు; కాని సన్మాన పత్ర త్యాగముచే నూఱు రెట్లుగ లభించిన సన్మానమును నాతఁడు త్యాగము చేయఁజాలక పోయి నాఁడు. నేనొక్క సన్మాన పత్రమును గూడ గ్రహింపలే దని గర్వము కలిగియుండును. త్యాగి — తన సంబంధులను, తన జాతిని, తన వర్ణమును, ఆశ్రమమును బాగుగానే త్యాగము చేసియుండవచ్చును. వస్త్రముల విషయములో లంగోటిని గూడ త్యాగముచేసియుండవచ్చును. కాని త్యాగాభిమానము వానికుండనే యుండును శిష్యుఁడు చేసిన సన్మానముకంటె, శిష్యులను జేకొన నను సన్మానాభిమానములను వదలిన వాఁడే నిజమైనత్యాగి. లేక మిగిలిన వన్నియు వ్యాపారములే. అందఱను శిష్యులను జేకొని తిరుగుచు, తాను వారందఱి కంటె శ్రేష్ఠుఁడ ననుకొనుటయె అధిక సన్మానము ప్రాప్తించుట కుపాయములు. నేనెవరి చెవులో నూదను. చెవిలో (మంత్రము) నూదక, వాని చిత్తము నాకర్షించి, వీఁడు నా దగ్గఱ నుండిపోవలెను; ఇంకొక చోటుకు శిష్యుఁడుగ వెళ్ళరా

దను మానసిక ప్రవృత్తిలో నుండుట కూడ ఒకవిధముగ శిష్యులఁ జేకొనుటయే. ఇది ద్రవిడ ప్రాణాయామ మైనది. అనఁగా నిటు సరిగా ముక్కుపట్టుకొనక తలవెనుకగఁ ద్రిప్పి ముక్కుపట్టుకొన్నటు లుండును. శిష్యులను జేకొనరాదు, నే నెవరిని శిష్యులుగఁ జేకొన నని యనువాఁ డందఱును దన శిష్యులుగాఁ జేకొనఁ గోరుచున్నాఁ డని గ్రహింపవలయును. ఎవనికైన నిట్లు చెప్పుట కతని కధికార మెక్కడిది? జగద్గురువు కావలెనని ప్రతిజీవికి స్వాభావికముగఁ గోరికయుండును. తన తరువాత తన వంశ ముండవలె నని ప్రతి మానవునకును గల స్వాభావికమైన సశింపని కోరిక. పూర్ణ బ్రహ్మజ్ఞానము కలుగనంతవఱకు, విశుద్ధభక్తి ప్రాప్తించ నంతవఱకు లక్ష ప్రయత్నములు కావించినప్పటికిని యీ వాసన పోదు. నీ వది చేయుము, ఇది చేయుము. ఇది యుండితీరును. అది యుండి తీరును, అవశ్య ముండితీరును. దీని నెవరును బోఁగొట్టఁజాలక పోయిరి, పోఁగొట్టుకొనలేరు. ప్రకారాంతరము లేకున్న అవి బూరుగు చెట్టుయొక్క రెండు పత్రములు.

వంశములు రెండురకములు. ఒకటి బిందువంశము, మఱియొకటి నాదవంశము. తన వీర్యమువలన సాగుచున్న పుత్రపౌత్రాదుల వంశమును బిందువంశ మందురు. దీని యొక్క ఆధానము మాతృయోనిలోఁ జేయఁబడును. అక్కడ నుండియే యిది వృద్ధిపొందును. మంత్రపరంపరచే వృద్ధి పొందు వంశమునకు నాదవంశ మని పేరు. దీనియొక్క ఆధానము చెవిలోను, హృదయములోను, మనస్సులోను గురువు చేయును. ఈ పరంపరకే గురుపరంపర యందురు. ఒకని

వలన మఱియొకనిలోనికి శక్తి వచ్చును. ఇది శిష్య ప్రశిష్య రూపమున వృద్ధిఁబొందును. ఈ వంశపరంపర నక్షుణ్ణము కావించుకొనుటకు గృహస్థులందఱును సుయోగ్య పుత్రుని గాంక్షింతురు. ఇఁకఁ బరమార్థపథ పథికులు – వారు గృహస్థులు కానిండు, విరాగులు కానిండు, అందఱును దమ శిష్య పరంపరను నిల్పుకొనుట కుత్సహింతురు.

ఈ విధముగ దోషమునే చూచు నెడల నందఱలోఁ గొంచెమో గొప్పయో దోష మవశ్యము లభించును. ప్రపంచములో భగవంతుఁడు తప్ప నిర్దోషి లేనే లేఁడు. అయితే యిఁక మిగిలినది, యాదోషమునే సంశోధాయముచే నివారించుకొనవలెను. ఏదో యుత్తమ యుక్తిచేఁ జేయవలెనను కొనుటకు సాధన మందురు. విరక్తులు చాలమంది శిష్యాదులను గ్రహించుట నిషేధము. శిష్యులను జేకొను వృత్తి కలవారు శిష్యులను జేసికొనుటలోనే వివశులై యుందురు; కాని వృత్తి త్యాగము కావించి విరక్తులైనవారు శిష్యాది సుడిగుండములో బడరా దని శాస్త్రకారులు నిషేధించిరి.

'నశిష్యా ననుబధ్నీయాత్
గ్రంథా న్నైవాభ్య సేద్బహూన్'

భాషలో నొకటికంటె నెక్కువ వస్తువు లుండిన యన్నిటికి 'బహు' అను సంజ్ఞ కలదు. సంస్కృతములో నేకవచనము, ద్వివచనము, బహువచనమని మూఁడువచనములు కలవు. అనఁగా రెంటికంటె నెక్కువ వస్తువులుండిన, వానికి బహు సంజ్ఞయగును. ఇక్కడ 'శిష్యాన్' అనునది బహు వచ

నము. దీని తాత్పర్యమేమనఁగాఁ గావలెననిన శిష్యుల నొకనినో, యిద్దరినో చేకొనవలెను గాని, యిద్దరి కంటె నధికముగ శిష్యులను ద్యాగులు, విరాగులు, సన్న్యాస వృత్తిలోఁ దిరుగువారు చేకొనరాదనియే. ఈ విధముగానే 'చాల గ్రంథములను గూడ నభ్యాసము చేయరాదు' అని కలదు. ఇచ్చట నన్యగ్రంథములను జదువుటకే నిషేధము కాదు. 'అభ్యాస' శబ్దమున కర్థము ఒక వస్తువును మాటి మాటి కావృత్తి కావించుట; అనఁగా గ్రంథములను బ్రసంగ వశమునఁ జూడవలసివచ్చినఁ జూడుము, కాని ఉపనిషద్బ్రహ్మసూత్రాది యొకటి రెండు గ్రంథములను మాటి మాటి కావృత్తి కావింపుము.

ఈ న్యాయాను సారముగ నేను ఇద్దరి నింకను జేకొన లేదు కాని, ఒక్కనే శిష్యునిగఁ జేకొంటిని, ఒకే గ్రంథమును శ్రీమద్భాగవత మహాపురాణ పరమహంస సంహితను - మాటి మాటికి ఆవృత్తి కావింప నిశ్చయించితిని. ఏలననఁగా దీనిలో నుపనిష ద్వేదాంతాది సమస్త శాస్త్రముల సారము వచ్చును. *

నేను నిరంతరము శ్రీమద్భాగవత పారాయణ కావిం చుటఁ గాంచి, యొక దినమున నా శిష్యుఁడు 'మహారాజుగారు, మీారెల్లప్పుడును శ్రీమద్భాగవతమునే చదువుచుందు రేల?' అని అడిగెను.

---

* శ్లో॥ అర్థోఽయం బ్రహ్మసూత్రాణాం సర్వోపనిషదామపి।
గాయత్రీ భాష్య రూపోఽసౌ శ్రీమద్భాగవతాభిధః॥

"అన్నా! శ్రీమద్భాగవతము సమస్త శాస్త్రముల సారము. సమస్త వేద, వేదాంత, ఇతిహాస పురాణాదులలోని సారము నంతయుఁ గైకొని శ్రీ శుకదేవుఁడు పరీక్షిన్మహారాజుకు వినిపించెను. అన్నిటి సారము దొరికినప్పుడింక నన్య శాస్త్రములందు శ్రమించుట కేవలము భ్రమ మాత్రమే యగును" అని నే నంటిని. *

"మంచిది, ఇది సత్యమే, కాని మీరు శ్రీమద్భాగవతమునకు చాల సప్తాహములు చేతురు, చేయింతురు. ఎక్కడికి వెళ్ళిన నక్కడ సప్తాహము చేయుదురు. దీని యభిప్రాయమేమి?" యని శిష్యుఁడడిగెను.

"నీవు చాల పిచ్చివాఁడవోయి! సప్తాహ మని దేని నందురో అది తెలియనే తెలియదా? శ్రీమద్భాగవతమును ఏడు దినములలోఁ బారాయణము చేయుటకు సప్తాహమందురు" రని నే నంటిని.

శిష్యుఁడు శీఘ్రముగా "అది కాదండి! మహారాజుగారు! ఏడు దినములలోఁ బారాయణము కావించుటకు సప్తాహ మందురని నాకుఁ దెలియును; కాని నే నట్లడుగు నభిప్రాయ మేమనఁగా, మన మేడు దినములలోనే యేల చేయవలయును? ఒక సంవత్సరములోఁగాని; రెండు సంవత్సరములలోఁగాని, ఆఱు నెలలోఁగాని యేల చేయరాదని" అనెను.

---

* శ్లో॥ సర్వవేదేతిహాసానాం సారం సారం సముద్ధృతమ్
స తు సంశ్రావయామాస మహారాజం పరీక్షితమ్॥

"అవును, ఇదియు సత్యమే. సప్తాహ పారాయణమును రాజసమనిరి. మాసపారాయణమును సాత్త్వికమనిరి. ఒక వర్షము చేయు పారాయణమును దామసమనిరి. శ్రీమద్భాగవతమునకు పాక్షిక, మాసిక, వార్షిక పారాయణలన్నియు నుండు"నని నేనంటిని.

"కాని మహారాజుగారూ! ఈ రోజులలో సర్వత్ర 'భాగవత సప్తాహ యజ్ఞ' మనియే విశేషముగ వాడుకకలదు. పాక్షిక, మాసిక పారాయణ యజ్ఞములనుగూర్చి యెక్కడను వినలేదే" అని శిష్యుఁడనెను

"అన్నా! చూడు, సప్తాహయజ్ఞమాహాత్మ్యము విశేషముగ నెన్నఁబడుచున్నది. పద్మ పురాణాంతర్గత ౬ అధ్యాయములలో శ్రీమద్భాగవత మహాత్మ్య వర్ణనము చేయఁబడినది. అది సాధారణముగ నిప్పుడు ప్రచారములో నుండిన సమస్త శ్రీమద్భాగవత గ్రంథములతో ముద్రింపఁబడినది. దానిలోనే శ్రీమద్భాగవత సప్తాహ ప్రశంస కావింపఁబడినది. దానిని గూర్చిన గుణగానము చేయఁబడినది. అన్నా! నిశ్చయమే. ఈ కలియుగములోని జీవులు చాల పెద్ద వ్రతములను, ఉపవాసములను, అనుష్ఠానమును జేయఁజాలరు. సత్యశౌచాది విముక్తులై దీర్ఘకాల యజ్ఞదీక్షలో స్థిరముగ నుండఁజాలరు. చాలకాలము వఱకు మనస్సునకు విరుద్ధముగ నడువఁజాలరు. అట్టివారికీ సప్తాహ యజ్ఞమే చాల యుత్తమమైనది. ఏడు దినముల వఱకు మిక్కిలి యుత్సాహము నిలిచియుండును. విఘ్నములు కలుగఁజాలవు. అందుకనియే సప్తాహ యజ్ఞ ప్రశంస కలదు. ఈ యజ్ఞము సర్వోపయోగకరమైనది కూడ.

ఆ కారణమున దీనిని గూర్చి సర్వత్ర ప్రశంస కలదు" అని నేనంటిని.

"అట్లైన నీ సప్తాహ యజ్ఞాచారము ప్రాచీన మైనదే!" అని శిష్యుఁ డడిగెను.

"అయితే దీనిని నేనే యేర్పఱచినా ననుకొంటివా యేమి? సనాతనాచారము. పరీక్షిన్మహారాజును ఋషి కుమారుఁడు నీ కేడు దినములలో మృత్యువు సంభవించునని శపించెను. అందుకనియే శుకభగవానుఁ డాయనకు సమస్త శాస్త్రముల సారభూతమగు నీ పరమహంస సంహితను ఏడు దినముల లోనే వినిపించెను. అప్పటినుండి సప్తాహాచారము వచ్చెను. సనకాది మునులకు నారదుఁడు కూడ సప్తాహములో వినిపించెను. సూర్యదేవుని యాజ్ఞచే గోకర్ణుఁడుకూడ తన సోదరుఁ డగు ధుంధుకారి యుద్ధారము కొఱకు సప్తాహములో వినిపించెను. ఈ విధముగ నీ సప్తాహముయొక్క పునీత పరంపర జరుగుచు వచ్చెను" అని నేను నవ్వుచు నంటిని.

శిష్యుఁడు శ్రద్ధాసహితముగ 'మహారాజుగారు! చూడండి. పరీక్షిన్మహారాజు సమస్త శాస్త్రముల నెఱిఁగిన వాఁడు. ఆతఁడు ధర్మాత్ముఁడు. బహుశ్రుతుఁడు. సమస్తమైన ఋషులను, మునులను, బండితులను, విద్వాంసులను ఆతఁడు సదా సమ్మానము, సత్సంగము చేయుచుండును. మును లాతని మృత్యువార్తను వినఁగానే సమస్త దేవర్షులు, బ్రహ్మర్షులు, మహర్షులు, రాజర్షులు, ఇతర మునులు, ఋషులు, సిద్ధులు తమ తమ శిష్యప్రశిష్యులతోడను, పుత్ర

పౌత్రులతోడను ఆతని సమీపమునకు వారంతట వారే పరుగిడి వచ్చిరి. దీనినిబట్టియే వారి లోకప్రియత తెలియఁగలదు. పిలిచినను సమీపమునకు రాని మునులు చాలమంది, పిలువకయే యాతని దగ్గఱకు వారికి వారే వచ్చిరి. ఆవును బాలు పిండునంతసేపుకంటె నెక్కువ కాల మొక్కచోట నిలువని శ్రీశుకుఁడు కూడ యోగబలముచే నంతయుఁ దెలిసికొని వ్యగ్రతతోఁ బరువిడివచ్చి, అడుగకయే తనకుఁ దానే యాసనమునఁ గూర్చుండి, ఏడు దినము లొకే స్థానమునఁ గూర్చుండి కథా ప్రవచనము కావించెను. దీనినిబట్టి మహారాజు గొప్ప గుణగ్రాహి యనియు, శాస్త్రవిజ్ఞాత యనియు, విద్యావ్యాసంగి యనియు మనము గ్రహించవచ్చును. ఇట్టివాఁడు శ్రోత. ఆతని బరివేష్టించియున్న ఋషులు, మునులు పరీక్షిత్తునితోఁ బాటు భాగవత సప్తాహమును వినిరి. వారు కూడ ఒకనికంటె నొకరు జ్ఞానులు, విజ్ఞానులు, సర్వసంశయ ఛేత్తలు, బ్రహ్మవేత్తలు, సర్వశాస్త్ర విశారదులు. సప్తాహ యజ్ఞమునకు వీరందఱు శ్రోతలైరి. వీరివంటివాఁడే వక్తయును. శుకమహర్షిని గుఱించి మన మెంత చెప్పినను నది యత్యల్పమే యగును. ఆతనికి చెప్పుటలో శ్రమ యేమాత్రము కలుగలేదు. పరీక్షిన్మహారాజునకుఁగాని యితర ఋషులకు మునులకుఁగాని గ్రహించుటలోను శ్రమ కలుగలేదు. శుకుఁడు శాస్త్రసంకేతమును గావించుచుఁ బోవుచుండెను. సర్వశాస్త్ర సంస్కారములను శ్రోతలు వినుచునే సర్వమును గ్రహించుచుఁ బోయిరి. అక్కడేడు దినములలో జ్ఞాన, ముక్తి, భక్తిప్రాప్తి సరిగా లభించెను. ఇట్లే కుమార

నారద సప్తాహ సంబంధములోఁగూడ నని గ్రహింపవలయును. సప్తాహ యజ్ఞము జరుగరాదని నే ననను. శాస్త్రవిధియగుచో నవశ్యము చేయవలయును. ఆ దివ్యమంత్రవద్భాగవత శ్లోకములను గ్రహింపకున్నను - కేవలము శ్రవణమాత్రముచేత నే-పాపక్షయమై తీరును; కాని విశేషఫలము యథార్థమైన అర్థమును గ్రహించుటచేత నే కలుగును.

ఆ సమయమున సర్వత్ర సంస్కృత ప్రచార ముండెడిది. వక్త జెప్పుకొనుచుఁ బోయెడువాఁడు; శ్రోతలు వినుచుఁ దెలిసికొను చుండెడువారు. కాని యిప్పుడంత సంస్కృత ప్రచారము లేదు. ఇప్పుడు ముందు సంస్కృత పాఠమును జదువుట, మీఁదట అర్థమును జెప్పుట జరుగుచున్నది. ఇంత త్వరగా సమస్త శ్లోకములలోని సంపూర్ణాభిప్రాయము రాదు. అందువలన దాని సంపూర్ణాభిప్రాయమును దెలిసికొన వీలు లేదు" అనెను.

"అవును! నీ మాట నిజము. కేవలము శాస్త్ర శబ్ద శ్రవణమాత్ర ఫలమే లభించును. అర్థము పూర్తిగా రాదు. ఒకవేళ వచ్చినను శ్రోతలు గ్రహింపఁజాలరు" అని నే నంటిని.

అంత శిష్యుఁడు మిక్కిలి వినయ పూర్వకముగ "అయితే మహారాజుగారు! నా దొక ప్రార్థన మున్న" దనెను.

"చెప్పు మదేమియో?" అని నే నంటిని.

"మహారాజుగారు! మీరు దేశీయభాషలో భావార్థమును దెలుపవలెనని కోరుచున్నాను. పద్యములో వలదు.

గద్యములో ఏలననఁగా పద్యమును గ్రహించుటలోఁ గూడ గొప్ప బుద్ధి యుండవలయును. దానికైనను మఱియొకఁడు తెలియఁజెప్పువాఁ డుండవలెను. పద్యములో విస్తార వర్ణన ముండనే యుండదు; దానిలో తక్కువ శబ్దములలో నెక్కువ భావము ప్రకటిత మగును. అందువలన సాధారణ చదువు చదువుకొనినవారు స్వయముగఁ జదువుకొని దానిని గ్రహింప లేరు. గద్యములో నెంతైనఁ బెంచుడు. ఒకే విషయమును మాటిమాటికి విస్తారముగఁ జెప్పవచ్చును. దానిలో నేమి యభ్యంతరము లేదు. కావున మీరు గద్యములోనే చెప్పుఁడు. పద్యములుకూడ అక్కడక్కడ యుండవచ్చును. అవియు సర ళముగ, నందఱుఁ దెలిసికొనఁ దగిన ట్లుండవలెను.

జీవనమున కేకమాత్ర ధ్యేయము భాగవతము. భాగ వతుల గుణగాన మైనపుడు సమయ సంకోచము కావింప రాదు. విస్తారమును భయము చెందరాదు. శ్రీమద్భాగవతము సర్వశాస్త్రార్థ సారమని మీరు చెప్పితిరి. కావున మీరు మొట్ట మొదట సంక్షేపముగ సమస్త శాస్త్రసార సిద్ధాంతము నెఱుక పరుపుఁడు. అదియునుగాక యీ సిద్ధాంతము శ్రీమద్భాగవత ములో నెచ్చట, యే స్థలములో, నే రూపమున నెట్లు ప్రక టింపఁబడినదో కూడ తెలుపవలయును. వేదములలో నే విష యమును గూర్చిన విశేష వివరణ మున్నదో అది ముందుగాఁ జెప్పుఁడు. ఏ వేదములోని భావము శ్రీమద్భాగవతములో నెచ్చటెచ్చట వచ్చినది దాని నుల్లేఖించుఁడు.

స్మృతి ధర్మశాస్త్ర వ్యాకరణము, శిక్ష, కల్పము, జ్యోతిషము, నిరుక్తము, ఛందస్సు మొదలగు వేదాంగ విష

యములను జెప్పి, శ్రీమద్భాగవతములో నివి యెచ్చట నున్నవో తెలుపుఁడు. దర్శనముల ప్రతిపాద్య విషయ మేమి? న్యాయ దర్శనముయొక్క ముఖ్య తత్త్వ మేది? యోగ శాస్త్రముయొక్క అంతిమ లక్ష్య మేది? సాంఖ్యముయొక్క సంక్షిప్త సిద్ధాంతమును జెప్పుఁడు. ఈ విధముగ వైశేషిక, పూర్వ మీమాంసముల సారసిద్ధాంతమును జెప్పి, శ్రీమద్భాగ వతములో నెచ్చటెచ్చట నీ సిద్ధాంతముల నే రూపమున నుల్లే ఖింపఁబడినవో కూడ చెప్పుఁడు. బ్రహ్మసూత్రముల సంక్షిప్త వివరణమును దెల్పుఁడు. వేదాంతాభిప్రాయమును దెల్పుఁడు. వేదాంత సూత్రములద్వారా అద్వైత, విశిష్టాద్వైత, శుద్ధా ద్వైత, ద్వైతాద్వైతములను మతములెట్లు సిద్ధాంతము చేయ బడినవో, ఒకే సూత్రముచే భిన్న భిన్న యాచార్యులు తమ తమ సిద్ధాంతముల నెట్లు పుష్టికావించుకొనిరో చెప్పి, వాటిబీజ ములు శ్రీమద్భాగవతములో నెచ్చట, నేవిధముగా నున్నవో చెప్పుఁడు. ఏలననఁగా శ్రీమద్భాగవతము సమస్త వైదిక ఆచార్యులకు మాన్యమైనది. దానియందు సమస్త సంప్రదా యములవారికి సమానమైన యాదర మున్నది. అదియును గాక బ్రహ్మపురాణములో దేనినిగూర్చి విశేష వర్ణన మున్నది? శ్రీమద్భాగవతములో బ్రహ్మపురాణములోని యే యే విష యములు, యే యే కథ లేయే విధముగ గ్రహింపఁబడినవో చెప్పవలయును. ఏయే శ్లోకము లున్నవున్నట్లుగ భాగవత ములో దొరకును. ఏయే శ్లోకములు తలక్రిందుల మార్పు లతో దొరకునదియుఁ జెప్పవలయును. ఈవిధముగఁ బద్మ పురాణము, విష్ణుపురాణము, శివపురాణము, దేవీభాగవతము,

నారద, మార్కండేయ, అగ్ని, భవిష్యత్, బ్రహ్మకైవర్త, లింగ, వారాహ, స్కాంద, వామన, కూర్మ, మత్స్య, గరుడ, బ్రహ్మాండ పురాణములకు సంబంధించిన విషయములను గూడ చెప్పాడు. ఉప పురాణములలోను, నాప పురాణములలో నే విషయ మున్నదో, వానితో భాగవతమున కెక్కడెక్కడ సంబంధము కలదో దీనినిఁగూడ సంక్షేపముగఁ దెల్పాడు పురాణములలోఁ గల సర్గ, స్థాన, పోషణ, ఊతి, మన్వంతర, ఈశానుకథా, నిరోధ, ముక్తి, ఆశ్రయములను గూర్చి విస్తృత వివరణము కావింపుఁడు. సృష్టి యెట్లైనదో, సృష్టి విషయములో భిన్న భిన్న పురాణములలో నెన్ని మతములున్నదియు, వానిలో నిన్ని భేదము లెట్లు వచ్చినదియు, శ్రీమద్భాగవతములో నెన్ని విధముల సృష్టిని గూర్చిన వర్ణనలు కలదియు, నీవిధముగ నన్ని విషయములను వివరించి చెప్పాఁడు.

భక్తిమార్గములో నెన్ని భేదములు కలవో, శ్రీమద్భాగవతములో వానినిగూర్చి యెచ్చటెచ్చట వర్ణనము కలదియు, నామ మాహాత్మ్య మహత్వము, శ్రీమద్భాగవతములో నివి యెట్లు యెక్కడ నుల్లేఖింపఁబడినవియో యదికూడ తెల్పాఁడు. ఉపనిషత్తు లన్నిటిలో నేయే విశేష వాక్యములను భాగవతీ భాషలో నెచ్చటెచ్చట వర్ణన వచ్చునో, ఇది కూడ తెల్ప వలెను. మహాభారత సారసిద్ధాంతమును జెప్పి, భారతములోని యేయే కథలు భాగవతముతో సామంజస్యము కలదో తెల్పాఁడు. ఏ యే కథలలో నే కారణమునఁ గొంచె మంతరము కనఁబడుచున్నది? శ్రీమద్భాగవత స్తోత్రములలో

నాయీ ఘట్టములలో వచ్చు స్తుతులయొక్క విశేష మహాత్మ్య మును దెల్పెదను. వాటికి విశద వ్యాఖ్యను జేయుదు. పురాణములలో నే కథలకు శ్రీమద్భాగవతములో విశేష మహాత్మ్యము చెప్పఁబడినది చెప్పుచు దాని కారణము దెల్పెదను. కేవలము సంక్షేపముగఁ జెప్పఁబడినవి కథలను గూర్చిగాని, సరళ మనుకొని సంకేతముగఁ జెప్పఁబడినవి యున్నచో వాటిని మన భాషలో విస్తారముచేసి తెల్పెదను. శ్రీమద్భాగవతము మీఁద సంస్కృతములోను, మన భాషలోను, నన్య భాషలలోని వ్యాఖ్య లేవి కలవో వాని విశేషతను జెప్పెదను. ఇవి గాక నే నడుగునవియు, మీకు హితకరమని తోఁచు నవియుఁ గూడ తెల్పెదను. నే నడుగక పోయినను గృపతోఁ దెల్పెదను. ఈ విషయములను గూర్చియే మీరు మీ యభి ప్రాయములను బ్రకటింపుఁ డని నేను విషయసూచిక యిచ్చి యీ నివేదన కావించుట లేదు. నే నొక నిర్దేశము మాత్రము కావించితిని. సంకేతముద్వారా నా యభిప్రాయమును దెల్పితిని. ఇప్పు డింక మీ రేది యుచితముగఁ దలంతురో, యేయే విషయములను గూర్పఁ దలఁచితిరో వానిని జేయుఁడు. అతి సాధారణభాష పఠించిన వ్యక్తియైనను దెలిసికొనఁ జాలినంత సరళముగఁ దెలుపుఁడు.

నా శిష్యుని అతిధోరణి వాక్యములను విని నేను చాల బిగ్గఱగ నవ్వితిని. నవ్వుచు నవ్వుచు నేను “నీ వీ వాక్యము లన్నియు నెక్కడ వల్లించితివి? నీవు వినీ వినని మాటలను వాగుచున్నావు. అరే! నాలో నింతటి సామర్థ్య మెక్కడిది? ఈ శాస్త్రములను నేను విధిప్రకార మధ్యయనము కావింప

లేదు. వీటిని దెలిసికొనఁ జాలినంత విశాలబుద్ధిగాని యోగ్యత గాని లేదు. అట్టియెడ నే నిన్ని విషయముల నెట్లు తెలుపఁ గలను. పిచ్చివాడవులాగున నున్నావు. చీమను మేరుపర్వత మెత్తుమనుచున్నావు. ఆవాలమీఁద భూమినుంచు ప్రస్తావము చేయుచున్నావు. సూర్యుని, దీపముమీఁద నుంచఁ జూచు చున్నావు. ఇవన్నియు నా సామర్థ్యమున కతీతములైనవి. ఇవన్నియుఁ జేయుట, చేయించుట అట్లుంచుఁడు. వీటి విషయ మాలోచించుట కూడ నాయెడల దుస్సాహసమే యగును" అంటిని.

శిష్యుఁడు ప్రాధేయపడుచు "లేదు, మహారాజుగారు! మీరు సర్వము చేయఁగలుగుదురు; మీరు సర్వజ్ఞులు. మీకు కఠినమైన కార్యమేమియు లేదు. మీరు సంకల్పము చేయు టయే ఆలస్యము. మీరు నిశ్చయము గావించి, కటిబద్ధు లైనచో, మీరు చేయఁజాలనిపని యైనను సులభముగాఁ జేయఁగలుగుదురు." అనెను.

నీవు నన్నుఁ బండితుని జేయుచున్నావు. మధురము లగు ముఖస్తుతి వాక్యములను బలికి నన్నేల మఱపింతువు? నేను నీ ముఖస్తుతి వాక్యములను విని మోసపోవువాఁడను గాను. నాకు నా యల్పజ్ఞత, అయోగ్యతలను గుఱించి బాగుగఁ దెలియును. అది నీకును దెలియును గాని నామీఁదఁ బ్రేమచే నిట్లనుచున్నావు. శిష్టాచార ప్రకారముగ పైకీవిధ ముగ మాటలాడుచున్నావు. నీ ప్రశంసనే సత్యమనుకొనిన యెడల నాపతనము తప్పనిసరియే యగును. నీవు హృదయ

పూర్వకముగ నన్ను దృఢముగ విశ్వసించినచో నీవు ఒడ్డున పడినట్లే, నా కారణమున నిసుమంతయు కాదు కాని నీ విశ్వాసబలమున నీవు దాఁటి యొడ్డునఁ బడఁగలవు. కాని నా కా విశ్వాసము కూడ లేదు. లోపలనుండి న న్నయోగ్యునిగఁ దెలిసికొనియు, బయటకు మాత్రము సర్వజ్ఞుడ నను చున్నావు. నేను నీ వలలోఁ బడువాఁడను గాను." అని నే నంటిని.

"మహారాజుగారు! చూడుఁడు, నేను మీ మాట లంగీకరించుటకు నే నబద్ధమాడువాఁడనా ? సరియె, పోనిండు. కొంచెముసేపు మీలో యోగ్యత లేనే లేదనుకొనుఁడు. కాని శ్రీమద్భాగవతమును మీ రంగీకరింతురు గదా?" అని శిష్యుఁడ నెను.

"అన్నా! ఎక్కడ నంగీకరింతును. దాని నంగీకరించుచో, నే నావలియొడ్డున చేరినట్లే" అని నే నంటిని.

శిష్యుఁడు తన మాటమీఁద నిలఁబడుచు "సరియే, మీరు బుద్ధిపూర్వకముగ నంగీకరింపరు; మీకు విశ్వాసము కూడ లేదనుకొనుఁడు; కాని పఠింతురు గదా! కొంచెమో గొప్పయో శ్రద్ధలేనిది యింత పరిశ్రమ నెన్నటికిని జేయఁ జాలరు" అనెను.

"అవును, పఠించుచునే యున్నాను; కాని మనస్సును లగ్నము చేయక, నలక్ష్యముగా, నర్థమును దెలిసికొనకయే చిలుకవలె వల్లించుచుందు"నని నేనంటిని.

తన మాటను నిలుపుకొనుచు "పోనిం డర్థము నెఱుఁగకయే సేవించుచున్నారుగదా! బలమగు నౌషధమును, దాని బల వీర్యములను దెలిసికొనకయే సేవించినచో దాని గుణమది యీయదా యేమి? అగ్ని నేమియుఁ దెలియని పసివాఁడు తాఁకిన వానికి కాలదా యేమి? విషమును బొరపాటునఁ దినిన దాని పరిణామము నది చూపదా?" అని యాతఁ డనెను.

"అవును ఎందుకుండదు. తెలియకున్నను పఠించుటచే లాభము కలుగును. శ్రీమద్భాగవత సేవనము సమస్త విధముల శ్రేష్ఠమైనదే" అని నేనంటిని.

తన పక్షము ప్రబలమగుటను గాంచి యాతఁ డుల్లాసమున నగుచు 'మంచిది' శ్రీమద్భాగవత సేవనము వలన లాభ ముండు నెడల భాగవతమును మీరు శ్రీకృష్ణుని సాకార వాఙ్మయ విగ్రహమందురా?' అనెను.

"అవునయ్యా! శ్రీమద్భాగవతములో నట్లే లిఖింపఁబడినదా?" అని నేనంటిని.

ఆతఁడు నవ్వుచు "శ్రీమద్భాగవతములో నట్లే లిఖింపఁబడినది. కాని దానిని మీరొప్పుకొనరన్న మాట? ఇంతేనా?" అనెను.

"కాదయ్యా! ఇప్పు డంగీకరింతునని యెట్లందును? అంగీకరించిన నేఁడీ మాయామోహములో నేందుకు పడుదును? 'అంగీకరింప' ననుటకును సాహసము లేదు. అది ఆస్తి

కతకు విరుద్ధము. నే నాస్తికుఁడ ననుకొనుచున్నాను'' అని నే నంటిని.

"మంచిది, మీ రంగీకరింతురు. కాని మీ యయోగ్యతాకారణమున దానిశక్తిని ధారణ చేయుటలో మీరు మిమ్ముల నయోగ్యుఁ డనుకొనుచున్నట్లు సిద్ధాంతమగుచున్న'' దని శిష్యుఁడ నెను.

"సోదరా! నీవు వకాలతు నెప్పుడు పఠించితివి? నీవు చాల తీవ్రతర్కమును జేయుచున్నావే'' అని నేనంటిని.

అతఁడు కొంచెము కుపితుఁడై "మీరు చూడుఁడు, మహారాజుగారు, నన్ను వేళాకోళము చేయకుఁడు. నా మాటకు బ్రత్యుత్తర మిండు'' అనెను.

"నీ మాట మూర్ఖతా పూర్ణమైనది. దానికి జవాబేమియు లేదు. పో, నీపని చూచుకొనుము'' అని నే నంటిని.

వాఁడు వెళ్ళ కట్లే "ఎవనిని మీరు సాక్షాత్తుగ భగవద్రూపముగఁ జెప్పుకొనుచున్నారో, అట్లే యనుకొని నిత్య నియమముతో దాని సేవారాధనము కావించుచున్నారో, దాని శక్తివిషయములో మీ రేల విశ్వసింపరు? భగవంతుఁడు సర్వము జేయ సమర్థుఁడు. భగవంతుని విషయ మట్లుంచుఁడు. భగవద్భక్తుఁడే అసంభవ విషయములను సంభవము కావింపఁ గలఁడు. జ్ఞానదేవుఁడు గేదె నోటికుండా అందఱి యెదుట వేదమును జెప్పించెను. రైదాసుఁడు సమస్త బ్రాహ్మణ పంక్తిలోనికి భగవంతుని గూర్చుండఁ బెట్టుకొని చూపించెను.

అందఱ యెదుట భగవన్మూర్తిని తన దగ్గఱకుఁ బిలిచెను. ఇట్టి వింక ననేక దృష్టాంతములు కలవు. బ్రాహ్మణులు తమ మంత్రశక్తిచేఁ బాషాణ ప్రతిమయందు ప్రాణప్రతిష్ఠ కావించి దానిని దేవునిగాఁ జేయుదురు. భక్తులలోనే యిట్టి సామర్థ్య మున్నప్పుడు భగవంతుఁ డెవనిచేనైన నెంతటి కార్యమునైనను జేయింపఁగలడు. అతి బాల్యములో నుండు పిల్లవానికైనను బుద్ధియోగము నిచ్చి గొప్ప గొప్ప శాస్త్రములను జెప్పింపఁ గలఁడు. ఐదేండ్లవాఁ డగు ధ్రువునిలో స్తుతిచేయు సామర్థ్య మెక్కడ నున్నది? కాని భగవత్కృప కలుగునప్పటి కాతఁడు వేదశాస్త్ర సమ్మతమైన యెంతటి భావపూర్ణస్తుతిని గావించెను! మీరు శ్రీ భాగవతమును శరణు వేఁడితిరా, అదియే మీకు శక్తిప్రదానము కావించును" అనెను.

"కావించును. అయితే నిన్నడిగి కావించునా యేమి? కావించునపుడు చూచెదముగాక" అని నేనంటిని.

ఆతఁడు నిరాశా స్వరముతో "అయితే నా ప్రార్థనము నిష్ఫల మగునా?" అనెను.

"నీప్రార్థన మసంభవము. నా సామర్థ్యమున కతీతమైన కార్యమును నీవు చేయు మనుచున్నావు" అని నేనంటిని.

అతఁడు చాల కుపితుఁడై "మీరు అసంభవము, అసంభవము అనుచున్నారు. ప్రపంచములో నసంభవమేది? మీరు మమ్ములను జ్ఞాపకము పెట్టుకొనవలెను. మేమెల్లప్పుడును మీసేవలోనే యుందుము" అనెను.

"అసంతుష్టుఁడ వేల యయ్యెదవు? నీవు నామమునకే శిష్యుఁడవు. నిజముగ నాకు గురువు. సేవా వస్తువే యిట్టిది. సతి సాధ్వి పతివ్రతయగు స్త్రీ తన యయోగ్యపతిని తన సౌజన్యముచేతను, సద్వ్యవహారము చేతను, తన వశము కావించుకొనునట్లును, భక్తుఁడు భగవంతుని తనవశము చేసికొనఁగా భగవంతుఁడు వాని వెంటఁ దిరిగినట్లును నీవు నన్ను నీవశము చేసికొనినావు. నేనా పుట్టురోగిని. అదియునుగాక సుఖముగా నుండవలెనను కోరికయుఁ గలదు. నేను నీ యధీనుఁడను. నీవు నన్నంగీకరింపకున్న నొక ఉపాయమున్నది" అని నేనంటిని.

ఆతఁ డుల్లాసముతో "అదేమి యుపాయము?" అనెను.

"చూడుము. నైమిశారణ్యములో నెనుబది యెనిమిది వేల మునులుండెడు వారు. వారింకను గొందఱు చావలేదు. వారు నీవలె నావలె బద్ధజీవులు మాత్రము కారు. వారు నిత్యజీవులు. వారి కాయు వొకకల్పము. భూమిమీఁదఁ గలియుగ ప్రభావమును గాంచి వారు మహర్లోకమునకు వెళ్ళిపోయిరి. సూతుఁడచ్చట కూడ ప్రతి దినము కథలు చెప్పుచుండును. ఆయనవద్దఁ సాప్తాహిక, పాక్షిక, మాసిక, వార్షిక పారాయణ నియమము లేదు. నిత్యము కథ జరుగుచుండును. వారందఱు బ్రహ్మజ్ఞానులగు ఋషులు. వారి కార్యము లన్నియు విశేషించి లోకకల్యాణము నిమిత్తమే యుండును. ఇప్పుడు పుణ్యభూమియైన భారతదేశములో సంస్కృత విద్యను జదువుటయుఁ జెప్పుటయు నతి స్వల్పమని సర్వజ్ఞులగు ఋషులకుఁ దెలియును. కేవలము సంస్కృతములో కథలు సర్వ

సాధారణుల కుపకారము జరుగదు. అందువలన సూతుఁ డచ్చట దేశీయ భాషలోనే కథను జెప్పుచున్నాఁడు. ఆ సర్వజ్ఞులైన ఋషులకు భూత భవిష్య ద్వర్తమానములలో నే భాషయుఁ దెలియనిది లేదు. వారు గుణగ్రాహులు. భాష నెన్నడును నిరాదరింపరు. దేశీయభాషాకథనే వారు మిక్కిలి ప్రేమతో విందురు.

సూతుఁ డా కథను జెప్పుచుండును. దానిని నేను వినఁగలను. విన్న దేదియో యట్లే వ్రాయుచుందును. నీవు చదువుచుఁ బోవలయును. ఇప్పుడు యోగ్యతాయోగ్యతల ప్రశ్నయే లేదు. నే నొక వ్రాయు యంత్రము నైతిని. కాని దీనికి నీ సహాయము కావలసియుండును" అని నే నంటిని.

ఆతని ముఖము విప్పారెను. ఆతఁ డుల్లాసముతో "అవును, మహారాజుగారు! మీ రాజ్ఞాపించినది నేను జేయుటకు తత్పరుఁడనై యున్నాను. నే నేమి చేయవలయును? మీ రా సంవాదము నెట్లు వినఁగలరు?" అనెను.

"సోదరా! ఈ వాయుమండలములో మాట్లాడిన శబ్దము నాశము కాదు. దానిని యుక్తిద్వారా వినవలెను. ఎక్కడ శబ్దము కదలుచున్నను కూర్చుండియే వినవచ్చును. ఈ విధముగనే మహాశ్లోకములో సూతుఁడు, ఋషులు చేసి కొను సంవాదమును - నేను, నీవు యిద్దరము కలిసి యేకాగ్ర చిత్తులమై వినఁగలము. నీవు నీచాంచల్యమును వదలి నాకు సహాయపడవలెను. నేను నీసహాయతను బొంది వ్రాయుచుందును. నీవు చదువుచుండవలెను. కాని యీ పని

నెల, రెండు నెలలలో నగునది కాదు, చాలకాలము పట్టఁ గలదు.'' అని నేనంటిని.

''షుమారు ఎంతకాలము పట్టును?'' అని ఆతఁడడిగెను.

''ఆరేడు సంవత్సరములకు తక్కువ పట్టదు. ఇంత కంటె నెక్కువ కాలము కూడ పట్టవచ్చును. అంతవఱకు నీ వొకే చోటనుండి నాయీ కార్యములో దత్తచిత్తుఁడవై సహాయము కావింపవలయును'' అని నేనంటిని.

దీనిని విని యాతఁడు చకితుఁడై, కొంచెముకాల మాలోచించుచు ''మహారాజుగారు, ఇది కొంచె మసంభవ ముగఁ దోఁచుచున్నది'' అనెను.

నేను నవ్వుచు ''నీ విప్పుడేకదా అనినది – 'అసంభవ మనునది లేనే లే'దని, నీకు దీనివలన నేమి బాధ?'' అని అంటివి.

ఆతఁడు కొంచె మాఁచి యాఁచి ''లేదు బాధ, బాధే మియు లేదు. కాని నాకు మీా వెంబడియుండి నిత్య నూతన పురుషులతో కలియుటయు, క్రొత్త క్రొత్త స్థానములకు వెళ్ళుటయు, పెద్దపెద్ద సుందరములగు వస్తువులను గాఁజేయు టయు, మంచి మంచి మోటారులలోఁ గూర్చుండుటయు, సుందర సుగంధిత మాలలను ధరించుటయు నభ్యాసమైనది. ఇంతలోనె యొక్కచోట నాచిత్తమెట్లు లగ్నమగును?'' అనెను.

"చూడుము, చిత్తము లగ్నమగు నుపాయము నేను చెప్పెదను. నాతోఁ నెల్లప్పుడును సేవాపూజలలో సంలగ్నమై యుండుము. కథామండపములో జరుగు కథను వినుచుండుము. కీర్తన జరుగును. అప్పుడు దానిలోఁ జేరుము. మనః ప్రసన్నత కొఱకు ఇక్కడ యింత భూమి యూరక పడియున్నది. దీనిలో భగవత్పూజకొఱకు సుందరములగు పుష్పజాతులను నాటుము. గులాబియున్నది. గంధరాజమున్నది, మొల్లలున్నవి, బంతు లున్నవి, తగరు వున్నది, విరజాజియున్నది, ములుగోరింట యున్నది; ఈ మొక్కలను వేయుము. మల్లె, చేమంతి, అడవిమల్లె, మాలతి, సంపెంగ వీటినిగూడ వేయుము. మామిడి, దానిమ్మ, జామ, కమలాఫలము, బత్తాయి నారింజ, నేరేడు, పనస, బొప్పాయి మొదలగు ఫలవృక్షము లను వేయుము. ఇవ్వేళ యీ మొక్క యింత పెద్దదైనది, ఈ లత యింత పెరిగినది, నేఁడు దీని పూలుపూసినవి అని ప్రతిదినము చూచుచుండుము. దీనివలనఁ జిత్తమానందము చెందును. ప్రేమ యుండును. ఇప్పుడు దీని పండ్లు పండినవి. ఇప్పుడు దీనికి పూలు పూచినవి అనుటచేతను జిత్తము ప్రసన్న మగును. ఈ మానవులతో మాటాడునపు డెవఁడైన సుందరముగ నున్నను, వాక్కు మధురముగ నున్నను, భక్తి యున్నను, గుణవంతుఁడైనను వానిమీఁద రాగము కలుగును. ఎవఁడైనఁ గ్రోధియైనను, మన విషయములను ఖండించువాఁ డైనను, ఉద్ధతుఁడైనను, అభిమానియైనను వానిని జూచిన ద్వేషము కలుగును. కాని యీ వృక్షములలో నది లేదు. మనము ప్రేమించిన, యివి మనలను మిక్కిలిగఁ బ్రేమించును.

తెలిసికొను శక్తి లేదు కాని, యివి మాటలాడగలవు. మఱి యొక్క-మాట, సావధానముగ నుండవలయును. లేకపోయిన కుక్క-ను గొట్టినవానిగతి యగును." అని నేనంటిని.

"కుక్క-ను గొట్టినవాని గతి యంటిరేమి, మహారాజు గారు?'' అని ఆతఁడనెను.

"శ్రీరామచంద్రుని రాజసభలోని కొక కుక్క- వచ్చి 'ఫలాని వ్యక్తి నే నేమియు నపరాధము చేయకున్నను నన్నుఁ గొట్టినాఁ'డని మొఱపెట్టుకొనెను. నేరస్థుఁడు పిలిపింపఁ బడెను. ప్రశ్నించి విచారించిన మీఁదట కొట్టినవాఁడే వాస్తవముగ నపరాధి యని తేలెను. ఆతఁడు నిరపరాధియైన కుక్క-ను గొట్టెను. అంత భగవంతుఁడగు రామచంద్రమూర్తి వాని కేమి శిక్షవేయుదునా యని యాలోచించుచుండెను. అప్పుడా కుక్క- 'వీనికి నేను చెప్పు శిక్షను వేయుఁడు. వీనిని ఫలాని మఠమునకు మఠాధీశుని గావింపుఁడు' అనెను. దాని యీ వాక్యమును విని సభాసదులందఱును నవ్వి 'ఇది శిక్షయా, పారితోషికమా?' అనిరి.

అప్పుడా కుక్క- "ప్రభో! నేనుగూడ యిట్టి మఠమునకు మఠాధీశుఁడనే. దానికి కలిగిన ఫలమును మీరందఱు చూచుచునే యున్నారు. అందువలన నింతకుమించి వేఱొక శిక్ష వీనికి మంచి దని నేను దలఁచుటలేదు." అనెను.

ఇది విని యాతఁడు 'లేదు మహారాజుగారు! ఈవిషయములో మీరు నిశ్చింతగ నుండుఁడు. ఇది యున్నచోట వ్యర్థముగ ఖర్చు ఆరంభ మగును'' అనెను.

"వ్యర్థవ్యయము విషయము నేననుటలేదు. శరీర మున్నప్పుడు భూమిపైన నివసింపవలయును. ఎక్కడను ఆకాశములోఁ గుటీరము వేసికొనవు గదా! ప్రయాగరాజమునకు మించిన పాపనాశకము, పరమ పుణ్య ప్రదమైన తీర్థమెచ్చట దొరకును? బ్రదికియున్నన్ని నాళ్ళుండుము. అయితే ప్రయత్నపూర్వకముగ నుండుము" అని నేనంటిని.

"భగవదేచ్ఛ ప్రకారము జరుగును. అయితే మీ రా సంవాదము నెప్పుడు వినిపింతురు? ఎప్పుడు వ్రాయుదురు? మీకు వ్యవధియే లేదు కదా. ఎప్పుడును బనిలోనే నిమగ్నులై యుందురు" అని యాతఁ డనెను.

"సోదరా! చూడుము. ఇక్కడ తీరిక చిక్కదు. ఇక్క డెప్పుడు కార్యక్రమముతోఁ గట్టుపడి యుందును. ప్రాతఃకాలమున నరుణోదయ సమయమునకుఁ బూర్వము త్రివేణీ స్నానమునకు మనమిద్దరము వెళ్ళుచుందుమే, ఆ సమయమున నౌకలో వచ్చునపుడును, బోవునపుడును వ్రాయుదును. ఆ సమయముకూడ చక్కనిది. ఆ సమయమున సంభాషణముకూడ వినఁబడును. గంగమధ్యలో వ్రాసినచో నబద్ధము కూడరాదు. ఏదైనఁ బ్రమాణము చేయవలసి వచ్చిన యెడల నే నీమాటను గంగలో నిలుచుండి చెప్పుచున్నానని ప్రమాణము చేయుదురుగదా! ఒక్క విషయము. నీవు నాతోఁగలిసి యుండి, ఏకాగ్రుఁడవై నాతోఁబాటు వినునెడలను, కొంచెమైన చంచలతను జేయకుండునెడలను, నేను దానిని విని వ్రాయఁగలుగుదును; కాని నీవు గడబిడ చేసితివా అంతయుఁ బేడయు బెల్లము కలిపినట్లగును. అప్పుడేమియు వ్రాయఁ

జాలను. నీవు మరణింపనంతవఱ కిది యున్నది. నీవు మరణించి నను లేక నీ(త్రోవ నా(త్రోవ వేఱైనను నీ సంభాషణము సగములో నేనిలిచిపోవును. కానిందు, "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్" ఈ మార్గములోఁ జేయబడిన కించిత్కార్యమైనను, చాల భయముల నుండి రక్షింపఁ గలుగును" అని నే నంటిని.

"సరియే మహారాజుగారు, నిశ్చయమే. నా కన్నియు నిష్టమే. ఇప్పు డింక మీరు శ్రీమద్భాగవతములో వచ్చు భగవంతుని యొక్కయు, భక్తులను గూర్చినవియు నగు కథలను విస్తారపూర్వకముగ సమస్త విషయములను నిస్సంశయము కావించుచు సద్దమువలె మెఱయునట్లు మన భాషలో వర్ణింపవలయును. భాగవతీ కథ లన్నియుఁ బూర్తియైన తర్వాత నేనడిగిన విషయములను గూర్చి వర్ణింపవలయును. ఇంక మీరు జయార్థ మంగళాచరణము చేయుఁడు. 'తతో జయముదీరయేత్' అని యాతఁడ నెను.

ఈ విధముగా నాకు నా శిష్యునకు ఒడంబడిక జరిగినది. దాని పరిణామముననే యీ గ్రంథావళి యారంభమైనది. దీని కంత మెచ్చటనో, ఏ స్థలములో నెప్పుడగునో, యిది సర్వాంతర్యామి హరియే యెఱుఁగును. యంత్రమునకు దీనితో నేమిపని ? దీనిని గూర్చి యంత్రి చింతించవలయును.

' మహారాజుగారు ! మీ రింత చాటభారతమంత గురుశిష్య సంవాదమును వినిపించితి రే, కాని మీ రా యేకమాత్ర ప్రియశిష్యుని పేరుమాత్రము చెప్పనేలేదు. మీ దగ్గఱ దీక్ష

కొనకున్నను చాలమంది మిమ్ములను తమ గురువని చెప్పు
కొనుచుందురు. మీరో నా కొక్కఁడే శిష్యుఁ డనుచున్నారు.
వాఁడైనను మీ మాటలనుబట్టి మీ స్వాధీనమున లేనివాఁ
డనియుఁ, జంచలుఁడనియు తెలియుచున్నది. వాని పేరు
చెప్పుడు. భగవంతుఁడు తప్పజూచి మీ రీ మధ్య కన్నుమూసి
నచో మీకు ఉత్తరాధికారిగా వానిని జేసెదము. అని పాఠకు
లనవచ్చును.

నా యేకమాత్ర శిష్యుని నామము ‘నా మనస్సు.’
యథార్థమునకు శిష్యునిగాఁ జేసికొనవలసిన దిదియే. దీనికి
దీక్షనిచ్చి వశమందుంచుకొనినవాఁ డీ జగత్తు సంతను వశమం
దుంచుకొనినట్లే. ఆతఁడే యథార్థ గురుపదమున కధికారి.
వీనిని వశము కావించుకొనక గురువగువాఁడు కేవలము వాఁడు
వ్యవహారమాత్రమునకే. పరమార్థములో వాని కేదైన యుప
యోగమున్నచో నది లేనిదానిక్రింద లెక్కయే. ఈ నా విలా
సియుఁ జంచలుఁడు నగు శిష్యుఁ డిప్పటి కింకను వశపడలేదు.
అందువలన నేను గురు వని పిలువఁబడక గరువ నగుచున్నాను.
వ్యాపారసంబంధమైన లెక్క వేయుటకు చెప్పు సూత్రమునకు
వారు ‘గురు’ వందురు. ఎట్లనఁగా

ఒక రూపాయ కెన్ని సేరులో (సేరనఁగా ౮౦ తుల
ములు) ఒక అణా కన్ని చటాకులు. (చటాకు ౫ తులములు)
ఇది యొక ‘గురవు’. ఏదైన వస్తువు రూపాయకు పదిమూమ్పా
తిక సేర్లు వచ్చిన వనుకొనుఁడు. ఒక అణాకు పదిముప్పాతిక
చటాకులు వచ్చును. దీనికి లెక్క వేయవలసిన పనియే లేదు.
ఒకని జీతము రోజున కెన్ని అణాలో దానిని రెట్టింపు

చేసి, ఆ సంఖ్యను రూపాయలుగా భావించి, అన్ని అణాలను దానిలోనుండి తీసివేసినవానికి నెల జీతమెంతో వచ్చును. ఒకఁడు రోజుకు ఎనిమిదణాలు సంపాదించుచున్నాఁడనుకొనుఁడు. ఎనిమిదికి రెట్టింపు పదునాఱు. పదునాఱు రూపాయలలో పదు నారణాలు తీసివేసిన నెలకు రు ౧౫-౦-౦ లు వేతనమయ్యెను. దీనికి లెక్కవేయవలసిన పనిలేదు. దీనిని వ్యాపారిక 'గుర' వందురు. నేను గురువునుగాక గుడను నగుదును. గుడ మనఁగా బెల్లము. గుడము చెఱకు నొక్కఁగా లావుగాను, బుష్టిగా నైనది. తర్వాత తీపి యని తెలిసికొని దానిని ప్రజ లెగురఁగొట్టుదురు.

లేక 'గురు'వును గాక గోరూ నగుదును. వంగభాషలో 'గురువు'నకు గోరూ వలె నుచ్చరింపఁబడును. గోవులను, గేదెలను గోరూ అందురు. ఆవులను గేదెలను పాలిచ్చునన్నాళ్ళు బాగుగానే చూతురు. పాలీయక పోయిన దాని సంగతి అడుగున దెవరు? చివరకు వేళకు నీరైనఁబెట్టరు.

లేక 'గురు'వును గాక గరూ నగుదును. మార్వాడీ భాషలో గురువునకు 'గరూ' అని యుచ్చరింతురు. గరూ అనఁగా బరువు. నౌకమీఁద దాఁటవలెనను నాశతో నందఱు నెక్కుదురు; కాని నౌక యెక్కడ (గరూ) బరువైనప్పు డది మునిఁగిపోవును, తనతో బాటు కూర్చుండినవారి నందఱను ముంచి వేయును.

కావున నేను నా యీ యజ్ఞానపు శిష్యునకు నిత్యము విద్యగఅపుదును. 'చూడు నాయనా, నా గురుత్వమంతయు

నీపై నాధారపడియున్నది. నీవు సరియైన చోటుకు వచ్చితివా, మంచిదే. దానివలన నీవు నుద్ధరింపఁబడుదువు. నేను నుద్ధరింపఁబడుదును. నీవు లోభులోఁబడి, నన్ను నీవు వశపఱచుకొని విషయలోలతలోని కీడ్చితివా నరకమార్గము తెఱవఁబడినట్లే. సామెత యొకటి ఉన్నది— "లోభియగు గురువు లోలత్వము గల శిష్యుఁడు నరకములో నెట్టఁబడుదురు" అని. ఇదియే నా యాత్మకథ. ఈతఁడే యీ భాగవతీ కథను వ్రాయుట కారణము. నేను నాశిష్యుని యీకార్యమునకుఁ బ్రశంసింతును. ఏదోవిధముగ భాగవత చింతన స్మరణముచేయు నవసరము లభించెను. ఇక పాఠకులారా! ఈ గురుశిష్య సంవాదమును సమాప్తము కావించి ముందు రాఁబోవు శుకశౌనక సంవాదమును వినుఁడు.

ఛప్పయ

సురసరి ఉత్తర ఓర్ త్రివేణీ పార్ మనోహర
ప్రతిష్ఠానపుర యజ్ఞతీర్థ ఝూసీ అతి సుందర॥
మనీరామ మమ శిష్య చపల చంచల అజ్ఞానీ
తాహీ కే ప్రతి సుధా సరిస రసకథా బఖానీ॥
దైహిక దైవిక మానసిక, చాహిఁ హోహి భవకీవ్యథా
సబ రోగని కీ ఏక ఈ, ఔషధి "భాగవతీ కథా"॥

అర్థము

గంగానదికి ఉత్తరపు వైపున, త్రివేణికి ఆవలియొడ్డున మనోహరము, అతి సుందరమునైన పూర్వము ప్రతిష్ఠానపుర

మను పేరు కలిగి, యిప్పుడు ఝూసీ యనుపేరున విలసిల్లు నట్టి పురములో యజ్ఞతీర్థమున్నది. అక్కడే యిప్పుడీ బ్రహ్మచార్యాశ్రమము. అచ్చట చపలుఁడును జంచలుఁడును, నజ్ఞానియు నగు మనీరామ్ యను పేరుగల నాశిష్యునకు అమృతోపమానమైన రసవత్తరమైన యీకథ చెప్పఁబడినది. దైహిక, దైవిక, మానసిక సంబంధమైన సమస్తములైన భవవ్యాధుల కొకే ఔషధము "భాగవత కథ".

# జయార్థము

శ్లో॥ నారాయణం నమస్కృత్య, నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వ్యాసం, తతో జయ ముదీరయేత్.*
(శ్రీభాగవతము ౧ స్కం. ౨ అ. ౪ శ్లో.)

ఛప్పయ

శ్రీనారాయణ విమల విశాలా పురీ నివాసీ।
నర నారాయణ ఋషీ తపస్వీ అజ అవినాసీ॥
మాతా వీణాపాణి సరసుతీ వాణీ దేవీ।
కిరూా వేద కో వ్యాస శక్తి సుత హిమగిరిసేవీ॥
ధరి సిర సబకే పాద కీ, పావన పుణ్య పరాగ అతి।
భనూం భాగవత భవ్య భవ, భయహార భాషాయ థామతి॥

ఆద్యంతములు లేని శ్రీమన్నారాయణుఁడును, భూవైకుంఠమగు శ్రీవిశాలపురియందు సదా నివసించువాఁడును, చరాచర జగత్తుకు స్వామియును, శ్వాస ప్రశ్వాసలచేఁ బ్రతిక్షణ మసంఖ్యాకములగు బ్రహ్మాండములను రచించువాఁడునగు సర్వాధారుఁడు, లక్ష్మీకాంతుఁడు, అనంత బ్రహ్మాండ నాయకుఁడు నగు శ్రీమన్నారాయణ భగవానుని పాద పద్మములకుఁ గోటి కోటి ప్రణామములు.

దక్షుని కుమార్తెయు, ధర్ముని పత్నియు, జగన్మాతయైన మూర్తి దేవి గర్భమున నవతరించినవారును, పుట్టినది

---

* శ్రీనారాయణుని, నరుని, నరోత్తముని, సరస్వతీదేవిని, వ్యాసుని నమస్కరించి జయభాగవతాది గ్రంథములను జెప్పవలయును.

మొదలు త్యాగులు, విరాగులు నైనవారును, నైమిశారణ్య, పుష్కరక్షేత్రాది పావనతీర్థములో తమ యునికిచేతను, తపస్సొనరించియుఁ బావనము కావించినవారును, శతక్రతువైన దేవేంద్రుఁడు పంపిన యసంఖ్యాకములగు నప్సరసలు, మన్మథుఁడు, వసంతుఁడు, సమీరుఁడు మొదలగువారు తమ తపస్సునకు విఘ్నము కావింపవచ్చినను వారిని గాంచి వారిపైఁ గుపితులు కానివారును, కామముతోఁబాటు క్రోధమును గూడ జయించినవారును, తమ యూరువులనుండి యూర్వశిని బోలినవారి నసంఖ్యాకములుగ నుత్పన్నము కావించి దేవతలకు విస్మయము కావించినవారును, నిరంతరము తపోనిష్ఠాగరిష్ఠులై జాజ్వల్యమానమైన ప్రత్యక్ష తపోమూర్తులైన నరనారాయణులను నేను నతమస్తకుఁడనై నమస్కారము చేయుచున్నాను.

ఏయమ లేక విశ్వమున వర్ణవిభాగమే లేదో, అస్తిత్వమే లేదో, ఏతల్లి జ్ఞానమును ప్రసాదించినదో, ఏయమ వాఙ్ఝ్ంకారముచేతనే సప్తస్వర సహితమైన సంగీత ముత్పత్తియైనదో యేతల్లికి జగజ్జనని యనియు, కుమారి యనియు ననేక నామరూపములు కలవో అట్టి సరస్వతీదేవి చరణములకు నమ్రుఁడనై నేను శ్రద్ధాంజలిని సమర్పించుచున్నాను.

భగవతి సత్యవతియందు పరాశర భగవానుని వీర్యముచే నుత్పన్నమైనవాఁడును, నొక్క వేదమును నాల్గింటిగా విభాగించి లోకకల్యాణార్థమై దానిని సరళము, సుగమము కావించినవాఁడును, స్త్రీ, శూద్ర, ద్విజబంధువులకు వేదాధి

కారము లేకపోవుటచే వారిపైఁ గృపచూపి పంచమవేదమగు 'మహాభారత' రచనమును గావించినవాఁడును, భరత వంశ మును రక్షించినవాఁడును, అది నశించిపోకుండ కాపాడిన వాఁడును, వేదార్థము నంతను బురాణములద్వారా వ్యక్తము చేసినవాఁడగుటచే దుష్కరమగు జ్ఞానమును సుగమముగ సర్వసాధారణముగఁ దెలిసిన పురుషుఁడు కూడ తెలిసికొను నట్లు చేసినవాఁడును, ధర్మరక్షణము, ధర్మప్రతిపాలనము గావించిన వాఁడును, బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యానముచేసి పరస్పరము విభిన్నముగఁదోఁచు నుపనిషద్వేదాంత వాక్య ముల నేకవాక్యముగ నొనర్చినవాఁడును, సమస్తజ్ఞానము నుచ్ఛిష్టముగ నొనర్చుకొనినవాఁడును, నా యుచ్ఛిష్టజ్ఞానమునే వివిధములగువారు తమతమ భాషలలోనికి చెప్పుకొనునట్లు చేసినవాఁడును, సాక్షాత్తుగ శ్రీహరియొక్క అవతారమైన వాఁడును, ఒక్క ముఖముగల బ్రహ్మయు, రెండు చేతులు గల విష్ణువు, రెండు కన్నులుగల శివుఁడునైనవాఁడును మాన సిక ఖేదమను వ్యాజమున దేవర్షియగు నారదభగవానుని వలన భాగవతజ్ఞానమును బొంది, కలికాలములోని అల్ప మతులు, అల్పాయువు లగువారు అజ్ఞానసాగరమున మునుఁగు టను గాంచి శ్రీమద్భాగవతరూపమగు దృఢనౌకను నిర్మించి స్వయముగఁ గర్ణధారుఁడై వారి నుద్ధరింపఁ బ్రయ త్నము చేసినవాఁడును, జ్ఞానమంతయు సదాచారులగు ఋషు లలో విభక్తమై లోపింపఁగా దానిని రక్షించినవాఁడును, శ్రీమద్భాగవతమను త్రైలోక్యపావన మహాస్వాదురసమును భేదభావములేక వితరణ కావించుటకు పరమజ్ఞానియు, పరమ

విరక్తుఁడునగు తనపుత్రుని శుకదేవుని యుత్పన్నము కావించిన వాఁడును, పుట్టగనే సంసారత్యాగము కావించి వనములకు వెళ్ళఁగా, అతికౌశలముతోఁ బిలిచి, యధికారియని తెలిసి కొని యా శుకునకు భాగవతామృత వితరణము కావించుటకు నియమించినవాఁడును, ఋషులలోఁ బరమ సమ్మాననీయుఁ డును, నకుంఠిత జ్ఞానముగలవాఁడును, త్రివర్గ సాధనములం దును ముక్తి సాధన మందును సమానరూపముగ నిష్ణాతుఁ డైనవాడును, ఎవని దృఢనౌక సహాయమున అనేకులు నజ్ఞా నులై సంసారమున మునిఁగిపోవు జీవు లా సంసార సముద్రము నుండి శాశ్వతముగ దాఁటిపోయిరో అట్టి లోక పితామహుఁ డగు బ్రహ్మ మునిమనుమని పుత్రుఁడును, వశిష్ఠునకుఁ బౌత్రుఁ డును, శక్తికి పౌత్రుఁడును, బరాశరునకు బుత్రుఁడు నగు వ్యాసభగవానుని చరణములకు నేను శ్రద్ధాభక్తి పూర్వక ముగఁ బ్రణామము చేయుచున్నాను. ఓ జ్ఞాననిధీ! ఓ జగ దుద్ధారకా! ఓ పరమ గురుదేవా! ఓ విశ్వవంద్యా! ఈ క్షుద్రజీవిపైఁ గృపజూపుము. నీ పరమపావన పదచిహ్నముల ననుసరించుచు, నే నీ భాషా భాగవత తత్త్వమును నాబోటి విద్యాబుద్ధిహీనుల సమ్ముఖమున నుంచెదను. నాలో విద్యా బుద్ధులు లేవు. నాకు నా విద్యాబలమం దాశ లేదు. నేను సమస్త సాధనా విహీనుఁడను, మతిమలీనుఁడను, దీనాతిదీనుఁ డను. కాని నీ యహైతుకకృప నొక్కదానినే యాధారముగఁ గైకొని సంతమహాత్ముల మనోగతభావముల నెఱిఁగి, వారి యాంతరంగికయాజ్ఞను బొందియే యీ దురూహ్యా దుష్కర కార్యమందుఁ బ్రవృత్తుఁడనైతిని. ఓ అశరణశరణ్యా! నా

మస్తకమున నీ వరదహస్తము నుంచుము. నా మనస్సులోఁ గూర్చుండి ప్రేరేపించుచుండుము. నా చేయిపట్టుకొని వ్రాయించుము. నీ గూఢతత్త్వమును సర్వసాధారణుల సమ్ముఖమున దేశీయభాషా గద్యములోఁ బ్రకటింపఁ జేయుము. దీనిలో నా చాతురి యేమియు లేదు. నీ కార్యమే. మీరు జ్ఞానశ్రోతలు. మీకే యీ పదమునకు ప్రతిష్ఠ కలదు. నేను మీ యాజ్ఞానుసారి యగు క్రీతదాసుఁడను నీ భావములఁ బ్రకాశింపఁ జేయువాఁడను. నీ నిర్జీవ యంత్రమను; నీ వంశమను; నీ వెట్లూదిన నట్టి స్వరములఁ బలికెదను. సమస్త విశ్వమును నీ సుమధుర సంగీతముచే మోహింపఁ జేయుదునో దేవా! నా పునఃప్రణామములను గ్రహింపుము.

ఓ వ్యాసనందనా! నీ కృపలేక యెవ్వఁడును భగవత్తత్త్వమును దెలియఁ జాలఁడు. ఓ సద్గురూ! నిన్నే శబ్దములతో స్తుతింతును? భావము లేదు. భాష లేదు. నీ అవతారము జగజ్జాలములోఁ జిక్కుకొనిన నాబోటి జీవులను రక్షించుటకే. నీవు జన్మతః నిత్య శుద్ధ బుద్ధ ముక్తుఁడవు. నీవు రాధికా కర కమలములలోఁ గ్రీడించు క్రీడాకీరమవు. నీ వా మధురాతి మధుర రసమును స్వయముగ ననుభవించి, దానిని వ్యాస ముఖమున విని ప్రపంచమం దంతటను వ్యాపింపఁజేసితివి. ఈ దివ్యాతి దివ్య మధుర రసమునకు నిజమైన యధికారివి నీవే. ఏలననఁగా నెవని హృదయములో కామవాసన కలదో వాని హృదయములో శ్యామవాస నుండదు. నీకు కామునితోఁ బరిచయము కూడ లేదు. నీ యాత్మను కృష్ణభూత మావేశించినది. నీ వా భూతావేశము చేతనే యిటు నటు భ్రమణము

కావించుచు నాధివ్యాధులను నగ్నిలోఁ బచన మగుచున్న ప్రాణులకుఁ బరమ శీతలతా ప్రదానము కావించుచుఁ దిరుగు చుందువు. నీ వెక్కడను జాలసేపు నిలువనే నిలు వవు. నీ కవకాశము కూడ లేదు; ఏలననఁగా నీ యనాది జగత్తులో ననంతముగ అధికారు లున్నారు. నీవు వారి నందఱను వెదకి పట్టుకొనవలయును. అందఱ నుద్ధరించ వలయును. కాని కృష్ణకథలో నీ వంతయు మఱచిపోదువు. పరివ్రాజకవ్రతమునుఁ బరిత్యాగము కావించి యొక్కచోట కొంతకాల ముందువుకూడా. ఓ నా గురుదేవా! ఆచార్య ప్రవరా! రమ్ము. కొంచెముసేపు నా కలుషిత నీలహృదయ ములోను, నీలలోహ లేఖినిలోఁ గూడ వాసము చేయుము. ఇట్టి యపవిత్రస్థానములోఁ గూడ వసింపుమని ప్రార్థనచేయు టేలకో తెలియునా? వీనిద్వారా యత్కించి త్కృష్ణకథా గాన మసంబద్ధముగనైనఁ గావలెననియే. ఎట్లైన నుండనిండు, కృష్ణకథ కృష్ణకథయే. ఎవనిద్వారా అది గానము చేయఁ బడినప్పటికిని దాని స్వరూపములో వికృతి కలుగఁజాలదు. కాకిరెట్టలో నున్నప్పటికిని అశ్వత్థబీజ మశ్వత్థవృక్షమునే నుత్పత్తి కావించును. ఆ వాసుదేవస్వరూప మందఱకుఁ బూజ నీయ మగును. కావున రమ్ము; నాకు నేర్పింపుము; చెప్పుము; లిఖింపఁజేయుము. నీవాక్కుతోడనే పల్కుదును; నీశక్తిచేతనే వ్రాయుదును. జయజయధ్వని చేయుచు, నీ చరణములను శరణుపొంది యీ 'భాగవతకథ' నారంభించుచున్నాను.

ఛప్పయ

వ్యాసతనయ వాశిష్ఠ విజ్ఞ వైరాగ్యవాన్ అతి ।
కృష్ణనామ మధుమధుర మధుప మదమత్తమహామతి॥
భక్తిభాగవత భనిపార భవ సింధు కియో హై ।
కలికల్మష కరి దూరి దివ్య ఆలోక దియో హై॥
పరమహంస శుక దేవవర, సుందర సుఖకర నామ హై॥
తినకే పద పాథోజమేం, శ్రద్ధా సహిత ప్రణామ హై॥

అర్థము

వ్యాసతనయుఁడును, వశిష్ఠగోత్రజుఁడును, విజ్ఞానియు, నత్యధిక మైన వైరాగ్యవంతుఁడును, శ్రీకృష్ణనామ మధు మధుర మధుపమదమత్తుఁడును, మహామతియు నగు శుకుఁడు భక్తిని భాగవతమును బలికి సంసారసముద్రమును దాఁటించెను. కలికల్మషమును దూరము కావించెను. దివ్యదృష్టి నొసఁగెను.

అట్టి సుందర సుఖకరనామము కలిగిన పరమహంస శుక దేవవరుని పదకమలములకు శ్రద్ధాపూర్వకముగఁ బ్రణామము కావించుచున్నాను.

# నైమిశారణ్యము

శ్లో॥ నైమిషేఽనిమిషక్షేత్రే
ఋషయః శౌనకాదయః
సత్రం స్వర్గాయ లోకాయ
సహస్ర సమ మాసత॥*

(శ్రీమద్భాగవతము ౧ స్కం. ౧ అ. ౪ శ్లో॥)

ఛప్పయ

నైమిషార సుఖసార హార భూ కో హై భారీ।
సహస అఠాసీ శౌనకాది ఋషి జహాఁ వ్రతధారీ॥
సహస సాల కో సత్ర రచ్యో సుని సూతహు ఆయే।
సభ ఇతిహాస పురాణ అఠారహ గాఇ సునాయే॥
కింతు భాగవత మధుర అతి, సబ శాస్త్రని కో సార హై।
పఠత సునత గావత గునత, హోత జగత్-ఉద్ధార హై॥

అర్థము

నైమిశారణ్యము భూమికి గొప్ప సుఖసారమైన హారము. ఎనుబది యెనిమిది వేలమంది శౌనకాది మహర్షులు వ్రతధారులై యెచ్చట వేయిసంవత్సరములు సత్రయాగము జరుగవలె నని దానిని రచించిరో, అచ్చట కామాట విని

* ఒక సమయమున వైష్ణవ క్షేత్రమగు నైమిశారణ్యమున శౌనకాది మహామునులు స్వర్గాది లోకప్రాప్తి కొఱకు వేయి సంవత్సరములకు సమాప్తమగు యజ్ఞము ప్రారంభించిరి.

సూతుఁడు వచ్చెను. ఇట్లు వచ్చి సమస్తములైన యితిహాస పురాణములను పదునెనిమిదింటెని గానముచేసి వినిపించెను.

కాని అతిమధురమైన భాగవతము సమస్త శాస్త్రము లకును సారభూతమైనది. దానిని జదువుటచేతను, వినుట చేతను, గానము చేయుటచేతను, ఆలోచించుటచేతను, జగదుద్ధారము కలుగును.

భృగువంశములో నొక పరమతేజస్వి గుత్సమదుఁడను పేరుగల ఋషి పుట్టెను— ఆతని పుత్రుఁడు శునకుఁడు. శునక మహర్షి పుత్రుఁడే మహాతేజస్వియు, నియమవ్రత పరాయణుఁడును, ఋషులలో నగ్రగణ్యుఁడును నగు శౌనక మహర్షి. ఈతఁడు పుట్టుకతోడనే విరాగియు, త్యాగియు, సాంసారిక భోగములందు దుదాసీనుఁడు నైయుండెను. ఈతఁడు కొంచెము పెద్దవాఁడైన తర్వాత తండ్రి యీతనికి విధ్యు క్తముగ నుపనయనసంస్కారము, వేదారంభాది సంస్కా రము కావించెను. వేదాధ్యయనానంతరము సమావర్తన సంస్కారసమయము వచ్చునప్పటి కీతఁడు సమావర్తనమున కంగీకరింపక, ప్రపంచములో తపస్సే సారభూత మైనది; ఈ సాంసారిక సుఖభోగము లన్నియు క్షణికసుఖము నిచ్చు నశ్వరము లైనవి, బంధహేతువు లని నిశ్చయించి, తన తండ్రి వద్ద నాజ్ఞ గైకొని తపస్సుకొఱకు వెడలిపోయెను.

ఈతని నిశ్చయమును విని, యింకఁ గొందఱు చాల మంది ఋషికుమారు లీతని వెంటఁ జనిరి. ఏదియో పరమ పావన మగు పుణ్యభూమి యందు కుటీరములు నిర్మించుకొని

ఱందఱు సుఖముగ యజ్ఞయాగాదులను జేసికొనుచు కృష్ణ
థా[శ్రవణము చేయుచుండుటచే నందఱిహృదయములు [ప్రపు
]తము లయ్యెను. అందఱును సంసారసుఖములకు విముఖు
]రి. తపస్సునే పరమధనముగ నెంచు నాయూర్ధ్వ
]ేతస్కులగు ఋషికుమారు లేదైన పుణ్యభూమిని వెదుక
]లె నని భూమిలోఁగల తీర్థము లన్నిటియందును భ్రమించు
]ండిరి.

గొప్ప గొప్ప ప్రాచీనవృద్ధమహర్షులవలన వారు తీర్థ
]రాజమగు ప్రయాగ ప్రశంసను వినిరి. ఈ మహాతీర్థ ప్రశం
]ను విని వారు తీర్థరాజమునకు లోలోనఁ బ్రణామము
]ావించుచు నక్కడకు బయలుదేరిరి. వారు ప్రయాగకు
]ేరి సుందరమగు గంగా యమునా సరస్వతీ సంగమ స్థాన
]మును గాంచఁగానే వారి మనస్సు లత్యంత ప్రఫుల్లితము
]యెన్యను. గంగా యమునల మధ్యభాగమందు గల రజత
]ూర్ణోపమానముగ మెఱయు నిసుకను గాంచి వారిహృదయ
]ుప్పొంగసాగెను. ఇట్టి మనోహర స్థానదర్శనము చేతనే
]ా రందఱి శరీరములు రోమాంచితము లయ్యెను. ప్రేమా
]శ్రువులు ప్రవహించు చుండఁగా వారు తీర్థరాజమగు ప్రయా
]ను గూర్చియు, త్రివేణీ మాతను గూర్చియు స్తుతిం
]రి. స్నాన, సంధ్యావందన, దేవర్షి పితృతర్పణాది సమస్త
]హ్నిక కృత్యములను దీర్చుకొని వారు ప్రయాగరాజ
]ులోని ముఖ్యముఖ్యతీర్థములను దర్శించి పిమ్మట భరద్వాజ
]గవానుని ఆశ్రమమునకు వెడలిరి. మహర్షికి వందనము
]ావించి యంద ఱాయనను బూజించిరి. ఋషికూడ యా

ఋషికుమారుల నందఱను యథోచిత ఆదరసత్కారములు గావించి, యుండుటకు పర్ణకుటీరములను జూపించి, భోజనము నకు వివిధములైన స్వాదిష్టము లగు మధురమూలఫలముల నొసంగెను.

వారందఱు శ్రమతీర్చుకొని కందమూలఫలములను దిని, సుఖముగ స్వస్థులైన తర్వాత ఋషి "కుమారులారా! మీకు మేలు కలుగుఁగాక! నేఁడు మీ రందఱు నా యాశ్ర మమునకు వచ్చితిరి. ఇది చాల సంతోష విషయము. మీ తండ్రులు మొదలగువారు ప్రయాగకు వచ్చినయెడల నిచ్చటనే నిలుతురు. వారు నన్ను జాలగఁ బ్రేమింతురు. మీ రందఱు నాకు పుత్రసమానులు. నేఁడు నేను మిమ్ముల గాంచి చాల యానందము చెందితిని. మీ రంద ఱిచ్చటకు తీర్థయాత్రార్థమై వచ్చితిరా లేక మనస్సులో వేఱొక కోర్కె యేమైనఁ గలదా? నా దగ్గఱ బిడియపడవలదు. యథార్థ మైన విషయమును నాతోఁ జెప్పుఁడు" అని అడిగెను.

ఇట్లు స్నేహముతోడను, నత్యంత మధురముగను, నాత్మీయులుగ భావించి పలికిన మహర్షి వాక్యములను వినఁగా ఋషికుమారుల హృదయము పితృస్నేహముచే నిండిపోయెను. వారు ప్రేమాశ్రువులను గార్చుచు ఋషి చరణములను దడిపిరి. గట్టిగా ఋషిచరణములను బట్టుకొని వారాతని చిక్కని రంగుకలిగిన రక్తమును కమలసమానము గావించెను. క్రమముగా ఋషి యందఱ నాలింగనము చేసి కొనెను. అంత వారిలో శౌనకుఁడు 'నేఁడు మే మందఱము కృతార్థుల మైతిమి. భగవానుని వాత్సల్య స్నేహములను

బొంది మేము నేఁ డనుగృహీతుల మైతిమి. నాతండ్రి సమక్షమున ప్రయాగ ప్రసంగము వచ్చెనా, అప్పుడు భగవాను (భరద్వాజుని) గూర్చిన చర్చ గొప్ప గద్గద కంఠముతోఁ జేయును. ఆయన తమ గుణములను గానము చేయుచుఁ దృప్తి చెందెడు. అప్పటినుండి నా మనస్సులో భగవానుని (తమ) సమీపమున కెప్పుడు వచ్చియుండి మీ చరణముల నారాధింతునా యను లాలస యుండెడిది. ఒక్కొక్కప్పుడు మేమిట్లనుకొనుచుండెడివారము. "భగవానుఁడు మహాత్ముఁడు. ఆయన అపరబ్రహ్మ. వారి యాశ్రమములో వేలకొలఁది, లక్షలకొలఁది ఋషులు, మహర్షులు, యక్షులు, కిన్నరులు, దేవతలు నివసింతురు. మన బాలకులకు వారు సందర్శన మిచ్చునో లేదో తెలియదు. కాని మా యీ సందేహ మిక్కడకు వచ్చినతర్వాత నిర్మూలమైనది. మేము రాఁగానే భగవానులు వాత్సల్య స్నేహములచే నిమజ్జనము కావించితిరి. ప్రేమసాగరములో నిమగ్నులఁ గావించితిరి. నేఁడు మేము యథార్థమగు పితృస్నేహమును బొందితిమి. మే మందఱము భగవచ్చరణములం దొక విశేష ప్రార్థనము చేయుటకొఱకు వచ్చియుంటిమి" అనెను.

భరద్వాజ భగవానుఁడు శౌనకుని దన సమీపమునఁ గూర్చుండబెట్టుకొనెను. తన చేతితో మెల్లమెల్లగా నాతని జడల చిక్కు విడఁదీయుచు 'నీవు నీ యభిప్రాయమును నాతో సంకోచములేకుండ చెప్పుము. నీవు నా బిడ్డఁడవే' యనెను.

శౌనకుఁడు కొంచె మాగి యాగి మెల్లమెల్లగాఁ జెప్పుటకు ప్రారంభించెను. "భగవానులు సర్వజ్ఞులు; భూత భవిష్యద్వర్తమానములు మూఁడు కాలములను దెలిసినవారు. అందఱ మనస్సులలోని విషయములను గూడ తెలిసికొనఁగలవారు. అట్టియెడ భగవానుని సమ్ముఖమునఁ గొంచెముగఁ బలుకుట అనుచిత సాహసమే యగును; కాని భగవానుని యాజ్ఞ యగుచో మేము చెప్పుకొందుము. మాకు సాంసారిక వ్యవహారములలో నిరుకుకొనవలెనను కోరిక లేదు. మేము మా జీవితము నంతయు దపము చేయుచు శ్రీకృష్ణకథా కాలక్షేపము చేయవలెనని యున్నది. దీని కేదైన నొక పుణ్యస్థలమును నిర్దేశించి మాకు చెప్పవలయును. భగవాను లెచ్చట యాజ్ఞాపించిన నచ్చటనే మేము సదా యజ్ఞ యాగాదులు చేయుచు భగవత్కథాకీర్తనద్వారా ఆయుశ్శేషమును గడిపెదము. ఈ ఋషులందఱి యభిప్రాయము కూడ నిదియే." యనెను.

భరద్వాజ భగవానుఁ డత్యంత ప్రసన్నభావముతో వారితో నిట్లనెను. "నాయనలారా! మీరు ధన్యులు. చిన్నతనములోనే యిట్టి మంచిబుద్ధి కలిగినది. తపస్సు మీఁదను, భగవత్కథా కీర్తన మందును రుచి కోటిజన్మల పుణ్యముచేఁ గాని కలుగదు. సాధారణజీవు లీ ప్రపంచమందు చచ్చుచుఁ బుట్టుచు నుందురు. పశు, పక్షి, కీట, పతంగాదుల వలె నాహార నిద్రాభయమైథునాదు లందే వారి స్వాభావిక ప్రవృత్తి కలుగుచున్నది. అనుగ్రహసృష్టిజీవులైనవారికి కోట్లజన్మలు యజ్ఞ, యాగ, తీర్థ, వ్రత, జప, తప, ధ్యాన, సమాధ్యాది

శుభ సాధనలు చేసినవారికిని మనస్సు నియమ పూర్వకముగఁ గథా కీర్తనములందు లగ్నమగును. ప్రపంచములోఁ బ్రయాగకు మించిన పుణ్యప్రదేశ మింకొకటి యెచ్చట కలదు? ఈ యాశ్రమము మీదియే యనుకొనుఁడు; అనుకొనుటేమిటి మీదియే. ఇక్కడే ఆనందముగ నుండుఁడు. యజ్ఞ, జప, తపములు మొదలగువాటిలో నేవి చేయఁదలఁచితిరో వాటిని జేయుఁడు. ఇచ్చట యథేష్ట ఫలవృక్షములు కలవు. అమృతోపమాన మగు శ్రీత్రిపథగామినీ సురనది యొక్క సుమధుర విపుల సలిలము కలదు. ఇది సిద్ధ, చారణ, గంధర్వ, రాజర్షి, దేవర్షి, మహర్షి మొదలగువారి నివాసస్థానము. ఇంతకంటెఁ బవిత్రస్థానము మీ కెచ్చట లభింపఁగలదు? ఇచ్చటనే ఆనందపూర్వకముగ నివాసము చేయుము. ఏమి నాయనలారా, నిశ్చయమే కదా?'' యని వార లందఱితో ననెను.

అంత నందఱు చేతులు జోడించి ''భగవానుని వచనములు యథార్థము. ప్రయాగకు మించినతీర్థములేదు. గంగకు మించిన నదిలేదు. గంగా యమునలకు మధ్యప్రదేశముకంటె మించిన భూమిలేదు. భగవాన్ భరద్వాజాశ్రమము కంటె మించిన పవిత్రతమ ఆశ్రమ మింకొకటిలేదు. మేము భగవానుని యాజ్ఞను శిరసావహించి యిచ్చటనే నివసింతుము''అనిరి.

సమస్త ఋషికుమారుల వాక్యములను విని శౌనకుఁడు మిక్కిలి నమ్రతతోఁ జేతులు జోడించుకొని, మునితో ''భగవానుని యాజ్ఞయే మాకు సర్వస్వము. ఈ ఋషి

కుమారులందఱకు నిష్టమైన దానికంటె నింకేమి కావల యును ? మేమందఱ మిక్కడనే నివసించి భగవచ్చరణో పాసనచేసి, భగవానుల ఛత్రఛాయయందే యుండి, సుఖ పూర్వకముగ భగవానుని ఆజ్ఞాప్రకారముగను ఉపదేశాను సారముగను మా జీవితములను గడిపెదము.''

తర్వాత సందఱును భగవాన్ భరద్వాజుని శ్రీచరణ ములకు నమస్కరించి, ఋషి చూపించిన స్థలమున వేఱు వేఱుగఁ దమతమ పర్ణకుటీరములను వేసికొని నివసించు చుండిరి. చాల నెలలవఱకు వారు శ్రీ భరద్వాజాశ్రమము ననే యుండి ఘోరతపస్సు చేయుచుండిరి. కొలఁది దినములకే మాఘమాసము వచ్చెను. సూర్యుఁడు మకరరాశియం దుండెను. మాఘ మకరమందు తీర్థరాజ మగు ప్రయాగ స్నానమున కనంతఫలము కలదు. ఆ కాలమునాఁటికి ధర్మము ఇప్పటివలె క్షీణదశకు రాలేదు. కలియుగము వచ్చినది కాని అది యింకను కాలు నిలువతొక్కుకొనలేదు. ప్రజలలో ధర్మ భావన బాగుగ నున్నది. వేలకొలఁది రాజులు, మహారా జులు ,తమయొక్క సేనా పరివారములతో వందలకొలఁది కోసులనుండి వచ్చి గంగా యమునా మధ్యభూమి యందు మకరమాస మంతయుఁ గల్పవాసము కావించెడివారు. అప్పటివఱకీ భూమిని ఋషులు పరిత్యాగము కావింపలేదు. వారు స్థూలశరీరముతోడనే భూమిమీఁద నుండెడివారు. మాఘ మకరమందు వారందఱొక్కచోఁ జేరుదురు. వేలు, లక్షలకొలఁది బండ్లలో ఋషి మునుల యొక్క అగ్నులు, యజ్ఞసామగ్రులు వచ్చెడివి. ప్రయాగయొక్క యిరువది

కోసుల మూఁడుతీరముల భూమి నిండిపోయెడిది. భరద్వా జుని ఆశ్రమములో నువ్వగింజ నుంచుటకై సను స్థల ముండదు. కమలకోశమునకు చుట్టు నొకటి తర్వాత నొకటి చిన్న పెద్ద పూదళము లంటుకొని యుండునట్లే మహర్షి యాశ్రమము ఋషులు, మునులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, కింపురుషులు, మనుష్యులు వీరితో నిండిపోవును. అచ్చట యెల్లప్పుడు వేదధ్వని నివసించుచుం డును. వందలకొలఁది, వేలకొలఁది స్త్రీపురుషులు, రాజులు, రాజపుత్రులు మహర్షి దర్శనార్థము వచ్చుచుఁ బోవుచుందురు. మహర్షి తన యోగశక్తిచే అందఱకు శ్రద్ధాసహితముగ యథోచిత సత్కారములు కావించును. అందఱను క్షేమ మడుగును ఇట్లున్నను ఆశ్రమములో సర్వదా శాంతి విరా జిల్లుచుండెడిది. కాని శౌనకుఁడు బయట గుంపునుజూచి చకితు డాయెను. ఆతఁ డింత జనసమూహమును గాంచి వ్యథితుఁడయ్యెను. ఆతని మన స్సేకాంతమును గోరుచుం డెను. ఒక్కఁడైనట్లైన నెక్కడైన నేకాంత స్థానమునఁ బడి యుండెడువాఁడే, కాని యాతనివెంట వందలకొలఁది ఋషులు మును లుండిరి. ఆతఁడు 'తీర్థరాజము మహాక్షేత్రమే. ఇచ్చ టకు నలుదిశలనుండి యెల్లప్పుడు మనుష్యులు వచ్చుచుఁబోవు చుందురు. మా కత్యంత పవిత్రమైనదియు, నంత విశాలము గొప్పది కానిదియు నగు నొక స్థానము కావలయును. దాని కింతటి ప్రసిద్ధికూడ నుండకూడదు. అక్కడ కూర్చుండియే మేము మా యభీష్టమును బ్రాప్తింపఁ జేసికొనవలయు' నని అనుకొని యాతఁడు తన సహచరులతో ఋషి దగ్గఱకుఁ

బోయెను. వారి పాదములకు నమస్కరించి యాతఁ డొకవైపు మెదలకుండఁ గూర్చుండెను. మహర్షి దగ్గఱ శ్రోత్రగా వచ్చిన చాలమంది ఋషులు, మునులు, తపస్వులు, రాజులు, రాజకుమారులు కూర్చుండి యుండిరి. వా రందఱిచేఁ బరివేష్టింపఁబడిన యా మహర్షి దేవతలచేఁ జుట్టుకొనఁబడిన దేవగురువైన బృహస్పతివలె శోభించుచుండెను. మహర్షి యందఱ కుశలము నడిగి, అందఱకు యథోచిత స్వాగత సత్కారముల గావించి శౌనకునితో "శౌనకా! నీవు ఋషు లందఱిలో శ్రేష్ఠుఁడవు. నీ యాకృతిని గాంచిన నీ వేమియో చెప్పఁగోరఁ దలఁచినట్లు తోఁచుచున్నది. నీ వేదైన చెప్పవలసి యుండినఁ జెప్పుము. నీ విషయ మెంతటి రహస్య విషయ మైనప్పటికి చెప్పకూడనట్టి వా రిచ్చట లేరు" అనెను.

చేతులు జోడించి శౌనకుఁడు "లేదు. అట్టి విషయ మేమియు లేదు. భగవానుల పాదాభివందనము చేయుటకే మేమందఱమును వచ్చితిమి. అనంత సాగరముతో సమానమైన యీ సమూహమునుగాంచి మేము చకితుల మగుచున్నాము. ఇంతకంటె నధికాశ్చర్యము భగవానుని గాంభీర్యసాహసములను గూర్చి ఇంత జనము వచ్చుచుఁ బోవుచున్నను భగవానుని హృదయమం దేవిధమైన క్షోభముగాని, యుద్వేగము గాని లేదు. సుమేరు పర్వతమువలె భగవానుని ధైర్యమచలము. దానిలో నొక్క తరంగమైన లేవదుకదా" అనెను.

శౌనకుని వాక్యములను విని భగవంతుఁ డగు భరద్వాజుఁడు చాల బిగ్గఱగఁ నవ్వెను. నవ్వుచు "మీ రీ జనసమూహమును గాంచి బెదరినట్లుగఁ దోఁచుచున్నది. పేరు నిల,

రెండు నెల లిట్లే యుందురు. అంత వీరు మకరము వెళ్ళి పోఁగానే యెవరి ప్రదేశములకు వారు వెళ్ళిపోవుదురు. ఎందుకు? మీకీ జనసమూహము బాగుండలేదా యేమి?" అనెను.

శౌనకుఁడు కొంచెము సంకోచస్వరముతో "ఎందుకు బాగుండలేదు? ధర్మాత్ముల దర్శనమగుట గొప్ప యదృష్టమే; కాని యీ జనసమూహములో నే మనుకొన్నట్లు సాధన జరుగుట లేదు. ఈ స్థానము మీబోటి సిద్ధుల కుప యుక్తమైనది. లేక యొంటరిగా పది, అయిదుగురికిని, ఏదో కొంతకాల ముండువారికిని బాగుండును. నాకెట్టి స్థానము కావలెననఁగా, చాల ప్రసిద్ధమైనదిగ నుండరాదు, కాని పరమ పావనముగ నుండవలయును. ఏకాంతముగ నుండవలయును. సాధనమునకు సహాయకముగ నుండవలయును. కావలసిన సామగ్రియంతయు దొరకున ట్లుండవలెను. ఇఁక తర్వాత భగవానుల యాజ్ఞ యెట్లైన నట్లు" అనెను.

భగవానుఁడగు భరద్వాజుఁడు కొంచెము సేపు ధ్యానము చేసినతర్వాత "శౌనకా! నీ సంకల్పము మంచిది. నీవు దీర్ఘ సత్రముకొఱకు శాంతమును, ఏకాంతమును, రమణీయమును, నిరాపదమును, కందమూల ఫలములతోఁ బరిపూర్ణమైనదియు, నిరుపాధికమైనదియుఁ, బరమ పవిత్రమైనదియుఁ నగు యజ్ఞీయస్థానమును గోరుచున్నావు. నేను నీయెడఁ బ్రసన్నుఁడ నైతిని. నీవొక పనిచేయుము. ఇచ్చట భగవంతుఁడగు మాధవుఁడు ద్వాదశరూపములతో వసించుచున్నాఁడు. నీవు త్రివేణీతటమునకు వెళ్ళి ధ్యానించుము,

ఆతఁడే నీకు స్వయముగఁ బ్రత్యక్షమై హితకరమగు నుప దేశము కావించును. ఉపయుక్తమగు పావనస్థానమునుగూడ నిర్దేశించి చెప్పఁగలఁడు" అనెను.

"తమ యాజ్ఞప్రకారము" అని సమస్త ఋషులతో శౌనకుఁడు మహర్షికి పాదాభివందనము కావించి, వారి యాజ్ఞనుగైకొని తన సహచరులతో సంగమము సమీపము నకు వెళ్ళి సావధానముగాను, సంయమ పూర్వకము గాను భగవంతుఁడగు మాధవుని యారాధించు చుండిరి. అల్పకాలముననే భక్తభయహారియు, వాంఛా కల్పతరు వును, ఘటఘటమున వ్యాపించినవాఁడు నగు భగవంతుఁడగు మాధవుఁడు శంఖ, చక్ర, గదా, పద్మాది యాయుధములతో శౌనకాది మహర్షుల సమ్ముఖమునఁ బ్రత్యక్షమయ్యెను. నవ జలధరశ్యాముఁడును, అతసీపుష్ప సంకాశుఁడును, ఇందీవర శ్యాముఁడు నగు నా చతుర్భుజుఁ డగు మాధవుని దర్శించఁ గానే అందఱి ముఖకమలములు వికసించెను. వారు దప్పిక చెందినవానివలె భగవంతుని యనిర్వచనీయ రూపమాధురిని తెప్ప ద్రాల్పక పానముచేయుచుండిరి. వారి నేత్రములు భగ వంతుని మనమోహినియు, త్రైలోక్య సుందరమును, మనో హరము నగు మాధుర్యమూర్తిని దర్శించి తృప్తిచెందుట లేదు. వారు విధ్యుక్తముగ భగవానుని బూజించి దివ్య స్తోత్రములచే స్తుతించిరి. వారి పూజాప్రార్థనములచేఁ బ్రస న్నుఁడై ప్రణతపాలుఁడైన ప్రభువు "ఋషులారా! నేను మీయెడలఁ బ్రసన్నుఁడనైతిని. మీకేమి కావలయునో ఆ మీ యభీష్టములను నన్నడుగుఁడు!" అనెను.

చేతులు జోడించుచు మహర్షి శౌనకుఁడు అందఱి తరఫున 'ఓ మాధవా! నీవు సాక్షాత్తుగ మాకన్నులెదురుగ నుండఁగా మాకు వేఱు కోరిక యేమి యుండును? సాధన లన్నియు నీ దర్శనముకొఱకే చేయఁబడుచున్నవి. నీ దేవ దుర్లభ దర్శనముచే దైహిక, దైవికాది దుఃఖములన్నియు దూరమగును. జీవుఁడు సహజముగనే మీ దర్శనముచే ఆవాగమన చక్రమునుండి విడివడి ముక్తుఁడగును. అయినను మేము జీవనయాపనకొఱకు ఆయుశ్శేషమును మీ యారా ధనలో గడుపుటకు వీలైనట్టి పరమపావనమును, శాంతమును నేకాంత మనోరమస్థానమును సత్రము కొఱకు మాకు చెప్పుఁడు. అక్కడ కూర్చుండి యూర్ధ్వ రేతస్కులగు నీ ఋషులు శాంతితో తపస్సు, ఆరాధన చేసికొనుటకు వీలుగ నుండవలెను'' అని నివేదించెను.

శౌనకమునియొక్క యీ వినయపూర్వక వాక్కులను విని వరదాతలలో శ్రేష్ఠుఁడగు శ్రీహరి ''ఋషులారా! అత్యంత జాజ్వల్యమానమును, కోటిసూర్య ప్రభాభాస మానమునగు నా యీ చక్రము మీకు ముందు ముందుగాఁ బోవుచుండును. ఏ స్థానమునకు వెళ్ళి దీని "నేమి" పడి పోవునో, ఆస్థానమును మీరు పరమ పవిత్రమని తెలిసికొని, సహస్రవర్షముల సత్రారంభమును గావింపుఁడు'' అనెను. ఇట్లు చెప్పుచుఁ జెప్పుచు భగవంతుఁడు వెంటనే అక్కడి కక్కడే యంతర్ధానమయ్యెను.

క్షణములో నీవృత్తాంతమంతయు సమస్త ప్రయాగ క్షేత్రమున వ్యాపించెను. ఋషులు గుంపులు గుంపులుగా

శౌనకమహర్షి సమీపమునకు వచ్చి "మేముకూడ మీ వెంట వచ్చెదము. మేముకూడ మీసత్రమందు దీక్షఁ గైకొందు మని బ్రతిమిలాడ మొదలిడిరి. ఈవిధముగ వేలకొలఁది ఋషులు వచ్చి శౌనకుని జుట్టుకొనిరి. శౌనకమహర్షి అంద ఱితో మిక్కిలి వినయవాక్కులతో "ఋషులారా! సాంసా రిక భోగేచ్ఛ లేనివారును, జీవిత పర్యంతము ఊర్ధ్వరేతో బ్రహ్మచర్యములో నుండి విధ్యుక్త బ్రహ్మచర్యమును, నియ మములను పాలింపఁ దలఁచువారే నావెంట రావలయును. గృహస్థులగు ఋషులు, మునులు దయయుంచి అక్కడకు వచ్చు నుద్దేశ్యమును మానుఁడు" అనెను.

శౌనకమహర్షియొక్క యీ వచనములను విని యంద ఱును "మేము జీవితపర్యంతము నైష్ఠిక బ్రహ్మచర్యములో నుందుము. ఇదికాక మీ రేయాజ్ఞనిచ్చిన దానిని పాలింతుము, మీరు మమ్ములను వదలవలదు. మమ్ముల నవశ్యము మీ వెంటఁ గొనిపోవలయు" ననిరి.

నైష్ఠిక బ్రహ్మచర్యపాలనము కావింప బ్రతిజ్ఞను గొను వారే ఋషులగుదురు. ఈవిధముగ జేరిచేరి వారెనుబది యెనిమిది (౮౮) వేలమందైరి. భగవంతుని ధర్మచక్రము బయలుదేరెను. దాని వెనువెనుకనే యెనుబదియెనిమిది వేల మంది యూర్ధ్వరేతస్కులగు ఋషులు బయలుదేరిరి. గంగను దాఁటి యాచక్రము లక్ష్మణపురము, సీతాపురముల మీఁదుగా పుణ్యసలిలయగు గోమతీ భగవతీ నదీతటమం దొక ఘోరారణ్యమున వెళ్ళి యాగిపోయెను. ధర్మచక్రము యొక్క 'నేమి' యెక్కడ వదలి క్రిందపడిపోయునదో,

ఆ అరణ్యమునకు ఋషులు "నైమిశారణ్య" మని పేరిడిరి. భగవదాజ్ఞకూడ నిట్లేయుండెను. ఆ స్థానమే యజ్ఞమునకుఁ బరమపావనమని తెలిసికొని మును లచ్చట దీర్ఘ సత్రము నొనర్చుటకు నిశ్చయించిరి. ఎత్తుపల్లములు సమమట్టముగ నొనర్పఁబడినవి. ఋషులు పుణ్యసలిలయగు గోమతీ తటమున నొక యెత్తైన సమతలభూమి యందు శాస్త్రీయ విధి చొప్పున వేదిక నమర్చిరి. దగ్గఱనున్న ఒక విశాల వట వృక్షము క్రింద కథా కథనమునకై చతుష్కోణమగు నొక చక్కని అరుగును వేసిరి. వేదికకు మూఁడు వైపులను ఋషులు తమతమ చక్కని పర్ణకుటీరములను నిర్మించుకొనిరి. దక్షిణపువైపున నది ప్రవహించుచుండెను. అల్పకాలమునకే ఆ స్థానము లక్ష్మీ సరస్వతులచే శోభితమయ్యెను. ఆ స్థాన శోభను గాంచి శౌనకాది మహర్షులందఱు పరమప్రసన్నులైరి. మహర్షి శౌనకుఁ డందఱకుఁ బ్రధాన కులపతిగ నెన్నఁబడెను. అతఁడు శాస్త్రీయ విధి చొప్పున వేయి సంవత్సరములలోఁ బూర్తియగు మహాయజ్ఞమునకు దీక్షను గైకొనెను. సిద్ధులు, చారణులు, గంధర్వులు, దేవతలు, యక్షులు, రాక్షసులు అందఱా మహాయజ్ఞమును జూడవచ్చిరి. ఆ స్థలమున మొట్ట మొదట పండ్రెండు సంవత్సరములలోఁ బూర్తియగు యజ్ఞము నారంభించిరి. తర్వాత నితరయజ్ఞములు చేయుటకుఁగూడ నిర్ణయింపఁబడెను. ఈవిధముగ "నైమిశారణ్యము" సమస్త కథావార్తేతిహాస పురాణములను ప్రపంచములోఁ బ్రసారము కావించు పావనభూమి యయ్యెను. నారచీరలు, వల్కలములు, మృగచర్మములు, దండములు, కమండలువులు,

సవిధలు, మేఖలలు, కుశలు, బ్రహ్మదండములు మొదలగు ఋషుల సామాను లచ్చటచ్చట చాల సందముగఁ బడియుండెను. యజ్ఞీయ సామగ్రిచే నా స్థానము వ్యాప్తమయ్యెను.

ఛప్పయ

కహీఁ పరే కుశ కహీ కమండలు జల కే సోహేఁ।
మత్త మృగని కే ఝుండ్ మునిన కే మన కూఁ మోహేఁ॥
సమిధా, వల్కల, చీర, మూల, ఫల ఫూల సుహావేఁ।
భఈ భీర సుర, అసుర నాగ, కిన్నర, నర, ఆవే॥
యజ్ఞభూమి పావన పరమ, సబ విధి సుఖద శరణ్య హై।
శౌనకాది సుఖ తేఁ బసహిఁ, నామ నైమిశారణ్య హై॥

అర్థము

ఒకచోట దర్భలు, ఒకచోట జలముతో నున్న కమండలువులు, మునుల మనస్సులను గూడ మోహపెట్టు మదించిన మృగసమూహము, సమిధలు, వల్కలములు, చీరలు, మూలములు, ఫలములు, పూలు యివన్నియు నందముగ నున్నవి. దేవతలు, అసురులు, నాగులు, కిన్నరులు, నరులు గుంపులు గుంపులుగా వచ్చిరి.

యజ్ఞభూమి పరమపావన మైనది. సర్వవిధముల సుఖము నిచ్చునది. ఆశ్రయ మిచ్చునది. నైమిశారణ్య మను పేరుగల దానిలో శౌనకాది మహర్షులు సుఖముగ వసించు చున్నారు.

# శ్రీ సూతుఁడు

శ్లో॥ తే ఏకదాతు మునయః
ప్రాతర్హుత హుతాగ్నయః
సత్కృత సూత మాసీనం
పప్రచ్ఛురిద మాదరాత్ ॥ *

(శ్రీభాగవతము ౧ స్కం. ౧ అ. ౫ శ్లో.)

ఛప్పయ

పృథ్వీపతి పృథురాజు ఆది భూ కే భూపాలా।
విషమ భూమి సమ కరీ, రచేపుర నగర విశాలా॥
మాగధ సూత బనాయ బహు విధిబినతీ కన్హీం।
దయే దేశద్వా మునిన వృత్తి వాచక వర దీన్హీం॥
క్షత్రియ పితు మాఁ బ్రాహ్మణీ, సంకరతా తే సూత హైం।
ఉగ్రస్రవా అతి విమల మతి, కథా కహన తేః పూత హైం॥

అర్థము.

పృథుచక్రవర్తి మొదలగు రాజు లెత్తుపల్లములుగ
ఉన్న భూమిని సమముగఁ జేసి విశాలములగు పురములను,
నగరములను కట్టిరి. మాగధ సూతులు బహువిధములుగ
పృథుచక్రవర్తిని వినతులు చేయుటచే రెండు దేశములను
సూతమాగధముల నిచ్చి మునివృత్తికి కథావాచకమున కధి
కార ముందు నట్లు వారికి వరము లొసంగిరి.

---

* ఒకరోజున ప్రాతఃకాలమునఁ దమ యగ్నిహోత్రాది నిత్యకర్మలు,
నా్త్రిచేసికొని మునులు, విధిప్రకారము సత్కారము కావింపఁబడి దగ్గఱనే
కూర్చుండిన సూతుని మిక్కిలి ఆదరముతో యీ ప్రశ్న నడిగిరి.

సూతునితండ్రి క్షత్రియుఁడు, తల్లి బ్రాహ్మణస్త్రీ. ఈతఁడు సంకరుఁడు. ఈతనిపేరు ఉగ్రశ్రవుఁడు. మిక్కిలి నిర్మలమైన బుద్ధిగలవాఁడు. కథలు చెప్పువారిలోఁ బవిత్రుఁడు.

పూర్వము వేనుఁడను రాజు భూమిని పరిపాలించు చున్నప్పుడు సర్వత్ర అధర్మము వ్యాపించెను. వేనమహారాజు తండ్రి మృత్యుకుమార్తెను పెండ్లాడెను. అందువలన నామెకు పుట్టినకొడుకు కావున తన మాతామహుని గుణములన్నియు వచ్చెను. ఆతఁడు యజ్ఞ, యాగ, ధర్మ, కర్మల నన్నిటిని ఆపించెను. ఈకారణమున ఋషు లందఱు క్రోధపూర్వకముగ హుంకారము కావించి వానిని జంపిరి. వాని మృతకళేబర మును మథించుటచే భగవంతుని అంశావతారమగు పృథువు జనించెను. ఆ మహారాజు చాల యజ్ఞములు చేసెను. ప్రధాన దేవత యింద్రుఁడుగాఁ గలిగిన యజ్ఞమొకటి ఆతనికడ జరి గెను. అందువలన నాయజ్ఞము ఐంద్రయజ్ఞ మయ్యెను. సూర్యాది గ్రహములతోఁగూడ బృహస్పతి యచ్చటనుండెను. నియమాను సారముగ మొదట గురువునకు హవిస్సు నిచ్చి తర్వాత శిష్యున కీయవలెను. ఆ యజ్ఞములో తలక్రిందు లయ్యెను. మొదట శిష్యుఁడైన యింద్రున కిచ్చి తర్వాత బృహస్పతికి హవి స్సీయఁబడెను. ఇట్టి సంకటము కలుగుట చేతనే సూతియందు సంకరవర్ణుఁడైన సూతుఁడు జనించెను. బ్రాహ్మణస్త్రీ క్షేత్రమందు క్షత్రియ వీర్యముచే నుత్పన్నమైన జాతిని సూత జాతియందురు. ఇది సంకరజాతి. సంకరజాతి రెండు రకములుగ నుండును. అనులోమసంకరము, ప్రతిలోమ సంకరము. ఉచ్చవర్ణుఁ డగు పురుషుని వలన హీనవర్ణ యగు

్త్రియందు కలుగు సంతతిని అనులోమ సంకర మందురు. ్రాహ్మణుని వలన క్షత్రియజాతి స్త్రీయందు, క్షత్రియుని వలన ైశ్యజాతి స్త్రీయందు, వైశ్యునివలన శూద్రజాతి స్త్రీయందు ్రిగిన సంతానము లన్నియు అనులోమ సంకరజాతులు. కక్కడక్కడ స్మృతికారు లీజాతులను తల్లిజాతివారినిగా ్నిరి; అక్కడక్కడ తల్లిజాతికంటె శ్రేష్ఠముగను దండ్రి ాతికంటెం గొంచెము నీచముగను నెంచిరి. బ్రాహ్మణుని ్లన క్షత్రియ భార్యయందు కలుగు సంతానము "మూర్ధాభి క్త" లనంబడుదురు. సంకరజాతి వృత్తివారి మాతృకులము ండియే స్మృతికారులు నిశ్చితము కావించిరి. ప్రతిలోమ ంకరజాతిని హేయముగ జెన్నిరి. అక్కడక్కడ వీరి కన్యలను ్షత్రియులుకూడ గ్రహించినట్లు కనబడుచున్నది. వీరి సంస్కా ము ద్విజాతులకు వలెనే యుండును. వీరికి యజ్ఞోపవీతము ను, సంధ్యావందనమునకు కూడ అధికారము కలదు. ృథుమహారాజు యజ్ఞములు సూత మాగధులిద్దరు రాజాధి ాజగు పృథుచక్రవర్తిని స్తుతించిరి. వీరి స్తుతులకుం బ్రస ్నుడై మహారాజు సూతునకు సూతదేశమును, మాగధునకు ాగధదేశమును (గోరఖపూరు పరిసర ప్రదేశము) బారి ోషికముగ నిచ్చెను. అక్కడనే ఋషులు, సూతులు ేవతా, ఋషి, రాజవంశీయులు పౌరాణిక కథలను జెప్ప లసినదిగ వృత్తిని నిర్ణయించిరి. వేదములను వదలి ఇతిహాస ురాణాదులను జెప్పుటకు వీరి కధికారము కలదు. వేదాధి ారము వీరి కీయ బడలేదు. ఈవిధముగా సూతజాతియొక్క ాతనధర్మము ఇతిహాస పురాణాదులను జెప్పుటయే.

వ్యాసభగవానుఁ డొక్క-వేదమునే అత్యంత సంక్షి ప్తము కావించి, దానినైనను నాలుగు చిన్నచిన్న సంహితలుగ నేర్పఱచెను. అప్పుడే ఆయన పురాణములను గూడ విభాగించెను. పురాణములు కోట్లసంఖ్యగ నుండెను. వానిలోనుండి వ్యాసభగవానుఁడు నాలుగు లక్షల శ్లోకముల నేఱి వాటిని పదునెనిమిది భాగములుగ విభాగించెను. వేదమును ఋగ్యజుస్సామాథర్వణములుగ విభాగించి, యా సంహితలను క్రమముగఁ దన శిష్యులగు పైల, జైమిని, వైశంపాయన, సుమంతులకుఁ జెప్పెను. ఇతిహాస పురాణాదులను వ్యాసభగవానుఁడు సూతజాతివాఁడును, దన శిష్యుఁడు నైన లోమహర్షణున కిచ్చెను.

లోమహర్షణుఁడు మిక్కిలి ధర్మాత్ముఁడు. వ్యాసుల వారికి పరమ ప్రియశిష్యుఁడు. శౌనకాది మహర్షులు నైమిశారణ్యములోఁ దమ యజ్ఞమును ప్రారంభించినప్పుడు లోమహర్షణుని బిలిచి కథావాచకమునకుఁ బ్రధానపదమున నియోగించిరి. ఋషులు సర్వసమర్థులు. వారేది చేయఁదలచుకొనిన దానిని జేయఁగలరు. వేదమంత్రములచేతఁ బాషాణప్రతిమలోఁ బ్రాణప్రతిష్ఠ కావించి దానిలో దేవత్వమును స్థాపింతురు. వారి వచనములే శాస్త్రములగును. వారి యాజ్ఞలార్ష వచనములని సర్వత్ర మాన్యముగ నెంచెదువారు. ఋషులు నైమిశారణ్యములో యజ్ఞమందు సూతుఁడగు లోమహర్షణునకు బ్రహ్మాసన ప్రదానము కావించెను. మునులు ఋషులందఱును క్రిందఁ గూర్చుండి కథలు వినుచుందురు. అతఁ డుచ్చాసనమునఁ గూర్చుండి యందఱకు వివిధములగు కథలను జెప్పును.

ఆ సమయములో తీర్థయాత్ర చేయుచుం జేయుచు కృష్ణాగ్రజుండును, హాలముసలములను ధరించు బలరాముం డచ్చట ఋషుల యజ్ఞము దగ్గఱకు వచ్చెను. ఋషులందఱును లేచి ఆయన కభ్యుత్థానము కావించిరి. ఆయనకు స్వాగత సత్కారములు కావించి కుశలక్షేమము లడిగిరి; కాని లోమహర్షణుం డట్లే తన యుచ్చాసనముననే కూర్చుండెను వ్యాసాసనమునం గూర్చుండిన వాండెవరికిని అభ్యుత్థానము చేయం గూడదను నియమ మున్నది. అయితే దీని కపవాదముకూడ కలదు. ఎవండైన గొప్ప విశేషముగల వ్యక్తి వచ్చినయెడల వ్యాసాసనముననున్నను వానికి యథోచిత సమ్మాన సత్కారములు కావింపవలయును. బలరాముండు సాక్షాత్తుగ శేషుని అవతారము. చతుర్వ్యూహములలో నీతండు సాక్షాత్తుగ సంకర్షణుడు. బలరాముండు క్షత్రియుండైనను గొప్ప గొప్ప ఋషులు మహర్షు లందరు లేచి వానికి స్వాగత సత్కారములు కావించి, భగవద్బుద్ధితోం బూజించినపుడు, సూతుండాయనను సమ్మానించవలసినది. కాని దురదృష్టవశమున నాతం డట్లు చేయలేదు. ఆ కారణమున సంహారశక్తి గల సంకర్షణ భగవానునకు క్రోధము కలిగెను. తీర్థయాత్రా వ్రతములో వ్రతియైన కారణమున నాతండు శస్త్రములను వదలెను. ఆతనికి ప్రియమగు హాల ముసలాయుధములను వదలినప్పటికిని దివ్యాస్త్రము లాతని సంకల్పములోనే యుండెను. చేతిలో గుప్పిడిలోం బట్టుకొనియున్న కుశలలో నొకదానిని దీసి, దానిని బ్రహ్మాస్త్రముచే నభిమంత్రించి సూతు

నిపైఁ బ్రయోగించెను. సూతుఁ డా క్షణముననే నిర్జీవుఁడై ఆసనమునుండి క్రిందపడిపోయెను.

ఋషి మండలములో హాహాకారములు వ్యాపించెను. 'మహాభాగా! ఇదేమి యిట్లు చేసితిరి? మీ రీతని నెందులకు చంపితిరి? మేము బుద్ధిపూర్వకముగనే బ్రహ్మాసనము నిచ్చుటయే కాక సహస్రవర్షము లాయుఃప్రదానము కూడ కావించితిమి. మా యజ్ఞము పూర్తియగునంతవఱ కీతనికి మృత్యువుండరాదు. మీరు బ్రహ్మాస్త్రమును బ్రయోగించి యీ యనుచిత కార్యమును గావించితిరి. మీకు బ్రహ్మహత్యతో సమానమైన పాపము లభించినది. మీరు పాపపుణ్యముల కతీతుల రైనప్పటికిని మానవదేహమును ధరించితిరి. దీని మీరు ప్రాయశ్చిత్తము చేసికొనవలయును.

ఋషుల వాక్యములను విని బలరాముఁడు "ఋషులారా! నేను పొరపాటున నిట్లు కావించితిని. ఇప్పుడు మీ రెట్లు చెప్పిన నట్లు చేయుటకు సిద్ధముగ నున్నాను" అనెను.

"దేవా! మా యాశీర్వాదము నిష్ఫలము కారా" దని ఋషు లనిరి.

"అయితే నే నీతనిని నా యోగబలమున బ్రతికింతునా?" అని బలరాముఁ డనెను.

"అప్పుడు మీ బ్రహ్మాస్త్రము నిష్ఫల మగునుగదా! ఎన్నడును వ్యర్థముకాని బ్రహ్మయొక్క యమోఘాస్త్రమున కవమానము జరుగుట మా కిష్టములేదు" అని ఋషులనిరి.

"అట్లైన మీ రెట్లాజ్ఞాపించిన నట్లు చేసెద" నని బలరాముం డనెను.

"మీ కేది యుచితమని తోంచిన దానినే చేయుండు. మా వరదానము సత్యము కావలెను; నీ యస్త్రము నిష్ఫలము కాంగూడదు" అని ఋషులందఱు సర్వసమ్మతమగు ప్రత్యుత్తర మిచ్చిరి.

అప్పుడు బలరాముండు "మంచిది, ఆత్మనుండి పుట్టిన కారణమునం బుత్రుని తనరూపముగానే చెప్పిరి. కావున నీతని సమస్తగుణములు, సమస్తజ్ఞానము, సమస్తవరదానము ఈతని పుత్రుండగు ఉగ్రశ్రవుని శరీరములో నుండుంగాక. ఆతండే మీ యజ్ఞమును యథాప్రకారము పూర్తికావించుం గాక! ఆతండే మీకు సమస్త ఇతిహాస పురాణకథలను వినిపించుంగాక" అనెను.

ఋషులందఱు "సాధు! సాధు!" అని పలికి దీని నొప్పుకొనిరి. అప్పటినుండి యుగ్రశ్రవుండు పురాణ వక్త యయ్యెను. ఉగ్రశ్రవుం డప్పుడప్పుడు నైమిశారణ్యమును విడిచి యిక్కడికక్కడకు వెళ్లుచుండెడువాండు. శౌనకాది మహర్షులీ సత్రయాగమును మహాభారతయుద్ధమునకు చాల పూర్వమే యారంభించిరి. ఏలనంగా శ్రీ బలరాముండు మహాభారత యుద్ధసమయముననే తీర్థయాత్ర నిమిత్తమై నైమిశారణ్యమునకు వచ్చెను. ఆ సమయమున నచ్చట సత్రయాగము జరుగుచుండెను. మహాభారతయుద్ధములోం గౌరవపక్షీయులందఱు మరణించిరి. యుధిష్ఠిరమహారాజు చక్రవర్తి యయ్యెను. ఆయన దాదాపు ముప్పది సంవత్సరములు

రాజ్యము చేసెను. భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు తన స్వధామమునకు వెళ్ళినప్పుడు పాండవులుకూడ తమ మనుమఁడగు పరీక్షిన్మహారాజునకు రాజ్యము నొసంగి హిమాలయమునకు మహాప్రస్థాన పథమున కగ్రసరులైరి. దీని తర్వాత దాదాపు ముప్పదిసంవత్సరములు పరీక్షిన్మహారాజు రాజ్యము చేసెను. శుకదేవుఁడు గంగాతటమున, శుకదేవుని ఆశ్రమమున పరీక్షిన్మహారాజునకు శ్రీమద్భాగవతమును వినిపించినప్పుడీ పరమ బుద్ధిశాలియగు ఉగ్రశ్రవసూతుఁడు కూడ అక్కడుండెను. ఈతని పేరు ఉగ్రశ్రవుఁడు. ఈతఁడు శ్రవణము చేసి, ధారణచేయుశక్తి యీతనికి మిక్కిలి ఉగ్రముగనుండెడిది. అందువలన నీతఁ డుగ్రశ్రవుఁ డయ్యెను. శుకదేవునివలన నాతఁడు వినినదంతయు నున్నదున్నట్లుగ ధారణ కావించెను. తర్వాత నైమిశారణ్య సత్రమునకు వచ్చెను. ఈతని తండ్రి లోమహర్షణుఁడు కూడ ఋషులకు అనేక పురాణములను ధర్మశాస్త్రములను, ఇతిహాస కథలను వినిపించుచుండెడువాఁడు. ఆయన తరువాత నీతఁడే వినిపించుచుండెడువాఁడు ఋషులు భాగవతమును తమ సత్రయాగాంతమందు వినినట్లు తోఁచుచున్నది. అప్పుడే వీరందఱకు యజ్ఞములయెడల కంటె భగవత్కథలయెడల నత్యధికానురాగము వృద్ధిపొందెను. ఋషులు సూతునితో స్పష్టముగ "ఓ సూతా ! నీవు చిరకాలము వర్ధిల్లుదువుగాక ! ఏలననఁగా నీవు మాకు భగవంతుని అత్యంత అమృతోపమానమైన కథలను వినిపించుచున్నావు. ఈకథ యీ మరణశీలురగు వారికి అమరమును గావించు జీవనమూలము. మేము చేయు

యజ్ఞమునకు నిశ్చితఫలము లేదు. విధులలో యత్కించిత్తుగ లోపము జరిగినప్పటికిని నిష్ఫలమే యగును. సాంగోపాంగముగ నిర్విఘ్నముగ నిది నెఱవేఱెనా స్వర్గాదిఫలము లభింపఁగలదు; లేకున్న శ్రమమాత్రము మిగులును. యథార్థమున కీ వల్లని యజ్ఞధూమముచే ధూమ్రవర్ణమువలె మా మనస్సులను సదా శంకితము గావించినది. నీవు మనుష్యుల మత్తులఁజేయు శ్రీగోవిందచరణారవింద మధుమయాద్భుతాసవమును ద్రావించుచున్నా విదియే దీనివలన కలిగిన పరమలాభము. దీనిని ద్రావి మేము తృప్తిఁబొందుచున్నాము" అనెను. ఈవిధముగ ఋషుల మనస్సు సదా శ్రీకృష్ణగుణానువాదమందే లగ్నమై యుండెను. కథ లన్నిటిని వినిన తర్వాత నొకదినమున ఋషుల మనోగతభావములను దెలిసికొని, శ్రీ శౌనకుడు సూతుని నొక యత్యంత యద్భుత ప్రశ్న మడిగెను. దాని వర్ణనము ముందు రాఁగలదు.

సోరఠా

కహీం కథా కమనీయ, శౌనకాది తేఁ సూతజీ।
హర్షిత హోవే హోయ, భవభయ భంజన హోయసుని॥

అర్థము

సూతుఁడు శౌనకాది మహర్షులకు కమనీయ కథలను జెప్పెను. ఆ కథలను విని వారి హృదయములు సంతసించెను, సంసారభయము నాశమయ్యెను.

# సర్వోత్కృష్ట ప్రశ్న

శ్లో॥ తత్ర తత్రాంజసాఽఽయుష్మన్
భవతా యద్వినిశ్చితమ్।
పుంసామేకాంతతః శ్రేయ
స్తన్నః శంసితుమర్హసి॥ *

ఛప్పయ

పఢే శాస్త్ర ఇతిహాస పురాణాది సబ తుమనే।
కహీం కథా అతిమధుర సునీం శ్రద్ధా తేం సబనే॥

సబ శాస్త్రని కో సార్ సూతజీ శీఘ్ర సునాఓ।
కృష్ణ చరిత కహి పుణ్య ప్రేమ పీయూష పిలాఓ॥

శాస్త్ర జ్ఞాన పయ జమాకేం, దధి మథి సార జనాఇ దో।
ఖట్టో మట్ఠా పృథక్ కరి, మక్ఖన్ మధుర చఖాఇ దో॥

అర్థము

నీవు సమస్త శాస్త్రేతిహాస పురాణాదులను జదివి, అతిమధురముగఁ గథలు చెప్పితివి. అందఱు శ్రద్ధతో వినిరి. ఓ సూతా! సమస్త శాస్త్రముల సారమును శీఘ్రముగ వినిపింపుము. కృష్ణచరిత్రమును జెప్పి, పుణ్యప్రేమామృతమును ద్రావింపుము.

---

* ఓ ఆయుష్మంతుఁడవగు సూతా! నీవు సమస్త శాస్త్రములలో మానవ కల్యాణము కొఱకు, ఎప్పుడును వ్యర్థముకాని యమోఘ సాధనమును సరళముగా సర్వసమ్మతముగాఁ దెలియఁదగు నా సర్వోత్తమ సాధనమును మాకు తెలుపవలయును.

శాస్త్రజ్ఞాన మను పాలను తోడుపెట్టి, పెరుగును జిలికి సారమును దెలియఁ జేయుము. పుల్లని చల్లను వేఱు చేసి, మధురమగు వెన్నను రుచిచూపుము.

మానవుఁడు విని విని వేసారినప్పుడు వాని మనస్సులో సారవస్తువును దెలిసికొనవలె నను జిజ్ఞాస కలుగును. ఆతఁడు సర్వోత్కృష్ట సారాతిసార తత్త్వమును దెలిసికొనుట కువ్విళ్లూరుచుండును. పరస్పరము అనుకూల ప్రతికూల విషయములను విని సాధారణుల చిత్తము భ్రమలోఁ బడిపోవును. వారిది చేయుదుమా, అది చేయుదుమా యని యాలోచించుచుందురు. చివరకు వివాద విషయములను విడిచి, సర్వసమ్మత సిద్ధాంతమును వినుటకు వ్యాకులపడుచుందురు.

ఇది యంతయు నాలోచించి తెలిసికొనియే శ్రీ శౌనక మహర్షి సూతుని సర్వోత్కృష్ట సారవస్తువును గుఱించి ప్రశ్నించెను. శౌనకుఁడు 'మహాభాగుఁడ వగు నో సూతా! పరమ బుద్ధిమంతుఁ డగు నీ తండ్రి మాకు పరమ చిత్ర విచిత్ర కథలను వినిపించుచుండెడువాఁడు. వాటివలన మాకు మనోరంజనమును గలుగుచుండెడిది; జ్ఞానాభివృద్ధియు నగుచుండెడిది. లోమహర్షణుని జ్ఞానమున కంతులేదు; ఏలనన నీ తండ్రి భగవదవతారమగు వ్యాసమహర్షి సేవ చిరకాలము చేసి, వారి వలన జ్ఞానమును బొందెను. ఆ సమస్త జ్ఞానము కఠినసేవలు చేయకయే బలరాముని కృపచేతను, ఈ ఋషుల యొక్క అనుగ్రహము చేతను అనాయాసముగ నీకుఁ బ్రాప్తించినవి. నీవు సమస్త శాస్త్రములను చదివితివి; వింటివి. నేఁడు మేము నిన్నొక పరమోత్కృష్టమైనదియు, సారాతిసారమైనదియు

నగు నొక ప్రశ్న నడిగెదము. నీవు దానిని సమాహిత చిత్తముతో విని, దానికి సరియైన ప్రత్యుత్తరమిమ్ము.

చూడుము. శాస్త్రము లనంతములు. వాటి కావలి యొడ్డు లేదు. జ్ఞాన భండార మగాధ మైనది. ఎవ్వఁడును దానిని దాఁటజాలఁడు. ఋషులనేకు లున్నారు. అందఱు తమ తమ యనుభవానుసారముగ ననేక సుందర సాధనములను చెప్పిరి. కొన్ని సాధనలు చూచుటకు పరస్పర మొక టొకటి విపరీతముగఁ దోఁచును. ఒక్కొక్కప్పు డనేక విషయములను విని చిత్తము విభ్రమములోఁ బడిపోవును. ఇంతవఱకు మే మడిగినవాటికి నీవు శాస్త్రానుసారముగఁ బ్రత్యుత్తర మిచ్చితివి. పాద్మ సంబంధమైన కథల నడిగినప్పుడు నీవు వాటినే వినిపించితివి. ఇప్పుడు మేము నీపైన భార మిడుచున్నాము. సమస్త శాస్త్రములను జదివి నీవు తెలిసికొనిన సర్వశ్రేష్ఠ సారమును మాకు వినిపింపుము. అనధికారికి పొరపాటున నైన నుపదేశింపరాదనియు, అడుగనిది యెవ్వరికి చెప్ప రా దనునదియు నిజమే; కాని తనకు భక్తులైనవారికిని, తనయందు ప్రేమ గలవారికిని, తాను జెప్పినట్లు వినువారికిని వారికి హితమగు వాక్కుల నడుగక పోయినను తనకుఁదానే చెప్పవలెను. చివరకు మే మడుగుచున్నాము. మీ మీఁదఁ బ్రేమ నుంచుచున్నాము. నిన్ను సత్కరించుచున్నాము. కావున నీవు మాకు నీ మనస్సులో విషయమును దాచిపెట్ట రాదు. నేఁడు సమస్తమును స్పష్టముగ యథార్థ విషయమును జెప్పుము.

నేను వినినదియుఁ, జదివినదియు నున్న దున్నట్లు మీకు చెప్పితిని. సారవస్తువు సంగతి నాకేమి తెలియు నని నీ వనుటకు వీలు లేదు. అట్లనిన నొప్పుకొనము. ఏలననఁగా నీమీఁద వ్యాసభగవానునకు బాల్యకాలము నుండియుఁ గృప కలదు. ఇతర ఋషులుకూడ నీయెడలఁ బ్రేమ వహింతురు. అందఱును నీకు తమ యాంతరంగిక భావములను జెప్పుదురు. నీవు స్వయముగఁ గూడ మిక్కిలి బుద్ధిమంతుఁడవు. నీవు కూడ అన్నిటిని జదివియు, వినియు నన్నిటియొక్క యంతిమ సారమును బిండియుండవచ్చును. ఆ సారమును నేఁడు మాకు వినిపింపుము.

నీవనవచ్చును— మహారాజా! మీరు తొందరపెట్టెదరెందులకు? వినుచు వెళ్ళుఁడు, చివరకు సారము దానికదియే మనస్సునకు రాఁగలదు. కాని అన్నా! ఇంత వ్యవధి యేది? అందులో విశేషించి కలియుగములోని జీవుల దగ్గఱ మన యీ యజ్ఞములోఁ గాలముయొక్కయు, కలియుగముయొక్కయు, మృత్యువుయొక్కయు బాధ లేమియు లేకున్నను, మనము వెనుక ముందు లాలోచింపవలయును. ఇఁక ముందు కలియుగములో మిక్కిలి క్రూరకర్మ చేయువారును, మందమతు లగు మానవులు పుట్టెదరు. రాత్రింబవళ్ళు సంసార ప్రపంచములోనే వ్యాపృతులై యుందురు. వారికి పరమార్థ చింతనమునకు సమయమే చిక్కదు. జీవు లందఱు నల్పాయుష్కులుగ నుందురు. ఎక్కువ కాలము శరీరభరణ పోషణమందును, కుటుంబ చింతలోను గడచిపోవును. వారు సమస్త శాస్త్రములను శ్రవణ మననములు కావించి తమ

బుద్ధిచే సారాసార నిర్ణయము కావింపఁజాలరు. అదియును గాక, "శ్రేయాంసి బహువిఘ్నాని" ప్రతి సాధనలోను, ప్రతి కార్యములోను గొప్ప గొప్ప విఘ్నములు, వివిధములగు నుపద్రవములు కలుగుచుండును. ఆ కలియుగ జీవుల బుద్ధి కూడ మిక్కిలి విశాలముగ నుండదు. స్వాభావికముగా వెంటనే యేదైన విషయములో సర్వసమ్మత నిర్ణయముగూడ కఠినమగును. కాఁబట్టి నీవు ఈ విషయ మీా శాస్త్రములో నిట్లు వ్రాయఁబడిన దని మాకు చెప్పవలదు. వ్రాసినమాట నిశ్చయమే. దాని నింతవరకు వినుచునే యుంటిమి. ఇప్పుడు నీవు నీ మనస్సుచే శాస్త్రరూప మగు పెరుగును జిలికి చక్కనిది, స్వచ్ఛమైనది, సుగంధము కలిగినది, స్వాదిష్ట మైనది, శుభ్రమైన దగు నవనీతమును మాముందు పెట్టుము. దానిని దినుటచే జిహ్వయుఁ దుష్టి చెందవలెను; శరీరముకూడ పుష్టి చెందవలెను; ఆఁకలి తీరవలెను. ఇప్పుడు మాకు పాలు, పెరుగు, మజ్జిగ వీనియందు రుచిలేదు. వెన్నను పాల నుండియే తీయుదు రని మాకు తెలిసినను, తీయుటలోఁ గల చాతుర్యముచే దానిలో నన్నిటికంటె నధికరుచి యుండును. ఆ వెన్ననైనను అందఱు తీయలేరు. ఇట్లనుచున్నామని నిన్ను శాస్త్రవిరుద్ధ వాక్యములను జెప్పుమనుటలేదు. నీవు శాస్త్ర విషయములనే చెప్పుము. కాని యిప్పుడు విస్తారముగ చెప్ప వలదు. సారవిషయమును సంక్షేపముగఁ జెప్పుము. మేము దీనికై మిక్కిలి యుత్సుకులమై, శ్రద్ధావంతులమైయున్నాము. కావున నిప్పుడింక నాలస్యము చేయవలదు. దానిని వినిన

మా రోమరోమము ప్రసన్నమగును. మాకు పరశాంతి ప్రాప్తించును.

"మీరుకూడ సమస్త శాస్త్రములను శ్రవణము చేసితిరి. మీరు సర్వసాధన సంపన్నులు. సర్వదా శాస్త్రచింతనమందును, సత్సంగమందును కాలమును గడుపుచున్నారు. మీరుకూడ కొంతసారము గ్రహించియుండవచ్చును. అన్నిటికంటె శ్రేష్ఠమైన దేదియని మీరు నిశ్చయించినారో ముందు మీరు చెప్పుఁడు. మీ కేవస్తు వధిక రుచికరముగఁ దోఁచుచున్నదో దేనిని వినిన మీ హృదయము హర్షము చెందుచున్నదో ప్రేమతరంగములు దేనిని శ్రవణము చేయుటచే నధికముగ లేచుచున్నవో అట్టే మీరు నా నిర్ణయముకూడ వినుఁడు. నా నిర్ణయము మీ నిర్ణయ మొకేరీతిగ నున్న-చో మీ రిప్పుడు సమస్త యితర విషయములను వీడి, దానిని జెప్పుఁ" డని మీ రనవచ్చును.

సూతా! నేనుమాత్రము 'శ్రీకృష్ణ' అనున దొక్క-టియే సారమని గ్రహించితిని. శ్రీకృష్ణ అనఁగా నేమి యని మీరనవచ్చును. కృష్ణ అనఁగా 'నలుపు' అయితే నలుపు రంగు సారమా? 'కృష్ణ' అను రెండక్షరముల నామము సారమా? కనుక సూతా! నామమునకు నామికి పరస్పర మేమియు భేద ముండదు. "ఉగ్రశ్రవుఁ" డనఁగానే మా సమ్ముఖమునకు ఉగ్రశ్రవసూతుని సౌమ్యమూర్తి వచ్చును. భగవంతుఁ డీ ప్రాకృత నామరూపముల కతీతుఁ డనుట సత్యమే. ఆతఁడు మాయిక జగచ్ఛిమలో నాబద్ధుఁడై లేఁడు, కాని యాతఁడు నరరూపమున నవతరించినప్పు డాయన

యొక్క యచింత్య దివ్యకర్మలు సర్వదా నలౌకికములుగ నుండును. వాటిని వినుటచేతనే సంసారమును దాటించుటకు సమర్థము లగును. సాక్షాత్తుగ భగవంతుఁడగు శ్రీహరి భూమియందు దేవకీ వసుదేవులకుఁ గొడుకై యవతరించి దివ్యమానుషీయ క్రీడలను జరిపినాఁడని మేము వినియుంటిమి. ఆ కమనీయక్రీడలను నీవు శ్రద్ధాళువులగు మా సమ్ముఖమునఁ జెప్పుము. శ్రీకృష్ణలీలా స్వారస్యము, మాహాత్మ్యము అనంతము. కేవల మాతని నామము ననిచ్ఛాపూర్వకముగ నైనను ఉచ్చరించినట్లైన, అట్టివానికి సమస్తపాపములనుండి ముక్తినిచ్చి పరమపదమును ప్రాప్తింపజేయు నంతటి శక్తి దానికి కలదు. ఆ శ్రీహరి కాలునకుఁగూడ కాలుఁడును, మృత్యువునకుఁ గూడ మృత్యువును, భయమునకుఁ గూడ భయమును గలిగించువాఁడు.

నారాయణ నామ, లీలా, గుణ, కీర్తనముల కింతటి పట్టుదల యూనెద రేల యనవచ్చును. అట్లు మే మనుటేమి? గొప్ప గొప్ప బుద్ధిమంతులు, విద్వాంసులు, ఋషులు, మహర్షులు వేయేల నందఱు నాయన దివ్యకర్మలను గూర్చి చెప్పిరి. ఏలననఁగా నాయన మహిమ అనంతమైనది. ఆయన సంపూర్ణ శ్రీయంగ మహిమ మట్లుంచుఁడు. ఒక్క యంగము తాఁకుటచేఁ గలుగు మహిమనే విచారించుఁడు. శారీరకముల దోషములున్నను, క్షుద్రపాతకములు, ఉపపాతకములు, మహాపాతకములు వీనిచేఁ గూడినవాఁడైనప్పటికిని వాఁడు శుద్ధిఁ బొందుట కెచ్చటి కేగును? శ్రీ గంగాదేవిని శరణు

చొచ్చును గదా! గంగాజల స్పర్శమాత్రముననే ఘోరాతి ఘోర పాపములైనను క్షణకాలములో నశించిపోవును. గంగ స్వర్గమునకు నిచ్చెన. పాపమును తెగగొట్టుటకు ఉలి. ఈ నామము మొదటినుండియు ప్రపంచములో సర్వత్ర ప్రసిద్ధము. శాస్త్రములలో గంగామహిమను గూర్చి సర్వత్ర చాల విస్తారముగ గానము జేయఁబడినది. ఎవఁడైన నెంత దూరదేశములోనైన నుండుఁగాక; వాఁడు మరణించినచో, వాని అస్థి నేదోవిధముగ వచ్చి గంగలోఁ బడెనా, వాఁడు సమస్త పాపములనుండి విడివడి స్వర్గమునకుఁబోవును. ఇంతటి మహిమ కలిగిన గంగ యేమిటి? భగవంతుని కాళ్ళు కడిగిన నీరు. పూర్తి పాదములుకూడ కాదు. శ్రీచరణముల యొక్క ఒక్క అంగుష్ఠము తాకుటచేతనే బ్రహ్మాండ కటాహమును ఛేదించుకొని, యీ త్రిపథగామిని మూఁడు లోకములను వ్యాపించెను. కేవల మంగుష్ఠము మాత్రము తగులుట చేతనే భగవతీ భాగీరథికి యింతటి గొప్ప మహిమ కలిగెను. ఇంక నత్యంతశుద్ధి చెంద నుత్సహించువాఁ డా ప్రభుని త్రైలోక్య పావనమగు యశము నేల వినరాదు?

నిర్గుణమునకు జ్ఞానము, కాని భగవంతుని సగుణ రూపమందు భక్తియుండును. వానికి శ్రద్ధతో సేవాపూజలు కావింతురు. ఆయన దివ్యగుణములను గానము చేయుదురు. ఆయన త్రైలోక్య పావన నామముల నున్మత్తులైన ప్రేమ పూర్వకముగ నుచ్చారణ చేయుదురు. దీనివలన హృదయ గ్రంథులన్నియు వికసించును. సమస్త సంశయములు దూర మగును. సమస్త విధముల పుణ్య పాపకర్మలు క్షీణమగును.

కావున నాయాత్మారామ, లోకాభిరామ, సర్వైశ్వర్య సంపన్న వాసుదేవ భగవానుని కథలను నీవు మాకు వినిపింపవలయును.

"వందలకొలది సంవత్సరములనుండి మీరిదే వినుచున్నారు. ఇన్నాళ్ళనుండి వినుచున్నను మీకు తృప్తి కలుగదేమి?" అని మీరనవచ్చును. అన్నా, ఇది తృప్తిచెందు వస్తువు కాదు. ఇది యెటువంటి రసమనఁగా దీని నెంతగాఁ ద్రావుచుండిన నంతగా కోరిక పెరుగుచుండును ఇఁక ప్రాపంచిక విషయములను దీసికొనుఁడు. దేనిలో క్షణికము, ఆభాసమాత్ర సుఖ మున్నదో, అట్టిదాని నొక్కసారి భోగించిన, మరల కోరిక పెరుగును. ప్రతి దినము పదార్థముల నుపయోగించుచుండినను మఱునాఁడు మరల దానినే యుపభోగింప నిచ్ఛ కలుగును. ఇఁక నిదియా పరమ మధురాతి మధుర రసము. ఇంకొక చేదియైనను బాగుగాఁ దృప్తి కలుగునేమో. కాని సూతా! మేము నీతో సత్యము పలుకుచున్నాము. దీనివలన మాకు దృప్తి కలుగలేదు. కలుగుట లేదు. ఇఁక ముందు కలుగఁబోదు. ఇప్పు డింక నీవు ఆ మాటలను ఈ మాటలను వదలి కేవల మవతార చరిత్రలనే చెప్పుము. ఈ చరిత్రము పదపదమందు మధురముతో నిండి యున్నది. ఈ రసము నెంతగా గ్రహించిన నంతగా లోభము పెచ్చుపెరుగును. కావున నీవు మాకు కృష్ణ కథనే వినిపించుము. కేవలము కృష్ణచరిత్రనే కాదు, యాతని యన్నయగు బలరాముని చరిత్రను గూడ వినిపింపుము. ఏలననఁగా నాతఁడు కూడ నారాయణ రూపమే. ఆతఁడు నవతారమూర్తియే.

ఒంటరిగా నాతఁడు క్రీడించనేలేదు. అన్నదమ్ము లిద్దరు ఒక సంవత్సరము తేడాతోఁ బుట్టిరి. తోడుగాఁ బెరిగిరి; పోరాటములయం దెల్లెడ తోడుగా నుండిరి; తోడుగాఁ దమ స్వధామమునకు వేంచేసిరి. కావున సోదరు లిద్దర లలిత లీలల నాస్వాదింపఁజేయుము. ఇద్దర గుణములను గానము చేయుము. ఇద్దర చరిత్రలను చక్కెర బెల్లములతోఁ మిళిత మైన పాకమును రుచి చూపినట్లు రుచి చూపింపుము.

ఇది యింత స్వాదువు, సర్వహితకారి, సుందరమగు చరిత్ర యగుచో, మీరిక్కడ ఏకాంతమునఁ గూర్చుండి, యొంటరిగా నేల యాస్వాదించుచున్నారు. ప్రపంచములో సంచరింపుడు; ఉపన్యాసము లీయుఁడు; సభలు చేయుఁడు; అందఱకు నెఱుకపఱచుఁడు. ఒంటరిగా మిమ్ములను మీరుద్ధరించుకొను టేమిటి? అందఱ నుద్ధరింపుఁ డని మీ రన వచ్చును.

అయితే సూతా! నీవు చెప్పినది నిజమే; కాని ఇప్పుడు ఘోర కలికాలము వచ్చిపడినది. ఈ కఠిన కరాళ కలికాలమును దాఁటుట చాల దుష్కరము. దీనిని సామాన్యులు దాఁటలేరు. జీవులయొక్క స్వాభావికప్రవృత్తి విషయములం దుండును. ధర్మపాలనమునకు సహిష్ణుతా సాహసము లుండవలయును. వివిధములగు క్లేశముల సహించుటకు మానవుఁడు సిద్ధపడి నప్పుడు ధర్మపాలనము జరుగును. అధర్మప్రవృత్తి పరలోకములో వాని కది యెంత అనిష్టకారి యైనను, చూచుట కాకర్షణీయముగను, సరళముగను

దోఁచును. అధర్మమందు ప్రవృత్తి చెందువాఁడు "పరలోకము నెవఁడు చూచినాడు. ముందికకుఁడ ఆనంద మనుభవించినఁ దర్వాత చూడవచ్చును" అని భావించును. ఈ విధముగ విషయము లందు నిమగ్నులై జీవులు సంసార సాగరమందు మునిఁగి తేలుచుందురు. కాని భగవంతుడు మమ్మల నీ సాగరములో మునిఁగిపోవువారలను రక్షించెను. ఏలనన దీనిని దాఁటించుటకు కర్ణధారునిగ నిన్ను చేసి పంపించెను. నీవు మాకు భగవచ్చరిత్రలను వినిపించుచున్నావు. ధర్మోపదేశము చేయుచున్నావు. ధర్మరక్షణ చేయఁగలవాఁ డా శ్రీహరియే. ధర్మమునకు హాని కలిగినప్పు డెల్ల సాధుపురుషులను రక్షించుటకును, దుష్టప్రకృతి గల పురుషులను వినాశము కావించుటకును నానారూపములతో నాతఁ డవతరించును. వాసుదేవుఁడు, నందనందనుఁడు, సంకర్షణుఁడు మొదలగు రూపములతో మిక్కిలి సావధానముతో రక్షించుచుండును. ఆయన స్వధామమునకు వేంచేసిన తర్వాత ధర్మము గతి యేమైనదో అదికూడ మీరే చెప్పవలయును.

సూతా! ఇప్పుడు మే మీ పుణ్యస్థలమును వదలిపెట్టి యెక్కడకు పోదుము? ఎవరి కుపదేశింతుము? ఎవరైన వినువా రుండిన నప్పు డేదైనఁ జేయవచ్చును. కుత్సిత వటకు దుర్వాసనకూడిన జలము బాగుగాఁ ద్రావిన తర్వాత వాని ముం దెట్టి మధుర శీతల గంగాజలము నుంచినప్పటికిని దానిని ద్రావుటకు వాని కిష్టముండదు. ఆఁకలికి మించి పొట్టనిండ భోజనము చేసినవాని ముం దెన్ని రుచ్యములగు పదార్థముల నైన నుంచుఁడు; వాఁడు తిననే తినలేఁడు. ఈవిధముగ నీ

సాంసారికులు విషయములలోఁ గట్టుపడియున్నారు. వీరు తమ మనస్సులను వివిధములగు విషయములతో నింపుకొని యున్నారు. అందువలన వీరికి భగవన్నామ గుణకీర్తనము, భగవత్కథా శ్రవణము చేయవలెనను కోరిక యుండనే యుండదు. వినఁ గోరికలేనివారికి చెప్పుట తమ కాలమును దురుపయోగము కావించుకొనుటయే అందువలన మే మెచ్చటకును రాము; పోము. కోరిక గలవా రిచ్చటికే రాఁగలరు. మా యీ భగవన్నామ గుణకీర్తన రూప మగు సత్ర ద్వార మందఱకు తెలుపఁబడినది. ఎవరైనను వచ్చి భగవన్నామ కథను వినవచ్చును. ఎవరికిని నిషేధము లేదు. దేశ, కాల, జాతి, వర్ణ బంధనము లేదు. అందువలననే కలి వచ్చినదని తెలిసికొని, మే మీ వైష్ణవ క్షేత్రమందు దీర్ఘసత్ర దీక్షను గైకొని, భగవత్కథ కొఱకు కవకాశము కల్పించుకొని కూర్చుండి యున్నాము. ఇప్పు డింక మీరు మాకు సర్వోత్కృష్ట సారాతిసార తత్త్వము నుపదేశింపుఁడు.

ఛప్పయ

కలియుగ ఆయో జాని ఆని బైఠే వర బనమేఁ।
విష్ణు బతాఈ బాట్ చక్ర లే ఆయో ఛిన మేఁ॥
జాని వైష్ణవక్షేత్ర యజ్ఞ కీ దీక్షా లీ న్హీఁ।
కృష్ణకథా నితసునేఁ సబని శుభ సమ్మతి కీన్హీఁ॥
సూత! జగత తేఁ మోరి ముఖ, కృష్ణ చరణ మేఁచితదియోఁ।
కృష్ణకథా కలిమలహారని, కహీ కృపా కరి హిత కియో।

అర్థము

కలియుగము వచ్చినదని తెలిసికొని, విష్ణువు చెప్పిన బాటను చక్రము తీసికొనివచ్చిన యీ వనములోఁ గూర్చుంటిమి. ఇది వైష్ణవక్షేత్రమని యజ్ఞదీక్ష గైకొంటిమి. నిత్యము శుభమైన కృష్ణకథను వినవలెనని అందఱ మంగీకరించితిమి.

ఓ సూతా! జగత్తును విముఖులను గావించి శ్రీకృష్ణ చరణము లందు చిత్తము నుండునట్లు చేసితివి. శ్రీకృష్ణకథ కలిమలమును హరించునది. నీవు దానిని జెప్పి హితమును గావించితివి.

# పరమ ధర్మము

శ్లో॥ స వై పుంసాం పరో ధర్మో
యతో భక్తి రధోక్షజే
అహైతుక్య ప్రతిహతా
యయాత్మా సంప్రసీదతి॥*

శ్రీమద్భాగవతము ౧ స్కం. ౨ అ. ౬ శ్లో.

ఛప్పయ

పరమ ధర్మ హై యహీ భక్తి భగవత మేఁ హోవే।
హోవే హర్షిత హృదయ మలినతా మన కీ ఖోవే।
హేతు రహిత నిష్కామ భక్తి అతి పరమ సుహాఈ।
సబ శాస్త్రని కో సార్ యహీ మేరే మన భాఈ॥
శౌనకజీ! సచ్ సచ్ కహూఁ, సబసంతని సమ్మత యహీ।
భక్తి భనీ భాగీరథీ, విషయ వాసనా విష కహీ॥

అర్థము

భగవంతునియందు భక్తి కలుగుటయే పరమధర్మము. ఈ భక్తి వలన హృదయము హర్షోత్ఫుల్లమగును. మనో మలినములు పోవును. అహైతుకమగు నిష్కామభక్తి ఉత్తమమైనది. అదియే శోభించును. సమస్త శాస్త్రముల సారమిదియే నని నా మనోభిప్రాయము.

---

*దేనివలన నధోక్షజుఁడగు వాసుదేవుని యందహైతుకము నవ్యభిచారి యగు భక్తి కలుగునో, దేనివలనఁ దన యంతరాత్మ ప్రసన్న మగునో అదియే మానవులకు సర్వశ్రేష్ఠమైన ధర్మము.

ఓ శౌనకా! సత్యము చెప్పుచున్నాను. భక్తి భాగీరథిగాఁ జెప్పఁబడినది. అది యుండిన నిఁక విషయవాసనా విష మెచ్చట యుండును? ఇదియే సమస్త సాధుమహాత్ముల యొక్క యభిప్రాయము.

ప్రపంచములో గొప్ప గొప్ప విద్వాంసు లగు వక్తలు చాలామంది దొఱకుదురు. కాని శ్రద్ధావంతు లగు నిజమైన శ్రోతలు కూడ మిక్కిలి దుర్లభులు. ఉపదేష్టకు మేధావి విషయమును దెలిసికొనఁగలుగు బుద్ధిమంతుఁ డగు శ్రోత దొఱికెనా యాతఁడు తన హృదయ కవాటమును దెఱచును. వాని కేమియు దాపరిక ముండదు. చంద్రకాంతిలో చంద్రకాంతమణి ద్రవించి నట్లు శ్రద్ధావంతుఁ డగు శ్రోత సమ్ముఖమున వక్త వాక్కు ప్రకాశించును.

శౌనకుని యిట్టి యైకాంతిక రహస్యమయ ప్రశ్నను విని హర్ష కారణమున సూతుని వెంద్రుకలు నిక్కపొడిచెను. ఆతని నేత్రములు రెండును ప్రేమాశ్రువులచేఁ దడిసిపోయెను. హృదయ కళిక వికసించెను. ముఖము ప్రసన్నమయ్యెను. కంఠము గద్గద మగుటచే చాలసేపటివఱ కేమియు మాటలాడఁజాలక పోయెను. ప్రేమవేగము కొంచెము తగ్గిన తర్వాత నాతఁడు చేతులు జోడించి మిక్కిలి ప్రేమతో "ఋషులారా! మీఁకు తప్ప ఇంకెవ రడుగఁజాలని యద్భుత యలౌకిక ప్రశ్న నడిగితిరి. నేఁడు మీరు నన్నుఁ గృతార్థుని గావించితిరి. నేను మలినమతి నగుటచే, దీనికి యథార్థమగు ప్రత్యుత్తరము నీయఁజాలకున్నాను. నేను జెప్పిన దేకొద్ది

మైన నుండిన, దానిని నా గురుదేవుని కృపవలనఁ జెప్పెదను. నా తండ్రి వ్యాసభగవానుని కడ సమస్త పురాణేతిహాసముల నధ్యయనము కావించెను. నేను సమస్త శాస్త్రములను నా తండ్రివలన వింటిని. కాని సారాతిసార తత్త్వమును నేను వ్యాసనందనుఁ డగు శుకునివలన వింటిని. కావున నాతఁడే నా యజ్ఞానమును నాశము చేసిన గురుదేవుఁడు. నే నేది చెప్పినను ఆయన కృపాప్రసాదముచేతనే చెప్పెదను. గురుకృపవలననే మానవుఁడు సమస్తము చేయఁగలుగుచున్నాఁడు. గురుకృపవలన మూగవాఁడు కూడ ఉపన్యాసము చెప్పఁగలడు. కుంటివాఁడు కొండను దూకఁగలఁడు. నా సర్వస్వము శ్రీ శుకదేవుఁడే. ఆయన పాదపద్మములకు వందనము కావించి, అనంతరము నేను శ్రీమన్నారాయణునకు, నరునకు, నరోత్తమునకు, సరస్వతీదేవికి, నా గురువునకుఁ గూడ గురువైన వ్యాసభగవానునకు వందనము కావించి మీ ప్రశ్నకు సరియైన సమాధానము చెప్పెదను.

మీకు శంకేమి యుండఁగలదు? మీరు సర్వశాస్త్ర నిష్ణాతులు. సారాసార మర్మము బాగుగాఁ దెలిసికొనఁగలవారు. మీరీ ప్రశ్నము లోకకల్యాణము కొఱకు చేసితిరి. మీరు నన్ను నిమిత్తమాత్రునిగఁ జేసి ప్రపంచమునకు వెల్లడి చేయఁగోరుచున్నారు. మీరు ఋషిముఖమునఁ బ్రకటము చేయక సూతముఖమునఁ జెప్పింపఁ గోరుచున్నారు. అన్నియు మీ ముఖము లే. యంత్రముయొక్క ముఖము యంత్రియధీనము. మీకెట్టి భావములు కావలయునో వాటిని యీ యంత్రము ద్వారా ప్రకటింపఁ జేతురు. ప్రపంచములోఁ జెప్పఁదగినది

శ్రీకృష్ణకథయే. దానిని తప్పితే ఇంకఁ జెప్పుటకుఁ గూడ యేమున్నది? అందువలననే మీరు కృష్ణకథను జెప్పింపఁ గోరుచున్నారు. కల్యాణకాంక్షికి ఇంతవఱకు కృష్ణకథవలన తృప్తిపొందలేదు, పొందలేరు. ఇందులో శ్రోత వక్తల కిద్దరకు సంతోషము కలుగును. అందువలన నా మన స్సత్యం తాహ్లాదకరముగ నున్నది. నేను మీ పరమపావన ప్రశ్నకు ప్రసన్నతాపూర్వకముగఁ బ్రత్యుత్తర మిచ్చెదను. మీరందఱు సమాహిత చిత్తులరై వినుఁడు."

"మునులారా! భగవంతుని చరణములం దహైతుక నిష్కామభక్తి కలిగినచో సమస్త ఇహపరలోక కార్యము లన్నియు నెఱవేఱునను నీ సారవాక్యమును వింటిని, తెలిసికొంటిని. హృదయములో భగవంతుఁడు వాసము చేసెనా, ఇంక కామక్రోధము లను నసురు లెట్లుండఁగలరు? సమస్త దుఃఖములకు మూలకారణము 'కామము'. మొట్టమొదట హృదయములో విషయభోగేచ్ఛ కలుగును. విషయభోగము ప్రపంచములో నెంత యపర్యాప్తమో తెలియునా? సమస్త ప్రాణుల విషయ మెందుకు? సమస్త విషయసామగ్రి నొకే పురుషునకిచ్చినను, అవన్నియుఁ గలిసియు నొకవ్యక్తిని తృప్తిఁ బొందింపఁజాలవు. ఇఁక నసంఖ్యాకు లగు పురుషుల వాసనల నన్నిటిని నిరంతరము తీర్చుట యసంభవము. మనము కోరినవస్తువు లభింపకపోయెనా, హృదయములో క్షోభ ముత్పన్నమగును. ఆక్షోభమే చిత్తప్రసన్నత నంతను నాశము కావించును. ప్రపంచములో దీనిచే మానవుల చిత్తము సదా క్షోభము చెందుచుండును. అందఱు నేదో చింతకు వశీ

భూతులై చింతితు లగుచుందురు. వారి మనస్సంతోషము వినష్టమై పోవును. హృదయమంతయు భక్తిభావముతో నిండి పోయెనా, ఇఁకఁ జింత యుండఁజాలదు. అందుకనియే భక్తు లెల్లప్పుడును ప్రఫుల్లచిత్తులుగ నుందురు. వారు భగవత్ప్రే మలో నేడ్చినను వారికాంతి తరుగదు. ఇంతేకాదు, వారేడ్చి నపుడు ముఖము కమలమువలె మిగుల వికసించి దర్శనీయ ముగఁ గానఁబడును. ఈ భగవద్భక్తి రూపానుష్ఠానమును మొదలుపెట్టుట చేతనే గొప్పగొప్ప దుఃఖములనుండి మానవుఁడు ముక్తుఁడగును.

'సంసారములో నుండి మేము భక్తిచేయుద మన్నను జ్ఞాన వైరాగ్యములు కలుగవుకదా! దానికి శమదమాది షట్కసంపత్తి కావలెనుకదా! గృహత్యాగ మావశ్యకము గదా' యని మీరు ప్రశ్నింపవచ్చును. ఈ మార్గములో నవి అక్కఱలేదు. రాజు ముందువెళ్ళుచుండిన, నాయన సేవకులు స్వయముగ నాయన వెనుకనే వెళ్ళునట్లు, నిష్కామభక్తి కలిగిన తర్వాత జ్ఞాన వైరాగ్యములు తమకుఁదామే వచ్చును. జ్ఞాన వైరాగ్యములు భక్తికి పాలుత్రాగు పసిపాపలు. అవి తల్లిని వదలి యెచ్చటికి పోఁగలవు?

ఇఁక త్రివర్గముల విషయమున్నది. ధర్మము చేయుటచే నర్థప్రాప్తి కలుగునని శాస్త్రములందు చెప్పఁబడినది. అర్థము వలన నింద్రియసుఖ మిచ్చునట్టి కామప్రాప్తి కలుగును. కామ్య పదార్థముల నుపభోగించుటచే నింద్రియజన్య సుఖము కలుగును. ఈ లోకములో నింద్రియసుఖము, పర

లోకములో స్వర్గసుఖము అనఁగా నిహపరలోక సుఖము
రెంటిని కావలెనని కామమును (కోరికను) వినియోగించెనా
దానిని ధర్మముగఁ బరిగణింతురు. భగవద్భక్తులకు శారీరక
సుఖముండదు. ఉన్నను చాల కొలఁదిగ నుండుటను గాంచు
చున్నాము. వారు సాధారణముగ నిర్ధనులుగను, నకించనులు
గను గనఁబడుచున్నారు. భగవద్భక్తియే పరమ ధర్మమగుచో
ధర్మమునకు ఫలమైన నేయర్థము కలదో అది వాని కెక్కు
వగ నుండవలెను. ధర్మముచేఁ గలుగు నర్థప్రాప్తికంటెఁ బరమ
ధర్మముచేఁ గలుగునది దానికంటె నెక్కువైనచో బాగే.
లేకపోయిన భగవద్భక్తి పరమ ధర్మమని యెట్లనుకొనఁ
గలుగుదుము? ఏలననఁగా ధర్మమునకు ఫలమైన నేయర్థము
కలదో అది కనఁబడుట లేదు.

ఇట్టి సందేహము భ్రమాత్మకమే. ధర్మమునకు వాస్త
వికఫల మర్థసిద్ధియే కాదు. ధర్మమునకు ముఖ్యప్రయోజనము
భగవచ్చరణారవిందములందు ప్రేమ కలుగుటయే. ఏ ధర్మాను
ష్ఠానమువలన ప్రభు పాదపద్మములందు ప్రేమ కలుగదో, ఏ
ధర్మము భగవద్భక్తి నుత్పన్నము కావింపదో, ఏ ధర్మము
వలన త్రైలోక్యపావనమును, ముని మనోహారిణియుఁ, గమ
నీయము నగు వాసుదేవుని కథలయందు రతి కలుగదో అది
ధర్మమే కాదు, ధర్మాభ్యాసము. అది నిరర్థకపరిశ్రమయే. అది
యూసరక్షేత్రమున నీరుపెట్టుట వంటిది. ధర్మతాత్పర్యము
కృష్ణకథలయం దనురాగము కలుగు టొక్కటియే. ధర్మాను
ష్ఠానమును జేయుట అర్థము కొఱకు కాదు. దాని యుద్దేశ్య
మొక్క మోక్షప్రాప్తి కొఱకే. ధర్మము ధర్మముకొఱకు

చేయఁబడును గాని కామముకొఱకు కాదు. ధనమునకు ఫలము కేవల కామోపభోగమునకు, ఇంద్రియ సుఖమునకే కాదు. ధనము భగవత్పూజనములో సదుపయోగము కావింప వలయును. విశేషధనమున్న యెడల మహారాజులకువలె వైభవముగ వాసుదేవభగవానుని పూజింపవలయును లేదా ఆయన పూజార్చనల కేర్పాటు చేయవలయును. పూజకొఱకు ఫల పుష్పోద్యాన వనములను వేయించవచ్చును. దివ్యదేశములను మందిరములను నిర్మాణము చేయవలెను. భగవద్విగ్రహాము లను ప్రతిష్ఠింపవచ్చును. మిక్కిలి వైభవోపేతముగ నుత్సవ ములు చేయవచ్చును. భగవద్భక్తి ప్రసారము, ప్రచారము చేయించవచ్చును. ఇదియే ధనమునకు యథార్థోపయోగము.

అధర్మపూర్వకముగ నింద్రియతృప్తి కావించుటయే కామము కాదు. కామము ధర్మపూర్వకముగనే యుండవల యును. కేవలము ఋతుకాలములో, స్వభార్యతో, కేవలము సంతానోత్పత్తి కొఱకే, వంశమూలచ్ఛేదము కాకుండుటకుఁ గాను, ఇది సనాతనధర్మముగా నున్నది. కావున నీ భావము తోడనే, పితృఋణవిముక్తి కొఱకు పోవలయును. ఇంద్రియ విషయోపబుద్ధితోఁ బనికిరాదు. ఇది భగవత్ప్రసాదమను బుద్ధితో చేయవలయును. ఇంద్రియతృప్తి బుద్ధితోఁ జేసిన నదే విషయమగును. కేవలము భావనను మార్చుటయే అవ సరము. తాను విషయకింకరుఁడు కాక కేశవకింకరుఁడు కావలయును. ఆ కేశవునే కొందఱు కృష్ణుఁడందురు, కొందఱు పరతత్త్వమందురు. కొందఱ అవినాశి, అవ్యయ, అలఘు, అగో చరుఁ డందురు. జ్ఞానులాయనను బ్రహ్మమందురు. యోగులు

పరమాత్మ యని పిలుతురు. భక్తులాయననే భగవంతునిగ నెంచి పూజింతురు. ఆయన కొఱకే సమస్త కార్యములు చేయవలెను. ఇదియే త్రివర్గముల ఫలము.

కేవలము యశః ప్రతిష్ఠకొఱకు, లక్ష్మికొఱకు వర్ణాశ్రమ ధర్మపాలనము చేసి, దానివలన శ్రీధరభగవానుని పాదపద్మముల నిరంతర స్మృతి కలుగకపోయినచో నది వాస్తవిక ధర్మముకాదు. మన చేష్టలన్నియు నందనందనుని కొఱకై యుండవలయును. ఇదియే పరమార్థము. ఇదియే సారాతిసారము. ఇదియే సర్వోత్కృష్ట సాధనము. ఇదియే మోక్షముకంటెఁగూడ మించిన పురుషార్థము. భగవంతుని ప్రసన్నము కావించుటే వర్ణాశ్రమ ధర్మముయొక్క ప్రయోజనము.

'ముఖ్యకర్తవ్యమేమి ?' యని మీరడిగితిరి. నేను మానవజన్మ యెత్తినందుకు ఏవిధముగనైనను, ఏ ఉపాయముచేనైనను, సమస్తవిధముల, సమస్తపద్ధతులచే మనస్సును బలాత్కారముగ విషయములనుండి తొలగించి వాసుదేవ భగవానుని లీలలను, గుణములను నిరంతరము శ్రవణముచేయుటే ముఖ్యకర్తవ్యమని తలఁచుచున్నాను. ఆయన మధురాతిమధుర నామములను, త్రైలోక్యపావన యశమును గీర్తింపవలయును. ఏకాంతములోఁ గూర్చుండి, సమస్త విషయముల నుండి చిత్తమును దొలగించి యాతని ధ్యానమునే చేయవలయును. దొఱకిన ద్రవ్యముతో, సమస్త విధములగు సాధనములచే, సమస్త ప్రయత్నములచే నా పరమాత్మ పూజనము చేయవలయును.

శౌనకా ! నీవే యాలోచింపుము. ఎవని ధ్యానమను ఖడ్గముచే సమస్త విధములగు క్లేశములు, సమస్త విధములగు చింతలు, సమస్త విధములగు బంధములు క్షణములోఁ గోయ బడునో, భవభయహారియు, మదన మురారియు నగు శ్రీహరి పాదపద్మముల నెవఁడు ప్రేమింపఁడు ? ఎవని కాతని చర ణారవిందములందు రతి కలుగదు ? ఋషులారా ! నేనిదియే సర్వశ్రేష్ఠసారమని తెలిసికొనుచున్నాను. ఇప్పుడింక మీరేమి వినఁగోరుచున్నారు ? దానిని మీరు నాకు చెప్పుఁడు. ఇప్పుడు నామనస్సతి ప్రఫుల్లితమైనది. మీరు దేనినడిగిన దానికి నేను ప్రత్యుత్తర మొసంగెదను.'' అనెను.

ఛప్పయ

కథా శ్రవణ నితకరేఁ శ్రవణవేహీఁహైఁ సుఖకర్।
వాణీ విమల వహీ కృష్ణ కీర్తనమేఁ తత్పర్॥
మన మోహాన మేఁ మిలే సతత హరి చరనని సేవే।
కర్మ కరే జోకభూ కృష్ణ అర్పణ కరి దేవే॥
ధ్యాన ఖడ్గసే కర్మకీ, గ్రంథి కతరతే తీక్ష్ణ అతి।
జినకో యశ పావన పరమ, కోన కథామే కరహిరతి॥

అర్థము

ప్రతినిత్యము శ్రీహరి కథాశ్రవణము చేసిన చెవులే చెవులు. అది సుఖకరమైనది. శ్రీకృష్ణ కీర్తనములోఁ దత్పర మైన వాక్కే విమలవాక్కు. మన మోహానుని గలిసికొని నిరంతరము శ్రీహరి చరణములను సేవింపవలయును.

ఏ కొంచెము కర్మ నొనర్చినప్పటికిని దానిని శ్రీకృష్ణున కర్పింపవలయును.

అతితీక్ష్ణమగు ధ్యానఖడ్గముచే కర్మగ్రంధిని ఛేదింపవలయును. ఎవని యశము పరమపావనమో అట్టివాని కథయందు ప్రీతి యెవరు చెందరు ?

# భాగవత సేవ

శ్లో॥ నష్టప్రాయేష్వ భద్రేషు
నిత్యం భాగవత సేవయా।
భగవత్యుత్తమశ్లోకే
భక్తిర్భవతి నైష్ఠికీ॥*

(భాగవతము ౧ స్కం. ౨ అ. ౧౮ శ్లో.)

ఛప్పయ

భగవత భక్తి సహాయ భాగవత తే కహాలావేఁ।
అజ అవ్యక్త అనాది సగుణ సాకార లఖావేఁ॥
వే అనంత అవతార అమిత లీలా విస్తారేఁ।
నామ, రూప, గుణ, ధామ జగత్ జీవన కూఁ తారేఁ॥
జో ఇనకూఁ గావేఁ సునేఁ, నిత సేవన సుఖ సే కరేఁ।
భక్త భాగవత హైఁ వహీ, కరత జగత పావన ఫిరేఁ॥

అర్థము.

భగవద్భక్తికి సహాయమైనది భాగవతమనిపిలువబడును. అజుఁడు, నవ్యక్తుఁడు, ననంతుఁడు నైన పరమాత్మ సగుణ సాకారమును ధరించి యనేక అవతారముల నెత్తి అంతులేని లీలలను విస్తరింపజేసెను. అట్లాయన నామ, రూప, గుణ, ధామములు జగత్తులోని జీవితములను దరింపఁజేసెను.

---

* నిత్యము భాగవత సేవవలనను, భక్తుల సేవవలనను, అశుభవాసనలన్నియు సాధారణముగా నాశమగును. అప్పుడుత్తమ శ్లోకుఁడైన నందనందనుని యందు నిశ్చలమైన ప్రేమ భక్తి యుత్పన్నమగును.

దీని నెవఁడు గానము చేయుచున్నాఁడో, వినుచు న్నాఁడో, నిత్యము సుఖముగ సేవించుచున్నాఁడో, వాఁడే భక్తుఁడు, వాఁడే భాగవతుఁడు. వాఁడు తిరిగి జగత్పావనము కావించును.

సూతుఁడు మాటి మాటికి 'భాగవతము' అను పద ప్రయోగము చేసినప్పుడు 'భాగవత' శబ్దముయొక్క అభి ప్రాయ మేమియో యని స్వాభావికముగ జిజ్ఞాస కలుగును. ఇట్లు విచారించి ఋషుల తరపున శౌనకమహర్షి "సూతా! సమస్త పాపములు భాగవత సేవవలన నశించునని నీవు చాల సార్లు చెప్పితివి. అయితే 'భాగవతసేవ' యనిన నీ యుద్దేశ్య మేమి? భాగవతమని దేని నందురు? భాగవతసేవ యెట్లు చేయవలయును? శ్రీమద్భాగవత పుస్తకసేవ చేయవలెనా, లేక యింకేదైన గూఢాభిప్రాయ మున్నదా?"

ఋషులప్రశ్నను విని సూతుఁడు "మహానుభావులారా! మీ కన్నియుఁ దెలిసియుండియు లోకహితము కొఱకు దీని నడుగుచున్నారు. భగవంతునితో సంబంధము కలది 'భాగ వత' మని నా యభిప్రాయము. అయితే మీరు భగవంతు నితో సంబంధ మేపదార్థమునకు లేదని మీ రడుగవచ్చును. చరాచర విశ్వమంతయు నాయన రూపమే. తృణము మొదలు పర్వతము వఱకు, బిందువు మొదలు సింధువువఱకు, చీమ మొదలు బ్రహ్మవఱకు, పరమాణువు మొదలు బ్రహ్మాండము వఱకు అన్నిటిలో నాతఁడు సమానముగ

వ్యాప్తమై యున్నాఁడు. ఆతఁడు లేక యింకొకటి లేనే లేదు. అట్టియెడ నన్నియు 'భాగవత' మయ్యెను.

ఇది నిజమే. అన్నిటిలో భగవత్ సత్తా యున్నది; కావున నన్నియు భాగవతములే. అయినను సంబంధము సామాన్యముగ విశేషముగఁగూడ నుండును. సామాన్యముగ నన్నిటితోను సంబంధము కలదు. కాని ఇచ్చట విశేష సంబంధమునకే వర్తించును. ఏ భక్తుఁడు భగవద్భక్తి కావించునో వారిని 'భాగవతు' లందురు. ఏ కథలలో, నే గ్రంథములలో భగవద్భక్తుల కథలు, భగవదవతార, నామ, రూప, లీలా, ధామాదుల వర్ణనముండునో, దానిని కూడ భాగవత మందురు. భగవంతుఁ డనేకరూపములను ధరించి, అనేక ప్రకారముల లీలలఁ గావించును. ఆయన లీలల కుపకరణములైన వారును, ఆయనయొక్క విశేషకృపను బొందిన భక్తులును, భగవల్లీలలు జరుగు పరమపావన ధామములును, అనేక దివ్యగుణములు, లీలల కారణమునఁ బ్రకటమైన జగత్పావన నామములును, భగవంతుఁడు తన భక్తుల ననుగ్రహించి ప్రత్యక్షమైన అనేకరూపములును 'భాగవతము'. వీరి కథలుండు గ్రంథములుకూడ భాగవతమే. భగవత్స్వరూపములే. వాటి పూజకూడ భగవద్బుద్ధితోడనే చేయవలయును. ఇప్పుడిచ్చట ఒక సందేహము కలుగును. భగవత్కృపాప్రసాదమును బొందిన భక్తుల కథలు, భక్తులు 'భాగవతు' లనుట నిశ్చయమే. కాని భక్తగ్రంథములలో చాలమంది అభక్తుల కథావర్ణనము కూడ కలదు. వేనుఁడు, హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, రావణ కుంభకర్ణులు, శిశుపాల దంతవక్త్రులు మొదట

కొనకున్నను చాలమంది మిమ్ములను తమ గురువని చెప్పు కొనుచుందురు. మీరో నా కొక్కఁడే శిష్యుఁ డనుచున్నారు. వాఁడైనను మీ మాటలనుబట్టి మీ స్వాధీనమున లేనివాఁ డనియుఁ, జంచలుఁడనియు తెలియుచున్నది. వాని పేరు చెప్పుడు. భగవంతుఁడు తప్పఁజూచి మీ రీ మధ్య కన్నుమూసి నచో మీకు ఉత్తరాధికారిగా వానిని జేసెదము. అని పౌరు లనవచ్చును.

నా యేకమాత్ర శిష్యుని నామము 'నా మనస్సు.' యథార్థమునకు శిష్యునిగాఁ జేసికొనవలసిన దిదియే. దీనికి దీక్షనిచ్చి వశమం దుంచుకొనినవాఁ డీ జగత్తు సంతను వశమం దుంచుకొనినట్లే. ఆతఁడే యథార్థ గురుపదమున కధికారి. దీనిని వశము కావించుకొనక గురువగువాఁడు కేవలము వాఁడు వ్యవహారమాత్రమునకే. పరమార్థములో వాని కేదైన యుప యోగమున్నచో నది లేనిదాని క్రింద లెక్కయే. ఈ నా విలా సియుఁ జంచలుఁడు నగు శిష్యుఁ డిప్పటి కింకను వశపడ లేదు. అందువలన నేను గురు వని పిలువఁబడక గరవ నగుచున్నాను. వ్యాపారసంబంధమైన లెక్కవేయుటకు చెప్పు సూత్రమునకు వారు 'గురు' వందురు. ఎట్లనఁగా

ఒక రూపాయ కెన్ని సేరులో (సేరనఁగా ౮౦ తుల ములు) ఒక అణా కన్ని చటాకులు. (చటాకు ౫ తులములు) ఇది యొక 'గురవు'. ఏదైన వస్తువు రూపాయకు పదిమ్మొప్పె తిక సేర్లు వచ్చిన వనుకొనుఁడు. ఒక అణాకు పదిమువ్వొతిక చటాకులు వచ్చును. దీనికి లెక్కవేయవలసిన పనియేలేదు. ఒకని జీతము రోజున కెన్ని అణాలో దానిని రెట్టింపు

క్రీడల నొనర్చును. తన ప్రియమైన భక్తుల కనేక విధములగు సుఖముల నొసంగును. వారి దుష్టత్వమే లీలలకు ఆధేయమున కాధారమగును. వీరు తమ యత్యధిక క్రూర కర్మలచేతను, అత్యాచారములచేతను అనాది, అవ్యక్త, అచిన్త్యాతి గుణ ములుగల ప్రభువును సర్వసాధారణుల యెదుట వ్యక్తరూప మున నుండునట్లు చేయుదురు. కావున వారి చరిత్ర భగవ చ్చరిత్రకు భిన్నముకాదు. అది భగవచ్చరిత్ర కనుకనే దానికి భాగవతమను పేరు వచ్చినది. భక్తులతోడను, భగవంతుని తోడను మిక్కిలి సంబంధము కలవారి చరిత్ర లన్నియు భాగవత చరిత్ర కంతర్గతములే. వేనుఁడు దుష్టుఁ డైనప్పటికిని ఆతఁడు భగవంతుని యంశావతారమగు పృథుమహారాజు నకుఁ దండ్రి. అతఁడు ఋషుల యెడలను మునుల యెడలను దుష్టత్వము నొనర్చి వారిచేఁ జచ్చెను. పృథ్వీపతియగు పృథు చక్రవర్తితోడను, ధర్మస్వరూపులగు ఋషులతోడను సంబంధ ముండుటచే వాని చరిత్ర కూడ భాగవత చరిత్రయే యైనది."

"దీనివలన తప్పనిసరిగ భగవంతుని యవతార మెత్తు నట్లొనర్చిన యీ ప్రబల పరాక్రములు, అసురస్వభావము కలవారే శ్రేష్ఠు లని తేలుచున్నదే యని మీ కిప్పుడొక శంక కలుగ వచ్చును."

దీనిలో నేమియు సందేహము లేదు. భగవంతునికంటె భక్తునే శ్రేష్ఠునిగఁ జెప్పినారు. ఇంకొక మాటతో భక్తునికి తన కేమియు సంకల్పము లేకపోయినప్పటికిని చరాచరస్వామి ఆతని హృదయములోఁ గూర్చుండి యెట్లు ప్రేరేపించునో,

యెట్టి సంకల్పములు కావించునో ఆతఁ డట్లే చేయును. యథార్థమునకు భక్తుఁడు భగవంతునకు భిన్నుఁడు కాఁడు; ఈ రావణ, కుంభకర్ణ, హిరణ్యాక్ష, హిరణ్యకశిప, శిశుపాల, దంతవక్త్రాదు లన్యు లెవరును గారు. వారు నిత్య పార్షదులు. ఒకవిధముగ భగవచ్ఛరీరమునకు వా రంగములే. వీరు జయ విజయు లను పేరట వైకుంఠవాసియగు విష్ణువునకుఁ బ్రియాను చరులు. ఒంటరిగా నుండి యుండి భగవంతునకు విసుగు పుట్టెను. అప్పుడాయనకు కొంచెము క్రీడింప నిచ్ఛకలుగును. కొంచెము కలియబడుట, యుద్ధముచేయుట, దెబ్బలాడుట యుండిన మనస్సున కాహ్లాదముగ నుండును. సర్వసమర్థుఁ డగు ప్రభువుతో నెవరు పోరాడఁగలరు. ఋషులు, మునులు, దేవతలు దాసభావముతో నుందురు. వారిని గంటలువాయించు మనిన వాయింతురు, పూజచేయుమనినఁ జేతురు. కాని భగవా నునితోఁ బోరాడు మను టెందులకు. విరోధము మాట చెప్పఁ గనే కోసులుదూరము పారిపోవుదురు. వీ రెల్లప్పుడును భగ వంతుని ముందు అంజలి బంధించుకొని యుందురు. భగ వంతుఁ డీ వినమ్రతకు విసుగు చెందినప్పటికిని వారు వారి స్వభావములను మార్చుకొనఁజాలరు. భగవంతుని స్మరణము కలుగఁగానే అశ్రువులు వాటి కవియే ప్రవహించును; హృద యము కరిగిపోవును; రోమములు నిక్కపొడుచును; కంఠము గద్గదిక మగును; చేతులు రెండును ప్రయాసము లేకయే జోడించుకొనును; పోట్లాట; యుద్ధము విడిచేతులతో జరుగ వలసిన పని. కావుననే భగవంతుఁడు తన ఆంతరంగ సఖులకు అనంతశక్తిని సమర్పించి తన దివ్యలోకమునుండి ధామ

ధామమునకుఁ గౌతుకమునకై పంపుచుండును. అతఁడు పంపిన కార్యమునకు వెళ్ళినప్పుడు దానిలో ద్వేష మేమున్నది. వారు భగవదిచ్ఛానుసారముగ విరోధించుచుందురు. వారు భగవంతుని యంత్రము లైనప్పుడును, అతఁడే తన శక్తిచేతనే వారిని ప్రబలులుగఁ గావించినప్పుడును వారు గొప్పవారే; వారి చరిత్ర భగవచ్చరిత్రయే యైనది.

"సత్త్వరజస్తమో గుణములు మూఁడును ప్రకృతివే; ఆ ప్రకృతి భగవంతుని చేడియ. ఆయన సంకేతానుసారముగ నృత్యము చేయుచుండును. ఈ మూఁడు భావములతో బ్రహ్మ విష్ణు మహేశ్వరు లను పేర శ్రీహరి సృష్టి, స్థితి, సంహారములు చేయుటకు మూఁడు రూపములను ధరించు చున్నాఁడు. అందులో పరమ ఆరాధనీయుఁడును, పరమ మంగళమయుఁడును భగవంతుని సత్త్వమూర్తియే. సాత్త్విత వైష్ణవు లా మూర్తినే ఆరాదించుచుందురు. ఆయన గుణములనే గానము చేయుచుందురు. ఆయనశక్తిమాత్ర మన్నిటిలోను గలదు అగ్ని అన్నిటిలోను వ్యాపించి యున్నది. అగ్ని లేక కాష్ఠ ధూమాదు లుండజాలవు. అయినప్పటికిని కాష్టముకంటె ధూమము, ధూమముకంటెఁ బ్రజ్వలితాగ్ని శ్రేష్ఠముగ నెన్నుట లోకములోఁ గానఁబడుచున్నది. అట్లే తమోగుణముకంటె రజో గుణము, రజోగుణముకంటె సత్త్వగుణము శ్రేష్ఠముగ నెన్నఁబడుచున్నవి. కావున సత్త్వమూర్తి యగు శ్రీహరి గుణ గానము చేయుటచే నంతఃకరణము పవిత్ర మగుచున్నది.

భాగవతమునకు ముఖ్య ఆధేయము అవతారతత్త్వము. అవతారకథలో భక్తిభక్త భాగవతుల సమావేశ మొక్కసారిగాఁ గలుగుచున్నది.

అవతారకథలో కేవలము భక్త భగవంతుల సంబంధమే యుండును. భగవదవతారము కేవలము దుష్టసంహారము కొఱకే రాదు. ఇది యొక నిమిత్తమాత్రమే. నిజము చెప్పవలసి వచ్చునెడల భగవంతుడు కేవలము భక్తుల కొఱకే అవతార మెత్తుచుండును. గోవు పాలను తన దూడ కొఱకే యెట్లిచ్చుచుండునో ఆ మూలకముగ నితరులుకూడ యెట్లు ప్రయోజనమును బొందుచున్నారో అట్లే భగవంతుఁడవతరించుట కేవలము భక్తుల సుఖము కొఱకే. భక్తులలోఁ గూడ చాల భేదములు కలవు. భగవంతుని భక్తు లే భావములో భజించుచుందురో భగవంతుఁడు కూడ వారి కా భావముతోడనే యిచ్ఛాపూర్తి కావించుచుండును. భగవదవతారము కేవలము మానవుఁడుగానే, భూమియందే కలుగునని లేదు. ఆతఁడు దేవతా, తిర్యక్పశుపక్షి యోను లన్నిటి యందును అవతరించుచుండును. ఆతని యవతారము భూమిమీఁదను, స్వర్గాదిలోకములకు పైనను, భూమికి క్రిందలోకములలోనను అవతరించుచుండును. హంసావతారము సత్యలోకములోను, శూకరావతారము మహర్లోకములోను కలిగెను. ఈవిధముగ భగవదనుగ్రహము జీవమాత్రులపైఁ గలదు. ఆతఁడు దేశకాల బంధనములనుండి విముక్తిఁ జెందినవాఁడు. ఆయనకు జీవు లందఱు సమానులే. ఆయన

యేజాతిలోఁ బుట్టుట ఆవశ్యకమో ఆజాతిలోఁ బుట్టి అక్కడ జీవులను తన దివ్య లీలలచే నానందింపఁ జేయుచుండును.

ఆప్రభువు భూతభావనుఁడు. చరాచరములకు స్వామి. సర్వత్రాత. బ్రహ్మరూపమును ధరించి యాతఁడే ప్రళయము నందు లీనమై ప్రజలను సృజించును. ఆతఁడే విష్ణురూపమును ధరించి రాజులలోను, దేవతలలోను, ఋషులలోను తనశక్తి ప్రసాదించి నానావతారములను ధరించి యీచరాచరజగత్తును బాలించుచుండును. చివర కాతఁడే సాక్షాచ్ఛివరూపమును ధరించి సమస్తలోకములను సంహారము కావించును. ఆతని శక్తికి అంతులేదు. ఆతని పురుషార్థమునకు పరిధి యేమియు లేదు. ఆతని అవతారములకు లెక్కలేదు. ఆ అనాది అనంత ప్రభువు అనేక రూపములతో కళావతారము, అంశావతారము, ఆవేశావతారము, యుగావతారము మొదలగు వివిధ భేదములతో నవతరించుచుండును. ఆతని కథాశ్రవణమునకు 'భాగవత సేవ' అందురు. ఆతని అనంతమగు నవతారములనుండి కొన్ని నామముల నత్యంత సంక్షేపముగ చరిత్రకు తోడుగా ముందు ముందు వర్ణింతము. ఈ గ్రంథములోని సమస్తచరిత్రలను భక్తులయొక్కయు, భగవదవతారములను గుఱించినవియు మాత్రమే యుండును. గాన యోగ్యమైనది భాగవతచరిత్ర. ఇఁక మిగిలిన వన్నియు వ్యర్థములే.

ఛప్పయ

జనకే చరిత పవిత్ర హృదయ కూఁ పావన కరతే।
సునకే శ్రద్ధా సహిత మనుజ భవసాగర తరతే॥

తదను రూప హై భక్త చరిత అతి హై సుఖదాఈ
ఆపనే సే భీ అధిక స్వయం హరి మహిమా గాఈ॥

భక్త కహాఁ భగవంత వా, భేద న, ఏక సరూప హై।
భక్తి భవన కే భూప హైఁ, దోనోఁ చరిత అనూప్ హైఁ॥

అర్థము

ఎవని చరిత్రము పవిత్ర హృదయమును పావనము కావించునో, దానిని శ్రద్ధాసహితముగ వినఁగానే మానవుఁడు భవ సాగరమును దాఁటును. తదనురూపముగనే భక్తచరిత్రము కూడ అత్యధికానందమును కలిగించును. దానిలో తన కంటె నధికమగు హరిమహిమయే కలదు.

భక్తుఁడనుము, భగవంతుఁడనుము. వీరిద్దరకును భేదము లేదు, ఒక్కటే స్వరూపము. వీరిద్దరు భక్తి భవనమున కధిపతులు. ఇద్దరి చరిత్రములు ఉపమా రహితములు.

# భాగవత ప్రక్రియ

శ్లో॥ శృణ్వతాం స్వకథాం కృష్ణః పుణ్యశ్రవణ కీర్తనః।
హృద్యన్తః స్థోహ్య భద్రాణి విధునోతి సుహృత్సతామ్॥
(శ్రీ భా. ౧ స్కం. ౨ అ. ౧౭ శ్లో.)

(సాధుజనులకు సుహృదుఁడును, పుణ్యశ్రవణ కీర్తనుఁడగు వాసుదేవ భగవానుఁడు తన కథలను విను భక్తుల హృదయములో విరాజిల్లుచు వానియొక్క సమస్త అశుభ వాసనలను నాశనము కావించును.)

ఛప్పయ

జినకో యశ గుణ నామ గాన హై సుఖకర అతిశయ।
కథా కీరతన కరహి కలుష కానని కూఁ మధుమయ॥

సాధుజనోం కే సుహృద్ సబని కే జో హైఁ స్వామీ।
అచ్యుత అజర అనాది అగుణ అజ అంతర్యామీ॥
కృష్ణకథా కే రసికవర, శ్రోతా తినకే హృదయ బసి।
అశుభ వాసనా మలినమతి, దేత తురత హైఁ నాథనసి॥

అర్థము.

ఎవని యశో, గుణనామగానము అతిశయ సుఖకరమైనదో, ఏ కథా కీర్తనముచేసిన కలుషకాననము మధుమయమగునో, సాధుజనములకు సుహృదుఁడును, సర్వస్వామియైనవాఁడును, అచ్యుతుఁడును, అజరుఁడును, అనాదియు, అగుణుఁడును, అజుఁడును, అంతర్యామియు నగు శ్రీకృష్ణుఁడే కృష్ణ

కథా రసికుఁడగు నా శ్రోత హృదయములో నివసించుచు వానియొక్క మలినమతిని నాశము కావించును.

ఔషధముయొక్క ప్రశంసను విని అది యేరోగమునకుఁ బనికివచ్చునో ఆ రోగి దానిని సేవింపఁ దలచినప్పుడు, వానికి దానిని సేవించు విధిని గూర్చియు, పథ్యాపథ్యములను గూర్చియుఁ దెలిసికొనవలె నను కోరిక పుట్టును. అస్త్రజ్ఞానమును గోరువాఁడు దాని ప్రయోగోప సంహారాదులనుగూర్చి కూడ తెలిసికొనఁ గోరును. యంత్ర, మంత్ర, తంత్రము లన్నియు ప్రక్రియ తెలియనిది నిష్ఫలము లగును, సూతుని ద్వారా భగవత్తత్త్వమును గూర్చిన యిట్టి ప్రశంసను వినఁగానే శౌనకాది మహామునులకు భాగవతీకథా ప్రక్రియను వినవలె నను కౌతూహలము కలిగెను. వారు సూతునితో "మహానుభావుఁడ వగు నో సూతా! నీవు భాగవతకథను గూర్చి మిక్కిలిగ బ్రశంసించితివి. సమస్తములగు నశుభములు, సమస్తదుఃఖములు భాగవత కథను ఆశ్రయించుట చేతనే నాశనమగు నని చెప్పియుంటివి. దయయుంచి భాగవత కథ నెట్లు శ్రవణము చేయవలయునో మాకుఁ జెప్పుఁడు. ఎక్కడ శ్రవణము చేయవలెను? ఏమి చేయుచుఁ జేయవలయును? ఎవరితోఁ గూడి చేయవలయును? ఈ యడిగిన విషయములను గూర్చియు, ఇంకను దీని కుపయోగకరము లగు నితర విషయములను గూర్చియు యథారీతిగ వర్ణింపవలెను. సూతా! నీ వాక్కులలో రస మున్నది. అందఱకును ఇంక జంజాటము లేవియును లేవు. కావున మా సుఖమున శ్రీకృష్ణ కథాశ్రవణము కావించిన మాకు మిక్కిలి సుఖము లభించు

చున్నది. మీరు మాకు సమస్త ప్రక్రియలను సరళముగ జెప్పవలెను” అనిరి.

ఋషు లిట్టి ప్రశ్నను వేయఁగా సూతుఁడు “మహాను భావులారా! మహర్షులారా! మీ రత్యంతోపయోగకరమగు ప్రశ్న నడిగితిరి. నేను మీకు భాగవత ప్రక్రియను గూర్చి చెప్పెదను. మీ రందఱును నాపైఁ గృపాదృష్టిని బఱపి శ్రవణము చేయుఁడు” అనెను.

“ఎవనికి భాగవతధర్మ జిజ్ఞాస కలిగినదో, వానికి ప్రప్రథమమున దానియందు రుచి కలుగుట అత్యంతా వశ్యకము; ఏలననఁగా రుచి లేక చేసిన కార్యములో రసము లభింపదు. నీరసకార్యము చాల దినములవఱ కుండఁజాలదు. కావున మునుముందుగా వాసుదేవ కథలందు రుచి కలుగ వలయును.

మానవుల స్వాభావికమగు రుచి విషయములమీఁద నుండునని మీరనవచ్చును. విషయ భోగముల కెవ్వఁడును శిక్షణ నీయఁడు. జనము నేర్చుకొనకయే జన్మజన్మాంతర సంస్కారముల కధీనులై వాని నొనర్చుచుందురు. ధర్మ, జప, ఉపవాస, సంధ్యావందనాదులను గూర్చి యింతగా శిక్షణ నిచ్చినప్పటికిని, ప్రశంస చేసినప్పటికిని వానిమీఁద రుచి కలుగదు. రుచి కలుగనిది కార్యమే జరుగదని మీ రనిన నింక భగవత్కథలందు రుచి కలుగుటెట్లు?

మానవున కారంభములో నే విషయము మీఁదను రుచి కలుగ దనునది నిజమే; కాని నిరంతరము దానినే చేయు

టచే దానియందు స్వతః రుచి యుత్పన్నమగును. బాల్యకాల మున పిల్లలకు తల్లిపాలను వదలి అన్నమందు రుచి కలుగదు; కాని తల్లి వానికి మెల్లమెల్లగా నిత్యము కొంచెము కొంచె ముగ నన్నసేవనము చేయించుచుండును. అన్నము స్వాదు మయముగ నుండును. నిత్యసేవనముచే దానిలో రుచిపుట్టును. తర్వాత నది యింతగా నభ్యాసమగును. అతఁడు జీవితములో అన్నములేక నిలువఁజాలనంతగా నేకాకారుఁడగును.

అట్లే ప్రప్రథమమున జిజ్ఞాసువులు కథాకీర్తనమే ఆహారముగఁ గలిగి కథాకీర్తనములేక నిలువఁజాలని సాధు సంతమహాపురుషుల సేవ చేయవలయును. సజ్జను లనుటకు స్థూలమగు గుర్తు ఏమి యనఁగా వారెక్కడ సమావేశమై కూర్చుండినను, ఏమి మాటలాడినను సాంసారిక విషయముల నెత్తరు. వారు భగవచ్చర్చ చేయుదురు. భగవచ్చర్చ అను కూల పుణ్యప్రదేశములో వేయిరెట్లు ఫలము కలదగును. సమస్త వస్తువులమీఁదను దేశప్రభావము మిక్కిలిగ పడు చుండును. ఏ ప్రదేశములో నెట్టి యాలోచన కలవార లెక్కు వగ నివసించుచుందురో ఆ ప్రదేశముయొక్క వాయుమండల మట్లే యగును. తీర్థములలో అనాదికాలమునుండియు ప్రజ లకు పవిత్ర భావన లున్నవి. ఇప్పటికైనను తీర్థయాత్రా నిమిత్తమై వచ్చువారిలోఁ జాలమంది శుద్ధ ధార్మిక భావన తోడనే వచ్చుచుందురు. జగత్పావనముచేయు పావనతమ స్రవంతులగు గంగాదులందు ప్రజల కత్యంత భక్తిభావన కలదు. కావున నిరంతర పవిత్ర తీర్థసేవనముచేఁ గూడ భగవ త్కథలందు రుచి వృద్ధియగును.

"మునుముందుగా నెవఁడైన పుణ్యాపవిత్రతీర్థ మందు కృష్ణకథాలోలుపులగు సంతమహాపురుషుల సమీపమునుండి వారిని శ్రద్ధాపూర్వకముగ సేవాసత్కారములచేఁ బ్రసన్నులఁ గావించి వారితోఁ గూడి శ్రీకృష్ణకథాశ్రవణము చేయవలయును. భగవత్కథ లందు రుచి కలుగకపోవుట పూర్వజన్మ పాపఫలమే. కావున మనస్సు లగ్నము కాకపోయినను సాధుపుల మధ్య కూర్చుండి మనస్సు అక్కడ లగ్నము కాకున్నను, తెలియకపోయినను శ్రవణము చేయవలయును. ఇట్లు చేయుటచే మెల్లమెల్లగా కథమీఁద రుచి పెరుగును. విషయము కూడ మనస్సునకు వచ్చుచుండును.

"కథను నియమముతో వినవలయును. దానిలో నెన్నడును ప్రమాదపడరాదు, తప్పు చేయరాదు. స్వయముగఁ జదువుటకంటెఁ గథాశ్రవణము చేయుటలో నెక్కువలాభము కలదు. ఒంటరిగా వినుటకంటె చాలమందితోఁ గూడుకొని వినుట అంతకంటె నింక నెక్కుడు ప్రయోజనముకరము. సాధారణులతో కంటె మహాపురుషుల సమీపమునఁ గూర్చుండి వినుటవలన ననంత మగుఫలము కలుగును. మహాపురుషుల శరీరమునుండి యొకవిధమగు దీప్తి వెలువడుచుండును దానివలన స్వతః మనస్సు వశపడును. వారి కథలలో స్వాభావిక మగు రుచికలుగును. వారి సుచిప్రభావము సమీపమునఁ గూర్చుండిన శ్రోతలమీఁదకూడ పడును. ఎవరైన దుఃఖములోఁ బడియేడ్చుచుండఁ జూచువారల కండ్లకుకూడ నీరు కారి నట్లును, ఎవరైన నిమ్మపండు తినుచుండిన ఆపులుపు వలన దగ్గఱనున్నవారి నోటఁగూడ నీ రూరినట్లును, వివస్త్ర

యగు స్త్రీని గాంచిన నిర్వికారులకుఁ గూడ మనస్సులో వికార ముదయించినట్లును, నవ్వుచున్న పిల్లవానిని జూచినను ఆనందముఖముతో నున్న వ్యక్తిముఖమును జూచినను మనకు గూడ ఆనందము కలుగునట్లును, విశాలనేత్రములను గాంచి మనకుఁగూడ కన్నులు స్వతః సుఖానుభవమును బొందినట్లుగ ఎవరికైన కన్ను లెఱ్ఱఁబడి కన్నుల నీరుకారుచుండిన, దవ కూడ కన్నులు గ్రుచ్చుకొన్నట్లుండి, యెఱ్ఱపడి, కన్నుల నీ కారునట్లును, ఎక్కడనైన వీరత్వమును జూచుచుండినన వీరత్వమునకు సంబంధించిన వక్తృత్వమును వినుచున్న పిఱికివాండ్ర హృదయములోఁ గూడ ఉత్సాహ ముబికినట్లుగ అత్యంత మసహ్యముగ నుండిన బీభత్సదుర్మేధ్య పదార్థముని జూడఁగనే ప్రాణము కొట్టుకొని క్రక్కుఁగూడ వచ్చునట్ల మహాపురుషుల దగ్గఱఁ గూర్చుండి కథాశ్రవణము చేయుట సాధకుల కత్యంతలాభము కలుగును. ఏల ననఁగా నెవ హృదయములో భగవద్భక్తి కలదో వాని శరీరములోని సమస్తసద్గుణాలులు వచ్చి నివసించును. కావున కలా ణేచ్ఛుకులైనవారు మునుముందుగా పుణ్యతీర్థములలో నుం మహాపురుషుల సత్సంగములోఁ గూర్చుండి వాసుదేవ భగ వానుని కథలను వినవలయును.

కథాకీర్తనములో రుచి పెరిగినకొలఁది కలుషిత మగ హృదయ కుహరము స్వచ్ఛమగును. ఏదైన నాశ్రమము మురికి చేరియుండిన దానిని ప్రతిదినమును చిమ్ముటచేతను బూజు దులుపుటచేతను, కలయంపిచల్లి మెత్తి అలుకుట చేతను నది స్వచ్ఛ మగుచుండును. అదేవిధముగా దుర్వాస

లచే మలినమైన మనస్సులోనికి కర్మములద్వారా భగవన్నామము చేరుసప్పటికి శుద్ధ మగుచుండును. అంత భగవంతుఁడు అక్కడ హృదయ కుహరములో పీఠము వేసికొని కూర్చుండును. తదుపరి భగవంతుఁ డచ్చట తన యధికారమును సాగించును. ఇంక నిప్పటివఱకు అచ్చట తిష్ఠ వేసికొని యుండిన కామ, క్రోధ, లోభ, మోహాది దస్యులు నెత్తిన గుడ్డ వేసికొని పాఱిపోవలసిన దే. ఇంతవఱకు వాటిని పరివార రూపముగనున్న చెడ్డవాసన లన్నియు తరలుటకు బయలు దేరును. ఇఁక నెన్నటికిని మరల రాకుండునట్లు దుష్టవినాశకుఁడగు ప్రభువు తన సుదర్శన చక్రమును గైకొని వాటినన్నిటిని వినాశము కావించును అప్పు డాయంతఃకరణము నిష్కంటకమై విశుద్ధ మగును.

"ఇంతవఱకు జీవుఁ డా కామక్రోధాదులనే తనవిగాఁ దలఁచెను. వాటినే ప్రేమించుచుండెను. అవన్నియుఁ జచ్చిపోయెను. ఇప్పుడు ప్రేమించిన దెవరిని? ప్రేమింపలేక మానవుఁ డుండ లేఁడు. పూర్వపుప్రేమి నాశముకాఁగా, స్వచ్ఛమగు నింటిలో పరమ మనోహరుఁ డగు మదనమోహనుఁడు వచ్చి కూర్చుండి నప్పుడు ఆతని యెడల ప్రేమ యుత్పన్నమగును. పొలములో దున్నక గడ్డిగాదము పెరిగినట్టు పెరిగి కంటకవృక్షములు, ఇంక నితర అనావశ్యకములగు వృక్షములు పెరిగినపుడు ఆ యనావశ్యకము లగు కంటకవృక్షములను నఱికి నట్టు విఱిచి, దున్ని, పదునుచేసి, యెఱువు వేసి, నీరుపెట్టి బాగుచేసినప్పుడు దానిలో బీజమును వేసిన దానినుండి యుత్తమాంకురము ఉత్పన్నమగును. ఆ అంకురమునకు

స్నేహసలిలమును జల్లుచు దాని సమీపముగఁ బుట్టిన కలుపు మొక్కలను బీకివేసి దానికి నిత్యసేవ చేయుచుండు నెడల దానియందు సుమధుర, సుస్వాదుమై హృదయమునకు సుఖ మొసంగు ఫలము లుత్పన్నమగును. వాటిని దినుటచే తుష్టి, పుష్టి, క్షుధానివృత్తి మూఁడును ఒక్కసారిగా నగును. ఈ యంతఃకరణమే క్షేత్రము. పాపపుణ్యములే బీజములు. సత్సంగమునకు దూరముగ నుండుటయే యా క్షేత్రము నుపేక్షించుట. సత్సంగము చేయకున్న యెడల అనేక జన్మముల లోని పాపమూలము లోకచో తమకుఁ దామే గుమికూడును. సత్సంగమను కుఠారమును దీసి దానిని స్వచ్ఛము కావింప నిది, సాధుసేవ రూపమగు శ్రమకావించి దానినిదున్ని ఎఱువు వేయవలెను. భగవత్కథారూప మగు అమృతరసమును దానిపైఁ జల్లవలయును. భగవద్భక్తి రూపమగు బీజమును దానిలో నాటవలయును. అప్పుడు ప్రేమరూప మగు ఫలము దానిలో నుత్పన్నమగును. ప్రేమఫల మెంతటి మధురమో, ఎంతటి రుచియో, ఎంతటి హృద్యమో, దానిని సేవించుటచేఁ జిత్తమెంతటి నిర్మలత, ప్రసన్నత కలుగునో అది చెప్పవలసినది కాదు; అనుభవింపఁదగినది.

హృదయములో భగవత్సాక్షాత్కారము కలుగఁగానే సమస్త శోకమోహములు దూరమైపోవును. హృదయములో కోణకోణములందుఁగల గ్రంథులన్నియు వాటికవియేవిచ్చును. సమస్త సంశయములు ఛిన్నభిన్నములగును. పాపపుణ్యాది కర్మలన్నియు వాటికవియే భస్మీభూతము లగును. ఆ వాసుదేవుఁడు హృదయములోనికి రాఁగానే ఒక్కసారిగాఁ బరివర్తనము

చెందును. వెనుకటి విషయము లన్నియు మారిపోవును. ఘోరాంధకారము నాశ మగును. పుణ్యప్రకాశము దిశ దిశ లందు వ్యాపించును. ముకుళితములైన కమలము లన్నియు వికసించును. రుద్ధమైన అమృతస్రోత తీవ్రగతితో మరల ప్రవహించును. మానససరోవరము క్షీరసాగర రూపమును ధరించును. జీవరూపమగు నీహంస దానిలో విహరించుచుం డును. ఆ యమృతసాగరములో నవగాహనము కావించి సుఖియుఁ బ్రసన్నుఁడు నగును. ఏ బంధనమును లేదు; ఏ పరిధియు లేదు; ఏ దుఃఖము లేదు; ఏ చింతయు లేదు; ఇంక ప్రాప్యవస్తు వేదియును లేదు. అమృతవర్షము, అమృతపుజల్లు, అమృతస్నానము, అమృతపానము, అమృతచింతనము, అమృత బాహ్యాంతరములై అమృతానందమయుఁ డగును. ఇది యంతయు భగవత్సేవనముచేఁ గలుగును. కావున నో ఋషులారా! సదా సర్వథా మీరు భాగవత సేవనము కావింపవలయును.

ఛప్పయ

సేవనీయ జో సదా సులభ సుఖదాయీ సబకీ।
మాఖన చోర చరిత్ర మధుర అతిహీ కానన కీ॥

శ్రోతమార్గసే ప్రవిసీ హృదయమేఁ జబ్ ఆ జావేఁ।
కరే జ్ఞాన పరకాశ తురత అజ్ఞాన నసావే॥

జ్ఞానసూర్యకే ఉదయతే మోహామలినతా దూర హో।
సబ్ సంశయ దినమేఁ నసేఁ, హృదయప్రేమ పరిపూర్ హో॥

అ ర్థ ము

అందఱికిని సులభుఁడును, సుఖప్రదాతయు నగు వాఁడు సేవనీయుఁడు. నవనీత-చోరుని చరిత్ర కర్ణముల కతి మధుర మైనది. అది శ్రోత్రమార్గమునఁ బ్రవేశించి హృదయ మున కెప్పుడు వచ్చునో అప్పుడు జ్ఞానప్రకాశము కలిగి అజ్ఞాన మును నాశము చేయును.

జ్ఞాన సూర్యుఁ డుదయించఁగానే మోహమలినము దూరమై పోవును. సంశయము లన్నియు ఆ వెంటనే నశించి హృదయము ప్రేమపరిపూర్ణ మగును.

# శ్రవణపరంపర

శ్లో॥ ఇదం భాగవతం నామ
పురాణం బ్రహ్మ సమ్మితమ్।
ఉత్తమ శ్లోక చరితం
చకార భగవాన్ ఋషిః॥

(శ్రీమద్భాగవతము ౧ స్కం. 3 అ. ४० శ్లో.)

ఛప్పయ

పుణ్య పురాణ మహాన్ వ్యాస భగవాన్ బనాఈ
పరమహంస శుకదేవ పుత్రకో పూర్ణ పఢాఈ॥
గంగాతటపర్ నృపతి పరీక్షిత శాపిత హోకర్।
ముక్తిద్వారకో మార్గ మునిని తేం పూఛే రోకర్॥
కహీ కథా శుక నే వహీ, పాపరాశి పలమేం దహీ।
శ్రద్ధా సే సుని సూత నే, శౌనకాది సే పుని కహీ॥

అర్థము

పుణ్యము నొసంగు గొప్ప పురాణములను వ్యాస భగవానుఁడు రచించెను. వాటిని తన పుత్రుఁడైన శుకదేవ పరమహంసకుఁ బూర్ణముగఁ జెప్పెను. పరీక్షిన్మహారాజు శృంగి మహర్షి వలన శాపమును బొంది గంగాతటమున శుక మహామునిని యేడ్చుచు ముక్తిద్వార మార్గము నడిగెను.

అప్పుడు శుకుఁడా కథనే చెప్పెను. అది పాపరాశిని ఒక క్షణములో దహించినది. అప్పుడు సూతుఁడు దానిని శ్రద్ధతో వినెను. మరల నాకథను శౌనకాది మహామునులకు జెప్పెను.

పరంపరాగత మగు గుణముగాని, అవగుణముగాని ఏకారణవశముచే నైనను నేవిధ మైన సంకరతయు కలుగకున్న యెడల సాధారణముగ రాఁబోవు సంతతి కబ్బుచుండును. అందుకనియే ఆర్యసంస్కృతి యందు కుల గోత్రముల నడుగు ఆచారము ప్రాచీనకాలము నుండియుఁ బరిపాటి యైనది. ఏ జ్ఞానము, ఏ వంశము కులీనముగ నుండునో అది వర్ణాశ్రమ ధర్మమం దాదరణీయముగ నుండును. అజ్ఞాత కులశీలము, పరంపరాహీనమైన జ్ఞానము సాధారణముగ నుపేక్షణీయ మైనది. ఈవిషయములోఁ గొన్ని అపవాదములు కూడ లేక పోలేదు కాని సాధారణ నియమ మిట్టిది.

సూతుఁడు సంక్షేపముగ శ్రీకృష్ణుని కళా, అంశ, పరి పూర్ణ అవతారములను గూర్చి దిగ్దర్శనముగఁ జెప్పెను. ఈ జ్ఞానమును ప్రామాణికముగ జెప్పుటకును, సముపస్థిత శ్రోతల యుత్సాహము నినుమడింపజేయుటకును సూతుఁడు తన జ్ఞాన పరంపరను జెప్పుచున్నాఁడు.

విజ్ఞుఁడగువాఁడు అనధికారుల సమ్ముఖమున మహాత్వ పూర్ణమగు కథ నేమియుఁ జెప్పకుండుట పురాతననియమము. ఏల ననఁగా నూషరక్షేత్రమున బీజములు నాటుట వ్యర్థమే కాదు, సమయమును, శక్తిని దురుపయోగము కూడ కావించుటయే యగునని వారికి బాగుగాఁ దెలియును. కావున శ్రవణ సంబంధములో మొట్టమొదటి నియమ మేమనఁగా అనధికారి సమ్ముఖమున జ్ఞానమును ప్రకటింపకుండుట. రెండవది అడుగనిది చెప్పకుండుట. అడుగనిది చెప్పినచో నా విషయ

ములోని మహత్త్వము పోవును. మూఁడవ నియమము, యెంతవఱకు యోగ్యత కలదో అంత జ్ఞానమునే ప్రకటించుట. అంతకంటె నెక్కువగఁ బ్రకటించినచో నాతఁడు దానిని బూర్ణముగఁ గ్రహింపఁజాలఁడు. ఒకవేళ నధికారి యైనవానికి యోగ్యతకు తక్కువగ జ్ఞానము నుపదేశించినచో వానికి సంతోషము కలుగదు, కావున నధికారి యోగ్యతా పరీక్షకొఱకు మొట్టమొదట నేదైన విషయమును సూత్ర రూపముగఁ జెప్పుచుండును. దానిని వినఁగానే శ్రోతలకు జిజ్ఞాస పెరిగినయెడలను, ఆ విషయమును బూర్తిగ వినవలెనను ఉత్సాహమును బ్రకటించినను తర్వాత కథను జెప్పవలయును. లేకున్నయెడల నంతవఱకే చెప్పి సమాప్తము కావింపవలయును. ఇట్టి యాచారము ప్రాచీన గ్రంథములలో లభించుచున్నది. అందువలననే మొట్టమొదట సూతుఁడత్యంత సంక్షేపముగ నవతారముల నుల్లేఖించియుండెను. అవతార కథయొక్క పేరే భాగవతకథ. ఈ యవతారములన్నియు శ్రీకృష్ణునినుండి వచ్చినవే. ఈ యవతారము లన్నిటిలో నేకమాత్రావతారము నందనందనుఁడగు వాసుదేవ శ్రీకృష్ణుఁడే. కావున నవతారకథ శ్రీకృష్ణకథయే. కృష్ణకథ యనిన కేవలము మధురా బృందావన కథయని కాని, ద్వారకా కథయని కాని తలఁపరాదు. ఎన్ని అవతారములు గలవో అన్ని అవతారకథలు శ్రీకృష్ణ కథలోనే సమావేశమగును.

సమస్త ఋషిగణము మిక్కిలి శ్రద్ధతో సూతుని నోటినుండి వెలువడు కథామృతమును దత్తచిత్తులై పానము

చేయుచుండిరి. వారి యుత్సాహము పెరుగుచుండెను. శరీర మంతటను సాత్త్వికభావము లన్నియు నుదయించుచుండెను. వారి యీ స్థితిని గాంచి సూతుని హృదయ ముప్పొంగిపోయెను. అతఁ డా మహాభాగులను ప్రశంసించుచు 'ఋషులారా! మీ భాగ్యము నెవరు ప్రశంసింపఁగలరు? అందు కనియే మిమ్ములను నేను మాటిమాటికి మహాభాగులని సంబోధించుచున్నాను. నేను పృథివిలో విషయాసక్తులను జూచితిని. వారికి విషయములలో సమస్త ప్రపంచమును మఱచునంతటి యేకాగ్రత కలదు. నూతనవధువు వచ్చినపుడు ఆమెయొక్క యువకపతి యెట్లు సమస్తవిషయములను మఱచిపోయి అట్లు దానినే చింతించుచుండునో అట్టి దృశ్యమే నేనిచ్చట గాంచి యత్యంత ప్రసన్నుఁడనైతిని. మీకు కృష్ణకథ వలన నింకను తృప్తి కలుగలేదని నేను బాగుగాఁ దెలిసికొనియున్నాను. నేను వర్ణించుకొలఁదియు మీ యుత్సాహము పెరుగుచున్నది. ప్రథమమున మీరందఱు ఉత్తమాధికారులు. కులపరివారములతో, బంధుమిత్రాదులతో వేయేల నందఱితోడను సంబంధవిచ్ఛేదము కావించుకొని యిచ్చట భగవచ్చింతనము నిమిత్తము కూర్చుండియున్నారు. రెండవది, ఈ క్షేత్రము పరమపవిత్రమైనది. ఆ పవిత్రతా కారణముననే యిచ్చట చిత్తము స్వతఃగా నేకాగ్రమగును. మూఁడవది ఈ కృష్ణకథ యెటువంటివానినైనను వినఁగ వినఁగ ముగ్ధునిఁగ జేయునంతటి సరస మనోజ్ఞమైనదియు, స్వతః తనవైపున కాకర్షించునదియునై యున్నది. ఒక్కసారి వాసుదేవభగవానుని కథాస్వాదనమును కావించెనా మరల నాతఁడు కుత్సిత

కథల నేల వినును? ఈ కథలను వినఁగా వినఁగా నీ సంసారము విలీన మగును. చిత్తమా చిత్తచోరుని చరణారవిందములందు హత్తుకొనిపోవును. ఇంక నాతఁడు సాంసారిక విషయ చింతన మెట్లు చేయగలఁడు? ఈ భాగవత కథకు మానవుఁడు దూరముగ నున్నంతవఱకే వానికి బంధనము. ఒక్కసారి దీనిలో నిమగ్న మయ్యెనా... ...తన పతినిగాంచి సిగ్గుచెందు పిల్ల దాగుకొన్నట్లు మాయ లజ్జచే దాగుకొనును.

ప్రపంచములోని సమస్త జీవులు ఈ ప్రపంచములో తమ తమ పాపపుణ్య కర్మానుసారముగా సుఖదుఃఖములను భోగించుచుందురు. ప్రపంచములోఁ జాలమంది పూర్వ జన్మ పాపములచే నిర్ధనులై, దుఃఖవంతులై, నానా వ్యాధి గ్రస్తులై, భయాతి భయంకరములగు రాజరోగములచేఁ బీడింపఁబడుచున్నారు. చాలమంది సుకృతు లగు పుణ్యాత్ములు వారి పీడనుగాంచి దుఃఖితులై దయావశమున వారికి అన్న వస్త్రముల నేర్పాటు చేయుదురు. ఔషధోపచారముల నేర్పాటు చేయుచుందురు. ఈ కార్యములలో వారికి శారీరక స్వార్థమేమియు నుండదు; కేవలము కృపావశమున దయచే ద్రవీభూతులై దుఃఖులయొక్క దుఃఖమును పారద్రోలుటకు స్వయముగఁ దాము కష్టపడి వారిని సుఖవంతుల నొనర్తురు.

జనన మరణ చక్రమునందు పడిన జీవులనుగాంచి వేద వ్యాస భగవానునియొక్క నవనీత సమానమగు హృదయము ద్రవీభూతమై పోయెను. అతఁ డిట్లు తలఁచెను. "ఈ జీవు లెట్లుద్ధరింపఁ బడెదరు! వీరు విషయ భోగచింతచేఁ దదా

కారులైరి. సమస్తేంద్రియములకు విషయములు జడములే. ఈ జీవులిదేవిధముగా జడచింతనములో నిమగ్నులైయున్న యెడలఁ జివరకు వీరు పశు, పక్షి, కీట, పతంగ, లతా, వృక్షాది జడ యోనులలోనికి వెళ్ళవలసివచ్చును. అప్పుడు వీరి నుద్ధరించుట కే యుపాయమును లభింపదు. ఏలననఁగా జడజంతువులకు స్వయముగ సాధనచేయు సామర్థ్య ముండదు. సాధక జన్మ మీ మానవజన్మమే. సమస్త సాధనలు ఈ మానవ శరీరము వలననే చేయవలెను. కావున నాతఁడు జీవులపైఁ గరుణించి భక్తిభవనద్వారమార్గమును జెప్పునట్టియు దానిలో సరళతాపూర్వకముగఁ బ్రవేశింపఁజేయునట్టియు నగు నీ యను పమ భాగవతశాస్త్ర రచనమును గావించెను. దీనిలో సమస్త శాస్త్రసారమును నింపివేసెను. అందువలన నిది సమస్తశాస్త్రములకు మించిపోయినది.

ఇది సమస్త శాస్త్రములనుండి బయలుదేరినపుడును, దీనిలోని సమస్త చరిత్రము, సంపూర్ణజ్ఞానము, శాస్త్రముల నుండి గ్రహింపఁ బడినప్పుడు ఇది అన్నిటికంటె గొప్పదని యెట్లనవచ్చునని మీ రడుగవచ్చును. దీనిని మీరు శ్రద్ధతోఁ దెలిసికొనుఁడు. చెఱకు శ్రేష్ఠమా? పటికబెల్లము శ్రేష్ఠమా? అని నేనడుగుచున్నాను. చెఱకు కంటె కలకండ మంచిదని మీరు సమాధాన మిచ్చెదరు. మీ రాలోచించుఁడు—కలకండ చెఱకుకంటె నేల శ్రేష్ఠమైనది? చెఱకు నుండి రాని పదార్థము కలకండలో నొక్కటియు లేదే. చెఱకురససారము వలననే గదా యీ కలకండను తయారు చేసినది. కేవలము యుక్తి కౌశలముచే దానిలోనుండి పరమోపయోగకరము లగు

తత్త్వములు తీయఁబడినవి. ఆ చెఱకులో వ్యర్థమగు వస్తు వొక్కటియు లేదు. కొంచమో గొప్పయో అన్నియు నుపయోగకరములే. దానిలోని ప్రతిఅంశము ఏదియో జీవికి పనికివచ్చును, కాని మనమో, మధురతను ఉపాసించువారలము. చెఱకుపిప్పి కావలసినవారు దానిని గ్రహింతురు గాక! ఎవరికి బెల్లము పానకము, రసము, చక్కెర కావలయునో వారు దానిని గ్రహింపనిండు. మనకు కలకండ కావలయును. ఇట్లే గడ్డిపోచ లన్నిటిలోను పాలుగలవు. కాని గడ్డివలన మనకు పాలు లభింపవు. ఈపని ఆవువలననే కావలెను. గడ్డిని దిని అది పాలనిచ్చును. అనంతశాస్త్రములలో నిండిన మధురిమను పక్వము కావించి వ్యాసభగవానుఁ డను కామధేనువు అందఱకు జీవనదానము చేయు మధుమయక్షీరముల నొసఁగ సమర్థుఁడు.

సమస్త జలముల కోశము సముద్రములోనే కలదు. బావులలోనికి, చెఱువులలోనికి, నదీనదములలోనికి తీపినీరు సముద్రమునుండియే వచ్చుచున్నది. సముద్రము లన్నియు నింకిపోవునెడల నీ జలస్రోతలన్నియు జలరహితము లగును. అందఱకు జలదాత సముద్రుఁడే; కాని మనము స్వయముగ సముద్రము దగ్గఱకు పోవునెడల మన దాహము తీరకపోగా నింకను బెరుగును. యుక్తిలేక దానిదగ్గఱనుండి మనము నిరాశులమై తిరిగి రావలసినదే. ఆ జలమే మేఘమై వర్షించునెడల నది త్రాగఁ దగిన మధురమగును. చరాచర ప్రాణు లన్నియు దానిని త్రాగి ప్రసన్నులై జీవనధారణ చేయుదురు.

పాలవలననే నవనీతమగును. కాని పాలకంటె నధిక స్వాదిష్టము, పౌష్టికము, బలవర్ధకము నగు నవనీతము ఘృత మగును. స్వర్గములోని యప్సరసల సమస్త కామములను బూర్తి కావించు పారిజాతము, జరామరణములను దూరము కావించు అమృతము, సమస్త లోకములకు దీప్తి నొసంగు విష్ణుప్రియయగు లక్ష్మి ఇవన్నియు క్షీరసాగరములోనే కలవు. ప్రబల పరాక్రమశాలురగు దైత్యులును, సమస్త గుణనిధాను లగు దేవతలును వీటినిఁ రాఁబట్టఁజాలక పోయిరి. శ్రీహరి సముద్రమథనము ద్వారా యా యమృతమును బ్రకటించి నపుడు సమస్త శోక, మోహ, జరా, మృత్యువులను హరించు పదార్థ ముత్పన్న మయ్యెను. శ్రీహరికాక సముద్రమథనము కావించి యా సారవస్తువు నెవరు బయటకుఁ దీయఁగలరు?

ఇట్లే శాస్త్రరూపమగు సముద్రమును శ్రీమన్నారా యణునియొక్క కల్ప అంశావతారమగు వ్యాసభగవానుఁడు మథించి యీ భాగవత మను అమృతమును బ్రకటించెను. ఈ దివ్యామృతము ప్రకటమైనప్పుడు దీని నెవరికి చెప్పుదుమా యని యాతనికి చింత కలిగెను. అనధికారికి చెప్పుట వ్యర్థము. ఆతనికి చాలమంది శిష్యులు గలరు. అందఱును 'మాకుఁ జెప్పుఁడు, మాకుఁ జెప్పుఁడు' అని బ్రతిమలాడిరి. కాని సత్య వతీ నందనుఁడగు వ్యాసభగవానుఁడు ఎవరి ప్రార్థనను అంగీక రింపలేదు. అందఱకును సరళతాపూర్వకముగ 'నాయనా! నీవు దీని కధికారివి కాదు' అని చెప్పెను.

ఇంతలోనే యాతని పుత్రుఁడు శుకదేవుఁడు ప్రత్యక్షమయ్యెను, ఈతనిని ఉత్తమాధికారిగా భావించి వ్యాసభగవానుఁడు ఈ కృష్ణకథను చెప్పెను. నిజానందమగ్నుఁడగు పరమహంస చక్రచూడామణి యగు శుకమహర్షి ఈ సారాతిసార రహస్యశాస్త్రమును గంగాతీరమున దుఃఖముతోఁ గూర్చుండిన పరీక్షిన్మహారాజునకు ఏడుదినములలోఁ జెప్పి వినిపించెను.

బ్రాహ్మణ శాపముచే శపితుఁడై అన్నపానీయములను బరిత్యాగము కావించి పరీక్షిన్మహారాజు శ్రీ శుకమహర్షి వలన సారాతిసారశాస్త్రమును శ్రద్ధా సంయమములతో వినెను. అక్కడా చక్రవర్తి ఒంటరిగా లేడు. ఆతనికి సానుభూతిని ప్రకటించుటకు సమస్త దిశలనుండి ఋషులు మునులు వేంచేసిరి. వారా ధర్మాత్ముఁడగు రాజునకు నలువైపులను గూర్చుండిరి.

అక్కడే యీ గ్రంథము ప్రకటమయ్యెను. ఈ గ్రంథమేమి సాక్షాచ్ఛ్రీకృష్ణుఁడె ఈ రూపమున మరలఁ బ్రకటమైనట్లుండెను. సమస్త జగత్స్వామి యగు శ్రీహరి యీ ధరాధామమును వదలి స్వధామమునకు వేంచేసినపుడు ఆయనతోఁ గూడ దయా, ధర్మ, జ్ఞాన, సత్య, శౌచాది గుణములుకూడ వెళ్ళిపోయెను. ఋషి, మహర్షు లందఱును చాల దుఃఖమును జెందిరి. అందఱకు అజ్ఞానాంధకారము వచ్చి ఆవరించివేసెను. శ్రేయ, ప్రేయ వివేకము నశించిపోయెను. మంచి చెడ్డ లేమియుఁ గనఁబడుట లేదు. ఆ సమయమున నీ భాగవత మను

జ్ఞానసూర్యు డుదయించెను. ఇది ప్రకటము కాఁగానే సమస్త వస్తువులును యథారీతిగఁ గనఁబడ మొదలిడెను. సత్యాసత్య, సారాసార వివేకము కలిగెను. ఈ గ్రంథము అందఱి కన్నులలో వ్యాపించిన అంధకారమును బోఁగొట్టెను. అందఱును గర్తవ్యా కర్తవ్య నిర్ణయ సమర్థులైరి.

సంయోగవశమున భగవత్కృపవలన నా మహాసమాజములో నేనుకూడ యుంటిని. మనస్సుంచి సమస్త చిత్త వృత్తులను నిరోధించి నేనుగూడ యీ శాస్త్రమును శ్రద్ధాసహితముగ శ్రీశుకుని ముఖమున వింటిని. దీనిని విని యథావిధిగ ధారణ చేయఁగల సామర్థ్యము నా కెక్కడిది? కాని యీ కృపాళుఁడగు ప్రభువు నన్నధికారిగా భావించి యిట్టి శక్తిని ప్రసాదించెను. ఆతని కృపవలననే నేను దీనిని ధారణ చేయ సమర్థుఁడనైతిని.

ఓ ఋషులారా! నేనా కమనీయ కృష్ణకథను, ఆ మందనీయ భాగవత శాస్త్రమును మీ యందఱ సమ్ముఖమున నివేదించెదను. పరమహంస శిరోమణియగు శుకమహర్షి యే ప్రేమచే, ఎట్టి చక్కని స్వరములతో, నెట్టి గంభీరతతో, ఓజస్సుతో, సమస్త ఋషులతోఁ గూడిన పరీక్షిన్మహారాజునకు వినిపించెనో మీకు నేనట్లు చెప్పఁగలనని మీరను కొనవచ్చును. అది సాధ్యముకాదు. శుకుఁడు శుకుఁడే. నేను నేనే. కపోత మెన్నఁడైన గరుడునితోఁ బోలునా? కాకి రాజహంస నడకతో నెట్లు నడువఁగలదు! కాకి కోయిలవలె నెట్లు పలుకఁ గలుగును? నా బుద్ధికొలఁది నేను విని ధారణచేసినది

మీకు నేర్పుదమను నుద్దేశ్యమున కాదు కాని నా వాక్కును సార్థకము కావించుకొనుటకు మీకు చెప్పుచున్నాను. మీ రందఱును సావధానులరై సమాహిత చిత్తముతో శ్రవణము చేయవలయును.

ఛప్పయ

శ్రీనారాయణ బీజ అమల అంకుర చతురానన।
శ్రీనారద తనుతనా వ్యాసశాఖా అతి శోభన॥
శ్రీశుక పావన పుష్ప గంధ హై సరస సుబానీ।
కృష్ణ కథా ఫల మధుర భోకతా ముని విజ్ఞానీ॥
నృపతి పరీక్షిత శౌన కహు, సేవేఁ ఋషి ముని సహిత హైఁ।
వృతుభాగవత భవ్య అతి, సబసుఖ జామేఁ నిహిత హైఁ॥

అర్థము

భాగవత మహావృక్షము అతి భవ్యమైనది. సమస్త సుఖములు దానిలో నిమిడియున్నవి. ఈ వృక్షమునకు అమల బీజము శ్రీమన్నారాయణుఁడు. బ్రహ్మదేవుఁడు అంకురము. నారదమహర్షి బోదె. వ్యాసు డతి శోభన మగు శాఖ. శ్రీ శుకుఁడు పావన పుష్పము. అతని సరసవాక్కు పుష్ప గంధము. కృష్ణకథ ఫలము. దానిలోని మధురమును భుజించు వారు విజ్ఞానులగు మునులు. ఆ మహావృక్షమును పరీక్షిన్మహా రాజు, శౌనకాది మహర్షి మునులతో కూడి సేవించిరి.

# విరాట్పురుషుఁడు

శ్లో॥ స వేద ధాతుః పదవీం పరస్య
దురంత వీర్యస్య రథాంగపాణేః ।
యోఽమాయయా సంతత యానువృత్త్యా
భజేత తత్పాద సరోజ గంధమ్॥ *

(శ్రీ భా. ౧ స్కం. 3 అ. 3౮ శ్లో.)

ఛప్పయ

హైఁ అనంత భగవంత అసంత న ఉనకో జానేఁ ।
ప్రాణీ ప్రేమ విహీన కహాఁ కైసే పహిచానే ॥
పావన ఉనకా చరిత అమిత మధుమయ సుఖదాఈ ।
లీలా లలిత లలామ లఖేఁ జిన దేహీఁ లఖాఈ ॥
ఛాండి కపట ఛల ప్రేమసే, కరహి సమర్పణ కర్మ సబ్ ।
నామ రూప గుణ ధామకో, సముఝి సకేఁ సతసార్ తబ్ ॥

అర్థము

అనంతుఁడగు భగవంతుఁ డొక డున్నాఁడు. అసాధువులైనవా రాతనిని దెలిసికొనఁజాలరు. ఆతనిని ప్రేమవిహీనులగువా రెట్లు గుర్తింపఁగలరో చెప్పుమా! ఆతని చరిత్రము

---

* దురంత వీర్యుఁడును, రథాంగపాణియు, భగవంతుఁడును, పరాత్పరుఁడును, విధాతయు నగు భగవంతుని జన్మ, కర్మాది రహస్యములను, ఆ పదవిని, కపటరహితుఁడును, మాయాప్రపంచమును నిరంతరము అత్యంత ప్రేమతో ఆయన కనుకూలమగు నాచరణమును జేయుచు, నాతని పాద పద్మములయొక్క పవిత్రగ్రంథమును శ్రద్ధతో సేవించువాఁడే తెలిసికొనఁ గలుగును.

పావన మైనది, అమిత మధురమైనది, సుఖము నొసంగునది. ఆతని దేహములోనే అంటిపెట్టుకొనియున్న లీలాలలిత లలామ ఆతని జూచినది.

కపటప్రేమచే వేత్తై కర్మలన్నియు సమర్పణముచేసి అప్పుడు నామరూపగుణధామమును శతములుగ నున్నట్లు తెలిసికొనెను.

భగవంతుని యొక్కయు, భగవద్భక్తుల యొక్కయు చరిత్రశ్రవణగానములు కావింపనిది ఈ భవసాగరము నెవఁడును దాఁటఁజాలఁడు. ఇది సర్వసమ్మత సిద్ధాంతము. భగవానుని అవతారకథలు మానవుని హృదయమును స్వచ్ఛముగను మలరహితముగను నొనర్చును. వానిలో భగవంతుని విశద వీర్య వర్ణనము కలదు. ఆతనికి జీవులపై నెంత కరుణ యున్నదియు, కృపాకారణమున నెట్లెట్లు కఠినకార్యము లొనర్చునదియు దానిలో నుండును. భక్త పరాధీనుఁడై యాతఁడు సమస్తమును జేయఁగలఁడను ప్రసంగము మరల మరల వచ్చుచుండును. వీనిని శ్రవణము చేయుటచే నంతఃకరణమునకు సుఖము కలుగును. కృపాసింధువుయొక్క కృపయొక్క ఒక అర్ధబిందువైనను నామీఁద నెన్నటి కైనను పడునా యను విశ్వాస మధిక మగును. కావున నవతార కథలే సదా శ్రవణీయము లైనవి. వాటిని వర్ణించునదియే "భాగవతము". సూతుఁ డీవిధముగ మాటిమాటికి పలుకఁగా ఋషులందఱ పక్షమున శౌనకుఁడు "మహానుభావా! అవ

తారకథలను, వాటికి సంబంధించిన భక్తుల కథలకే భాగవత మని మీరంటిరి. ఇప్పుడు మేము అత్యంత సంక్షేపముగ మునుముందుగ ముఖ్యాముఖ్యములగు నవతారములను గూర్చి వినఁదలఁచుచున్నాము. ఆ అవతారములను గూర్చి వినిన తర్వాత మీరు మాకు వారి దివ్యలీలలనుగూర్చి విస్తారముగ వినిపింపవచ్చును'' అనెను.

ఋషులయొక్క యీ ప్రశ్నను విని సూతుఁడు "ఓ ఋషులారా! సాంసారికములగు సమస్త విషయముల నుండి పరాఙ్ముఖులై యీ పరమపావనమగు పుణ్యభూమి యందు కూర్చుండి శ్రీకృష్ణ కథాశ్రవణమునందు సంలగ్న మనస్కులైన మీరు ధన్యులరు. భగవదవతార లీలలను గూర్చి ప్రశ్నించువారును, చెప్పువారును ధన్యులే. ఈ జిహ్వ యున్నందులకు అన్నిటికంటె మిక్కిలి సార్థకత శ్రీకృష్ణ కథాకథనము. ఈ శ్రవణము లున్నందులకు సర్వశ్రేష్ఠ మగు సార్థకత సర్వాధారుఁడగు శ్రీహరి లీలలను శ్రద్ధతో శ్రవణము కావించుట. నేను మీకు ముఖ్యాముఖ్యములగు నవతారములను గూర్చి చెప్పెదను. మీరందఱును సావధానపూర్వకముగ శ్రవణము చేయవలయును.

సృష్ట్యాది యందు మొట్టమొదట శ్రీహరియొక్క పురుషావతారము కలిగెను. అది వేదములలో పురుషసూక్తముచే స్తుతింపఁబడినది. ఈ యవతారము సృష్టిరచనకొఱకై నది. జీవులు శుభాశుభముల ననుభవించుటకై వారి శరీరము లుత్పత్తి యగుటకు ఈ ఆదిఅవతారము కలిగెను. సమస్త

విశ్వచరాచరములు, దేవతలు, నానావతారములు దీనివలననే యుత్పత్తియైనవి. అనంతైశ్వర్యస్వామిని యగు శ్రీకి యీతఁడే ఏకైక ప్రథమ పుత్రుఁడు పుట్టెను. విశ్వబీజ మీా పురుషావతారమున నిహిత మైయున్నది. దాని వర్ణనము భాషద్వారా చేయఁబడజాలనిది. అది ఇంద్రియాతీత మైనది. ప్రకృతి, మాయ, అవిద్యాగంధము కూడ లేనిది. సూర్య, చంద్ర, నక్షత్రములు, పంచభూతములు లేకయే గతులు నడచును. ఇట్టిదొక లోకము కలదు. లోకమనుట కూడ ఉపలక్షణము మాత్రమే. అది ఉత్పత్తి, వినాశ, వికార, పరివర్తన, నిరానందముల కతీత మైనది. అచ్చట సర్వేశ్వరుఁడు తన పరమాహ్లాదినీ శక్తితోఁ గూడి నిత్యనూతన లీల లొనర్చుచుండును. నూతనమని యెందుకు చెప్పఁబడిన దనఁగా ప్రేమస్వరూపము నిత్యనూతన మైనది. అచ్చటి ప్రేమకూడ విలక్షణ మైనది. కాని యేమి చేయుదుము; మనము దాని వర్ణనము ప్రాకృత భాషలో చేయుచున్నాము. అచ్చట భాష యేమియు లేదు. ఒక్కటే ప్రేమభాష కలదు. అది వాక్కుల కతీతమైనది. కావున గతిలేక మే మిచ్చట శబ్దములను ప్రయోగింపవలసి వచ్చుచున్నది. అయితే 'ఆతఁడు' 'ఆమె' ఒకరివైపు ఒకరు నిరంతరము చూచుకొనుచుందురు. ఏల? ఆతని సౌందర్యము క్షణక్షణము ఉత్కృష్టా త్యుత్కృష్టముగఁ గనబడుచు చున్నాఁడు. ఇప్పు డేది మనోహరముగను, సరసముగను, దివ్యముగను నుండినదో అది క్షణములో నంతకంటె శ్రేష్ఠ మైన దైనది. ఆమె స్థితియు నిట్టిదే, కావున కనురెప్ప వ్రాల్పకుండ ఆదికాలము నుండియు యుగయుగముల నుం

డియు వారు ఒకరివైపు ఒకరు చూచుకొనుచుండిరి. ఇద్దర కును దృప్తికలుగలేదు; కలుగదు. ఈ చూచుకొనుటలోనే ఒక్కొక్కప్పుడు విలక్షణ క్రీడ యగును. ఆ క్రీడా వికారమే యీ విశ్వము. దానిలో నాతని కేమియు విశేష పురుష ప్రయత్నమును లేదు, సంకల్పమును లేదు. అట్లే ఆడు చుండఁగ నాడుచుండఁగనే యుత్పన్న మగుచుండును. పిల్లలు ఆటలలో గింజలను వెదఁబెట్టి యాడి తమ తమ యిండ్లకు వెళ్ళిపోవుచుందురు. మరునాఁడు వారి కక్కడ బీజములు నాటిన జ్ఞాపకము కూడ యుండదు. మఱునాఁ డింకొక చోట నాడుదురు. ఆటలో నాటిన యీ బీజములు జలసం యోగముచే వృక్షము లగును. పుష్పించును. మనము వేసిన బీజములచే నింతటి వృక్షము లైనసంగతి పిల్లలకు జ్ఞాపకముకూడ ఉండదు. వారి యుద్దేశ్యము బీజములనాటి వృక్షములను పెంచుట కాదు. అవి సంయోగవశమున నాటలో పడిపోయినవి. పెరిగినవి. ఇట్టి స్థితియే యీ యనాది అనంత విశ్వబ్రహ్మాండ విషయములోఁ గూడ. ఇదిగూడ ఆట లాడుటలోనే నిర్మిత మైనది.

మధురము మధురమే. అయినను రుచిని మార్చుటకు మధ్యమధ్య పచ్చడిని నంజుకొనిన రుచి పెరుగును. అభి మానము వలనఁ బ్రేమ స్వచ్ఛ మగును. ఆకులు రాలిపోఁగానే మరల క్రొత్తక్రొత్త చిగురులు పుట్టును. ఇది పతనముకాదు. నూతనతానిర్మాణము. విషయాంతరమునకుఁ బోయి మరల విషయములోనికి వచ్చుటచే దానిలో నభిరుచి వృద్ధిపొందును. ఇది యంతయు నాలోచించి చేయునదికాదు; స్వభావము

తర్వాత దార్శనిక విచారము చేయువారు ఒక సిద్ధాంతముగ పొందిగి దాని ప్రక్రియను నిర్మింతురు.

అనాదికాలము నుండియు వచ్చుచున్న లీలాప్రసంగము నందు ఒకానొక సమయమున రాధిక "మన మిన్నాళ్ళనుండి క్రీడించుచున్నాము. కాని మనకు పుత్రుఁ డెవఁడును కలుగ లేదు. ఒక్కపుత్రుఁడు పుట్టిన బాగుండు ననుకొనుచున్నాను" అనెను.

ఆతఁడు "నీ వీ జంజాటము నంతను విడిచిపెట్టుము. ముగ్గురిమధ్యలో వచ్చిన ప్రేమ ముగ్గురిమీఁదను పంపిణీ యగును. ప్రేమకు ప్రేమీప్రేమపాత్ర లిద్దరే యుండవల యును" అనెను.

కాని అయిన సంకల్పము నెఱవేరి తీరవలసినదే. అమోఘ సంకల్పమే ప్రేమమార్గమునకు భిత్తి. ఆతఁడు ఒప్పు కొనునట్లు చేసినకొలఁది ఆమె హఠముచేయ ప్రారంభించెను. చివర కొక ప్రియపుత్రుఁ డుత్పన్న మయ్యెను. ఆమె వానిని మిక్కి జాగ్రత్తగా, మిక్కిలి ప్రేమతో సమస్త మోహ మమత్వముల నొక్కచోఁ బ్రోవుచేసి లాలనపాలన చేయ మొదలిడెను. ఏ అనుమానము తగిలినదో అట్లే అయినది. ప్రేమ విభాగింపఁబడెను. ఒకరి కిద్దరు భాగస్వాము లైరి. అద్వైతములోనికి ద్వైత మడుగిడినది. ఆ ద్వైతము ఏకత్వ ములో విశిష్ట మైనప్పటికిని, ద్వైతమయ్యు నద్వైతమే. అయి నప్పటికిని మాయాపతి శ్రీపతులకు ఉపాధులలో సమమే కాని కొంచెము భేద మవశ్యము కలదు, పాలు, జలము కలిసి

నవి. ఇప్పు డవి వేఱుకావలయు నను సంకల్పము క్షణములో, వారి మనస్సులలో నుత్పన్న మయ్యెను. ఈ లీల యంతయు నెంతసేపు జరిగినదో లెక్క-వేసి చెప్పుద మనిన నక్క-డ కాలములేదు; కాని ఇది జలములోని ఒక తరంగము వలె నొక్క- క్షణకాలము గానిపించ, నా క్షణమే దానిలో లీల లన్నియు జరిగినవి.

పిల్లవాఁడు తల్లిపడిలో మురిపెము పొందినాఁడు. ఆతఁడు తనను మఱచెను. వానికి సోమరితన మావహించెను. ఏల? అచ్చటి కా సోమరితనమెట్లు చొరబడినది? నీవీ ప్రశ్న నిప్పుడు వేయకుము. ఈ క్షణిక సంకల్ప మెట్లు వచ్చినదో అట్లే ఆ సోమరితనము కూడ. పిల్లవానికి ఆవలింత వచ్చినది. తల్లి యాతని కనిష్టము పోవలయు నని చిటికవేసెను. పిల్లవాఁడు నోరు తెఱచునప్పటికి వాని నోటియందుఁ గూడ అద్భుతాద్భుతములగు వస్తువులు కనఁబడినవి. సహస్ర శిరస్సులు, సహస్ర హస్తములు, అసంఖ్యాకములగు కన్నులు చెవులు, ముక్కులు, నోళ్లు, ఉదరములు, స్త్రీలు, పురుషులు, వృక్షములు, ఆకులు, పర్వతములు, నదులు, వనములు, గుల్మములు, ఏనుఁగులు, ఒంటెలు, నగరములు, పట్టణములు, వేయి ముఖములు కలిగినట్టియు, నూఱు ముఖములు కలిగినట్టియు, చతుర్ముఖములు కలిగినట్టియు ననంతములగు బ్రహ్మలు విష్ణువులు, మహేశ్వరులు, దేవతలు, యక్షులు, కిన్నరులు, గంధర్వులు, తృణము మొదలు మేరువు వఱకును, చీమ మొదలు బ్రహ్మవఱకును గల సమస్త పదార్థములు ఆ ముఖమందు తల్లికి కనఁబడియెను. మూర్తిమంతము లగు మహా

త్త్వము, అహంకారము, శబ్దస్పర్శరూప, రస, గంధములు, మనస్సు, జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు అన్నియు దానిలోఁ గలవు. కిరీట మకుటములచే సుశోభితము లగు సహస్ర శిరములు, కర్ణములందు మిరుమిట్లు గొలుపు కుండలములు ధరించుట కనఁబడుచుండెను. సమస్త చరాచర జగత్తు అసంఖ్యాకము లగు బ్రహ్మాండములు వానిలో సముద్రము లోని చేఁపలవలె దిరుగాడుచుండెను.

ప్రేమోపాసన మేమిటి? ఈ జగజంజాల మేమిటి? ఆమె చాల ఖిన్నురాలైనది. ఛీ ఛీ, ఎట్టి అసహ్యాకర మగు పుత్రుడు పుట్టినాఁడు. నాకు వీఁ డక్కఱ లేదు.

వీని నెక్కడ నుంచెదను? ఇప్పుడు మీరే చెప్పుఁడు." అని యామె అనెను.

"నే నేమి చెప్పుదును? బుద్ధిపూర్వకముగ నీవే యీ చిలుకను బెంచితివి. ఫరవాలేదు. వీనిని మహానారము (జలము) లలో నుంచుము. అదియే యీతనికి అయనము." ఇదియే యాతని సరళమగు ప్రత్యుత్తరము.

"అట్లే కానిండు" అని మాత్రము ఆమె అనెను. ఇప్పటివఱకు ప్రేమమయమగు నొడిలోఁ గ్రీడించువాఁడు, ఇప్పటివఱకు అంకమే ఆతని 'అయనముగ'గఁ గలవాఁడు క్షణములోనే ఆతఁడు యోగనిద్రకు వశీభూతుఁడై సలిలమందు శయనించెను. అప్పుడే పుట్టిన పిల్లవాఁడగుటచే నింకను నాభినాళమును గోయలేదు. భాగ్యముయొక్క చిద్విలాసము ఆతనికి సలిలశయ్య లభించినది. జల సంయోగ

ముచే నాతని నాభినాళము నవనవలాడుచుండెను. దానిలోఁ జూచుచుండగనే కమల ముండెను. దానిలో నుండి నాల్గు ముఖముల దేవత యొకఁడు పుట్టెను. క్షణములో నా కమలము వేఱైపోయెను. అప్పుడే యింకొక కమల ముండెను. దానిలోఁ గూడ నూఱు ముఖముల ఒక దేవత యుండెను. ఆతఁడు కూడ సృష్టిచేయ నారంభించెను. ఆ సలిలశాయి యగు శిశువు శ్వాసించినప్పుడు బ్రహ్మాండములు లోపలికి పోవును. ఆ నాళము నుండి నిరంతరము బ్రహ్మాండములు పుట్టుచుండును. ఆతఁడు సంకల్పము చేయవలసిన పనిలేదు. ప్రయాస పడవలసిన పనియు లేదు. వాటి కవియే అసంఖ్యాకము లగు బ్రహ్మాండము లుత్పన్నము లగును. మరల దానిలోనే విలీనమైపోవును. సమస్త బ్రహ్మాండములకును వేఱు వేఱు బ్రహ్మలు, విష్ణువులు, మహేశ్వరులు, దేవతలు, మనువులు, ప్రజాపతులు, రాజులు, ఋషులు, చరాచర జీవులు వేఱువేఱుగ నుందురు. అది బ్రహ్మాండోత్పత్తి యంత్ర మని గ్రహింపవలయును. ఎన్ని బ్రహ్మాండములు పుట్టినవో, ఎన్ని విలీనములైనవో ఆతని రోమరోమమం దసంఖ్యాకములగు బ్రహ్మాండము లెన్ని దాగియున్నవో ఆతనికే తెలియదు. అయినను అవి వ్యాపించి యున్నవి. ఒకటొకటి ఎదురు డీకొని కొట్టుకొనవు. యోగనిద్రలో కన్నులు మూసికొని ఆతఁడు సుషుప్తిసుఖము నాస్వాదించుచుండెను. విశ్వసృజనము కావించు నాతని మహా మాయాశక్తి స్వయముగ నాతని చరణసేవ చేయుచుండును, ఆమె కెవరును నేర్పను లేదు, ఎవరును మంత్రములను బఠించి యాతనితోఁ బాణి

గ్రహణము చేయించను లేదు. ఆమె ఆతని తోడనే పుట్టి నది; చెప్పకయే, నేర్పకయే, సేవలోఁ జేరిపోయినది.

ఈ యాది అవతారమే సమస్తావతారములకును మూలకారణము. అవతారము లన్నియు దీని నుండియే యుత్పన్న మగుచుండును. ఆతని యొక్క యేదో అంశనుండి యీ దేవతలు, ఋషులు పుట్టుచుండును. మరల నాతనిలోనే విలీనము లగుచుందురు. ఈ యవతారము సృష్టినిమిత్తమై అన్నిటికంటె ముందుగా వచ్చినది; అందువలన దీనిని 'ఆది' అవతార మందురు. సలిలములో శయనించుటచేతను, నార ములలో నివసించుటచేతను ఈతనిని నారాయణుఁ డనియు నందురు. శరీర మను పురములో శయనించుటచే నీతనిని 'పురుషుఁడు' అనియు నందురు. విశ్వబ్రహ్మాండములో అన్నిటి కంటె విశేషమైనది ఈతని శోభ; అందువలన యీతనిని 'విరాట్' అనియు నందురు. వేదములలో నీ విరాట్పురుషుని గూర్చియే వివిధము లగు స్తుతులు కలవు. కావున మే మీ విరాట్పురుషుని పాదపద్మములకు శ్రద్ధాభక్తితోఁ బ్రణామము కావించుచున్నాము.

ఛప్పయ

యే అగణిత బ్రహ్మాండ లీన రహతే హైఁ జినమేఁ
జడ, చేతన, చర, అచర సృష్టి సృజతే హైఁ ఛినమేఁ॥
నిహిత తత్త్వ చౌబీస ఆదిఅవతార్ కహాతే।
ఇన్ సే హోఁ ఉత్పన్న ఇన్హీ మేఁ ఫిర్ మిల్ జాతే॥

అజ అవాది అవ్యక్త ప్రభు, అమితజ్ఞాన విజ్ఞాన హైఁ।
నారాయణ అవ్యయ పురుష, వే విరాట్ భగవాన్ హైఁ॥

అర్థము.

ఈ అగణిత బ్రహ్మాండము లన్నియు నెవనిలో లీనము లైనవో, క్షణములో నెవఁడు జడ, చేతన, చరాచర సృష్టిని చేయునో, ఇరువదినాల్గు తత్త్వములతోఁ గూడి యుండి, ఆది అవతారమని పిలువఁబడి, సమస్తము ఎవనిలోఁ బుట్టి యెవనిలో నేవి లీనము లగుచున్నవో అట్టి అజుడు, అనాది, అవ్యక్త ప్రభువు, అమిత జ్ఞాన విజ్ఞానములు కలవాఁడు, నారాయణుఁడు, అవ్యయ పురుషుఁడు, ఆతఁడే విరాట్స్వరూపుఁడగు భగవంతుఁడు.

# ప్రథమావతారము

శ్లో॥ సఏవ ప్రథమం దేవః
కౌమారం సర్గమాస్థితః।
చచార దుశ్చరం బ్రహ్మ
బ్రహ్మచర్య మఖండితమ్॥ *

(శ్రీమద్భాగవతము ౧ స్కం. 3 అ. ౬ శ్లో.)

ఛప్పయ

దివ్య, దిగంబర షిరేం సభీ స జగ మేఁ జినకో।
పాంచ వర్షకే సదా, జరా వ్యాపే నాహిఁ తినకో॥
రాగ ద్వేష తే దూరి, ఊర్ధ్వ రేతా వ్రతధారీ।
అవ్యాహత గతి రహేఁ సకల జీవని హితకారీ॥
సనక, సనందన, సనాతన, సనత్ కుమార కుమార వర।
మన తిన పద పంకజని కీ, రజ శ్రద్ధాసే ధారి సిర॥

అర్థము

దివ్యులును, దిగంబరులై తిరుగువారును, జగము ంతను సమముగఁ జూచువారును, ఎల్లప్పుడును నైదు వర్ష ములవారుగ నుండువారును, ముసలితనము లేనివారును, ాగద్వేషములు లేనివారును, ఊర్ధ్వరేతస్కులును, వ్రత

* ఆ భగవానుఁడే ప్రథమమున సనకాది కుమారుల సర్గములోనుండి ాహ్మణ వేషమును ధరించి దుష్కర మగు అఖండ బ్రహ్మచర్య వ్రత ను పాలించెను.

ధాకులును, అవ్యాహతగతి కలవారును, సకల జీవులకు హిత మొనర్చువారు నగు సనక, సనందన, సనాతన, సనత్కుమారా వరుల పదపంకజ రజమును శ్రద్ధాభక్తులతో మనస్సున ధరింతును.

ఏవస్తువు మనకుఁ గొంచెమైన మహత్వముగ నుండదో, మన దృష్టిలో నేది నగణ్య ఉపేక్షిత మైనదో దానికొఱకు మన పరంపరలో నుద్భవించువారు—మన ఉత్తరాధికారు లగు పిల్లలు పోరాడు కొనుటయు, వ్యాకులము చెందుటయు నొక నియమము. ఈ నాశవంత మగు వస్తువు లందు మహత్వ మగు వస్తువేదియు లేదు. మనము మన మహత్వ కారణమున, మన వాసనలను బూర్తి కావించుకొనుటకు, మన శ్రమను మన దనుకొని, దాని ఫలమును బొందుటకు అధికారుల మనుకొని వస్తువులకు వ్యగ్రు లగుచుందుము. వాటియందు తనది అను అభినివేశము నొనర్తుము. అవి ప్రాప్తించుటలో విఘ్నము కలిగెనా క్రోధము చూపెదము; తమ కంటకములను నాశము చేయుట కుద్యుక్తు లయ్యెదము. ఇదియే సంసారము. కర్మయే బంధన హేతువు. అసత్తును సత్తుగా భావించి దానిని బొందుటకును, తనదిగనభిమానించుటకును, మాయ లేక అవిద్య అందురు. ఈ మాయ చేతనే జగత్తు సంభవించినది. ఈ యనర్థకారిణి యగు మాయ మధ్య రాకుండి యుండిన యెడల సంసారము లేనే లేదు. అంతయు నాటయే. అందఱును సుఖులుగ నుండెడువారే. ఎవరికి నే చింతయు లేకుండెడిది. అంద రానందముతో నాడుదురు, యెగురుదురు, నృత్యము చేయుదురు, గానము చేయుదురు, ఆనందమును పొంది యుందురు.

కాని యీ మమత్వమునకు సంబంధించిన కర్మ లన్నియు బెల్లము పేడ చేసినవి. సమస్తానందమును నిరానందముగఁ బరిణతము కావించినది.

విరాట్పురుషుని ప్రాదుర్భావము సంకల్పముచేత కలిగినది కాదు. క్రీడామూలముననే అయినది. విరాట్పురుషుని నాశము కూడ జలములో దాని కదియే పచ్చనయ్యెను. దానిలో ప్రయాసము, ప్రయత్నము, సంకల్పము కొంచెమైన లేదు. ఇప్పటి కింకను ఆ ఖేలన మున్నది. ఇందులోఁ జేయుటకు, చేయించుటకు, తన పరాయు అను ఆరోపము లేనే లేదు. ఇప్పు డీ కమలమునుండి పుట్టిన దేవతను జూడ బుద్ధి పుట్టెను. ఎందుకు పుట్టినది? ఏలననఁగా నీతని హృదయములో సంకల్పము ప్రవేశించినది. ఎట్లు ప్రవేశించినది? ఎట్లు మనుచున్నది? ఇప్పుడు ప్రతివిషయమును ఎట్లెట్లనరాదు. ఇట్లు ఎట్లెట్లని యనుటకుఁ బ్రారంభించితినా యీ యెట్లు అనుదాని కంత ముండదు, "ఆ ప్రభువువారి యిచ్ఛవలననే దేవతయొక్క మనస్సులోఁ జూడవలె నను కోరిక కలిగినది. దీని నంగీకరించిన తర్వాతనే బండి నడువఁగలదు. చూడఁ గోరిక కలుగఁగానే నాల్గువైపులను నాల్గుముఖము లయ్యెను. వానిలోనికి ఇంద్రియములు వచ్చి ప్రవేశించెను. చతుర్ముఖుఁడు చూడ మొదలిడెను. ఇప్పు డాతని కోరిక పెరుగ సాగెను. ఏలననఁగాఁ బుట్టినవాఁడు పెరుగును గదా! ఏ విషయమం దాతనికి ప్రవృత్తి కలదో దానిని ముందుకు సాగించుటకు స్వాభావిక మగు నిచ్ఛ కలుగును.

ఇప్పటి వఱకు ఎవరి మనస్సులోను ఏవిధమగు వికారము లేదు. అందఱును గామవిహీనులగు బ్రహ్మచారులే. అమోఘ సంకల్పులు. సమస్త కార్యములు సంకల్పము వలన నయ్యెను. దీనికి బాహ్యోపకరణములు, విశేష ఉపాదానము లేవియు నవసరము లేదు. చతుర్ముఖునకు సంకల్పము కలుగు నప్పటికి నలుగురు సుకుమారులు, సదా సుప్రసన్నులు, మోహ మమతా రహితులు, విశుద్ధ బ్రహ్మచారులు పుట్టిరి. ఈపేర్లతో అసలులో నవతారము కలిగినది. కొంచెముగ నైన వీరిలో మాయంశము లేనిది శరీరము లెట్లగును. కాని విశేష వికారము లేవియును లేవు. వీరి సుందర స్వరూపములను గాంచి బ్రహ్మదేవుఁడు ముగ్ధుఁ డయ్యెను. బ్రహ్మ సంకల్పముచే నైనారు కాఁబట్టి వ్యవహారములో వీరికి బ్రహ్మపుత్రు లను పేరు వచ్చినది. వాస్తవమునకు వీరెవరి పుత్రులును గారు. సాక్షాన్నారాణులే; కాని సృష్టిసంకల్ప సమయమున నుత్పన్నమైనారు; కావున వీరు ప్రథమ ఋషు లని పిలువఁ బడుచుండిరి. వాస్తవమునకు వీరు పూర్వజులకుఁ బూర్వజులు. బ్రహ్మ కంటెను ప్రాచీనులు. భగవత్స్వరూపులు.

బ్రహ్మ తన ప్రయత్నములోఁ దా నుండెను. ఆతనికి సృష్టిని వృద్ధి చేయవలె నను తొందర యెక్కువయ్యెను. మిక్కిలి ప్రేమతో స్నేహము నంతను పుంజీభవింపఁ జేసి మధురవాక్కులతో "పుత్రులారా! మీరతి సుందరులు. ఆహా! మీ రూప మెట్లున్నది? ఎప్పుడును మిమ్ములనే

చూడవలెనని యున్నది; కాని యిట్లు పని యెట్లు జరుగును? నా సంకల్పమునకుఁ దోడ్పడుఁడు” అనెను.

నల్గురు కుమారులును “ఏమి చేయవలయునో ఆజ్ఞాపింపుఁడు” అనిరి. ప్రసన్నుఁడై చతురాననుఁడు “మీ రెట్లున్నారో అటువంటి వారలనే చాలమందిని జేయుఁడు. పెరిగి పోవలయును. అందఱ ఆటపాటలను జూడవలెను. ఇదియే నా మనోరథము” అనెను.

నలుగురును బిగ్గఱగ పకపక నవ్వి దేవా! మీకిది యెట్లు తోఁచినది? దీనివలన నేమి ప్రయోజనము?” అనిరి.

బ్రహ్మ “అరే, అయ్యో యేమిటి? ప్రజలు తమతమ కర్మల ననుభవించెదరు. ధర్మము లాచరింతురు. యజ్ఞానుష్ఠానములు కావింతురు. స్వర్గమును బొందుదురు. మోక్షసాధన మాచరింతురు” అనెను.

కుమారులు “ధర్మము చేయక అధర్మము చేయువారి గతి యేమి?” అని అడిగిరి.

బ్రహ్మ “అధర్మము వలనఁ బాపము కలుగును. పాపమువలన దుఃఖప్రాప్తి కలుగును. నరకమునకు వెళ్లుదురు. నానాయాతనల ననుభవింతురు” అనెను.

కుమారులు “ధర్మాధర్మములనుండి బయటపడి నిరంతరము భగవద్ధ్యానమునందు మగ్నులై రేని వారి కేస్థితి కలుగును?” అని అడిగిరి.

బ్రహ్మ శీఘ్రమున "ఈవిషయమున నడుగున దేమి? వారు సాక్షాత్తుగ జీవన్ముక్తు లగుదురు" అనెను.

కుమారులు "అట్టియెడ మమ్ములను మీరీ సృష్టి గుండములో నేలఁబడవేయుదురు? బురదలో దిగి దానిని నీటితోఁ గడుగుకొనుటకంటె దానికి దూరముగ నుండుటయే శ్రేష్ఠమైన పని. కాఁబట్టి మాకా జంజాటము రుచింపలేదు" అనిరి.

బ్రహ్మ ఆశ్చర్యముతో "నాయనలారా! మీ రేమి యిట్లు మాటలాడుచున్నారు? ఇట్లందఱు ననుకొను నెడల నీ సనాతన సృష్టిక్రమ మెట్లు జరుగును?" అనెను.

కుమారులు నవ్వి "పోనిండు, సృష్టిక్రమము జరుగకున్న మాకేమి హాని? జరుగకపోవుట మంచిదే. జనులు నానాప్రకారములగు ఆధివ్యాధులచేఁ బీడింపఁబడకుందురు. దుఃఖము, శోకము, చింత, శ్రమము, గ్లాని వీనికి దూరముగ నుందురు" అనిరి.

బ్రహ్మ "సృష్టికొఱకు నేను జేసిన శ్రమ యంతయు వ్యర్థమైపోవును" అనెను.

కుమారులు "మీ రేమి శ్రమ కావించితిరి? సంకల్పము లేనిది యేదియుఁ జరుగదు. సంకల్పమును కట్టిపెట్టుఁడు. సృష్టి విలీనమగును" అనిరి.

బ్రహ్మ "నేను చేసిన తపస్సువలన మీరు పుట్టితిరి" అనెను.

కుమారులు "మంచిది, అయితే మన మందఱమును తపస్సు చేయుదుము. తపస్స్వరూపుఁ డగు శ్రీహరిని నిరంతర మారాధింతము" అనిరి.

బ్రహ్మ మండిపడి "కేవలము తపముచేతనే పనికాదు. సృష్టి వృద్ధికి కూడ కొంచెము శ్రమింప వలయును" అనెను.

బ్రహ్మ అధికార స్వరముతో "ఎందుకుకాదు, మీకు తండ్రి నగు నా యాజ్ఞ నుల్లంఘించుచున్నారా?" యనెను.

కుమారులు సరళతా పూర్వకముగ నిందులో నాజ్ఞోల్లంఘనము లేదు. ఇది సర్వశ్రేష్ఠము, సర్వోపరి కర్తవ్యము. సర్వాత్మ భావముతో దీనిలో లగ్నమైనవారి కింకఁ గర్తవ్య శేషముండదు. వానికి ఇంతకు మించిన వస్తు వేదియు లేదు" అనిరి.

ఈ యుపదేశమే సృష్టికి మూల కారణ మయ్యెను. కుమారులు శుద్ధ సత్త్వ ప్రధానులు. బ్రహ్మ రజోగుణము నకు వశీభూతుఁడై మాట్లాడు చుండెను. ఆ సమయమున బ్రహ్మ విశుద్ధ సత్త్వము నాశ్రయించి కుమారుల వాక్యములను విని యుండిన యెడల సృష్టి అంతటితో నాగి పోయిడిదే. సంకల్ప మింకను ముందుకు పోయెడిది కాదు. సంకల్పములు పెఱిగిననే సృష్టి విస్తారమగును. తన యాజ్ఞ నుల్లంఘించి రని తెలిసికొనఁగానే బ్రహ్మయొక్క రజో గుణము ఇంకను నధిక మయ్యెను. తన యభీష్ట కామనా పూర్తి కాకపోవు నప్పటికి కామము ఆ సమయముననే క్రోధ

రూప మగు పుత్రుని ఉత్పన్నము కావించెను. ఆ క్రోధమే రుద్రరూపమును ధరించి బయటపడెను. ఆతఁడు బ్రహ్మదేవుని ఆజ్ఞను ఏ రూపమునఁ బాలించినదియు, దీనియొక్క విశేష వివరణము సృష్టి ప్రసంగములో రాఁగలదు.

ప్రతిద్వంది యుత్పన్నము కానిది ఏ వస్తువైనను విశేష ముగ వృద్ధి పొందదు. ఆ రెండు వస్తువులను సంయమములో నుంచినపుడు మూఁడవవస్తువు సృష్టిలోనుండదు. ఆవశ్యకతయే ఆవిష్కారమునకు జనని. సృష్టి సంకల్పముచే బ్రహ్మోత్పత్తి యయ్యెను. ఆతఁడు దానిని రచించినాఁడు కాని అదివృద్ధిపొందు టెట్లు? దానికి ప్రతిద్వందికూడ యుండవలయును. అందువలన సృష్టిని సంహరించు శక్తిగల రుద్రుఁడుత్పన్నమయ్యెను. ఆతఁడు సంహారశకశక్తి వృద్ధిలో పరమ పురుషార్థమును ప్రకటించెను. అంత బ్రహ్మ భయ మినుమడించి దాని వృద్ధి, రక్షణ, లెట్లా యను చింత కల్గెను. కేవల సంకల్పముచే నది జరుగునట్లుండె. వెలువడి రంగమున ప్రవేశించి ప్రబలశక్తి ప్రకటించి తద్వారా తను ముందుకుపోవలయు. వెంటనేరజోగుణ మద్దాని పరాకాష్ఠ కందుకొనెను. "ఈ సత్త్వగుణమే మధ్యలో గడబిడ చేయు చున్నది. ఇదియే సృష్టిని వృద్ధిపొందనీయుటలేదు;" అను సంక ల్పముకల్గుట మోహ, మహామోహాదు లుత్పన్నమైసత్త్వమును గప్పివేసెను. అందుచే బ్రహ్మ కావేశముకల్గి ఇట్లాలోచించెను. ఈ యనునయ వినయములచే సృష్టి వృద్ధిపొందదు. ఎవరు కా దనుచుండిన వారికి నచ్చఁజెప్పవలయును. చూడఁగానే జనులు స్వయముగ సృష్టియందు ప్రవృత్తులగునట్టి మోహవస్తువేదైన నుండవలయును. సంకల్పించఁగానే బ్రహ్మ రెండు భాగము

లయ్యెను. ఇంతవఱ కాతఁడు సంకల్పము చేతనే ద్వైత సృష్టి యందుఁబ్రవృత్తుఁ డయ్యెను. ఇప్పు డాతఁడు స్వతః కర్మచేతను. శరీరము చేతను రెండుగ నయ్యెను. ఇద్దరు ఒకటిగనే యుండిరి. ఒక శరీరమునకు రెం డంగము లయ్యెను, కాని సంకల్పములు రెండు. మోహాకము కావించుట, సృష్టి వృద్ధిపొందించుట. అందువలన నీరెండు భాగములకు రెండు వేఱువేఱు లింగము లయ్యెను. సృష్టిని జేయవలె నను సంకల్పము కలిగిన భాగము పుంలింగ మనఁబడినది; మోహాక సంకల్పముచేఁ గలిగినది స్త్రీలింగ మనుపేర విఖ్యాత మయ్యెను. దానియొక్క ప్రతి అంగము నందును మోహాకత కలదు. శతశత రూపములచే నది మనస్సును దన వైపునకు ఆకర్షించు చుండెను. అందు వలన బ్రహ్మ ఆ భాగమునకు శతరూప యను పేరుపెట్టెను. ఇఁక రెండవ పుంలింగ రూపము మను వను పేర విఖ్యాతిని జెందెను. సృష్ట్యాది యందు వీరే స్త్రీ పురుషులు. వీరి వలననే సమస్త సృష్టియొక్క ఉత్పత్తియు, వృద్ధియు నయ్యెను.

భగవల్లీల యెటువంటిది? ఒకే అంగమునుండి యిద్దరు ఒకటిగ పుట్టిరి. సంకల్పముచే నొక రొకరు కలిసికొనవలె నను వ్యగ్రత చెందియుండిరి. మను దేవుఁ డాశతరూప మీఁద లోలోన నాసక్తి జెందియుండెను. శతరూప కూడ ఆతనిని బొం దుటకు వ్యగ్రత చెందియుండెను. బ్రహ్మ వీరిద్దరి మనోభావము లను గనిపెట్టి, తన సంకల్పమునకు అనుకూలసిద్ధి కలుగు చున్నదని లోలోన సంతోష పడుచుండెను. చేతులు జోడించి మనువు తన తండ్రిని "దేవా! నాకేమి యాజ్ఞ? నేనేమి చేయుదును?" అని అడిగెను.

బ్రహ్మ "మంచిది, నీవొక పనిని జేయుము. ఈమెను భార్యగాఁ జేసికొనుము" అనెను.

మను మనస్సులో నేసంకల్పము కలదో, శతరూప దేనిని గోరుచున్నదో దానినే బ్రహ్మ నోటినుండి వచ్చుటను విని యిద్దరును హృదయములో నుత్కంఠతతో నుండిరి. ముకుళించిన యిద్దరి హృదయకమలములు వికసించినవి. తమ యానందము నణఁచుకొనుచు మనువు "పితృాజ్ఞ నాలోచన లేకుండ మాన్యముగ నుండును. మీ యాజ్ఞప్రకారము చెప్పఁగలము" అనెను.

బ్రహ్మ "నీవు మంచివాఁడవు. నీ పూర్వజులగు — కుమారులను నీ వనుకరించ లేదు" అనెను.

మనువు "అయితే మే మేమి చేయవలెను?" అనెను. ప్రసన్నతతో బ్రహ్మదేవుఁడు "మీ రిద్దరు మీ కనురూపులగు సంతానమును కనవలయును. ఈ సృష్టిక్రమము చాల వృద్ధి పొందవలయును. అట్టి ప్రయత్నమును జేయవలయును" అనెను.

విరాట్పురుషుని నాభినుండి పుట్టిన కమలము ఏడు భాగము లయ్యెను. పైనున్న నాల్గుభాగములు (మహా, జన, తప, సత్యలోకములు) సంకల్పసృష్టిచేఁ బుట్టిన ఋషులచే నిండిపోయెను. కాని మూలమైనది పృథివి. భూమిమీఁదఁ బుట్టి కర్మ చేయకున్నయెడలను, అన్యలోకములకుఁ బోకున్న యెడలను సృష్టిక్రమము వృద్ధి యగున దెట్లు? ఈ కార్యము నంతయు సత్యలోకములోఁ గూర్చుండి బ్రహ్మదేవుఁడు చేసెను. ఈ మైథునసృష్టి పైలోకములలో నుండఁజాలదు. ఇదంతయు

నాలోచించి ఆదిపురుషుఁడగు మనువు "మే మెక్కడ నుండ వలెను ? ఎక్కడ సృష్టిని వృద్ధిచేయవలెను ?" అని అడిగెను.

బ్రహ్మ చాల సంతోషముతో "మీరు భూమి మీఁదకు బొండు. అక్కడ మీ అధికారమును చలా యించుఁడు. అక్కడనే సృష్టిని వృద్ధిచేయుఁడు. ఇండ్లు వాకిండ్లు, రాజపరివారముల నేర్పఱుపుఁడు. నానావిధములగు అన్నములను, రసములను, ఫలములను దినుఁడు. యజ్ఞాదులను జేయుఁడు, చేయించుఁడు, ఆనందించుఁడు" అనెను.

"తమ ఆజ్ఞానుసారము" అని మనువు పితామహుని పాదములు పట్టుకొనెను. శతరూప కూడ శిరస్సువంచి ప్రణా మము కావించెను. పితామహుఁడు "వెళ్లుఁడు, మీ దంపతు లిద్దరకు ఫలించుఁగాక. చాలమంది కొడుకులు, కూతుండ్రు, బంధువులు, మనుమలు, మనుమరాండ్రు కలుగుఁగాక. నా వలె మీరు కూడ మీ సంతానముచే బూజింపబడుదురు గాక !" అని ఆశీర్వాదించెను.

ఇద్దర హృదయము ఆనందముచే నిండిపోయెను. లజ్జా, సంకోచములచే నేమియు మాటాడలేదు. మరల బ్రహ్మ యిట్లుపదేశించెను — "నీ అగ్రజకుమారులు నా మాట వినలేదు. వారు తపస్సునందే వారి చిత్తమును లగ్నము కావించిరి. తపముకూడ చేయవలయును. కాని సృష్టిని వృద్ధి చేయవలెను. సంతానమును గలిగించవలెను. ఇది కూడ చాల పుణ్యప్రదమగు కార్యమే. దీనివలన గొప్ప యశస్సు కలుగును. సుఖసమృద్ధి ప్రాప్తించును. పితరులు ప్రసన్నులగుదురు."

ఇద్దరును శిరస్సు వంచి బ్రహ్మోపదేశమును వినిరి. బ్రహ్మ సంతానోత్పత్తి కార్యము పుణ్యప్రదమని చెప్పు చున్నాఁడు. అది సరియే కాని వారిద్దరును పరస్పరము స్వయముగ సృష్టిని వృద్ధిచేయుట కుత్సుకులైరి.

వారిద్దరు పుట్టుటచే బ్రహ్మకు సంతోషము కలిగెను. ఇఁక ముందువిషయమునుగూర్చి వారాలోచించుచుండిరి.

ఛప్పయ

సనకాదిక నే సృష్టి కార్య మేఁ యోగ న దీన్హో।
కహ్యో కర్యో న కుమార, కోప కమలాసన కీన్హో॥
మను సుతరూపా భయే దేహ తేఁ దో నర నారీ।
ఉననే శ్రద్ధా సహిత సీఖ సబ సిర పై ధారీ॥
ఆయసు పాకర పితాకీ, దోనోఁ దులహీన దుల్హా మిలి।
సృష్టి రచీ సుఖసే గఈఁ, హృదయ కమల కీ కలీ ఖిలి॥

అర్థము

సనకాదులు బ్రహ్మదేవునకు సృష్టికార్యములో సహాయపడకపోయిరి. చెప్పిన పని చేయకపోవు నప్పటికి కమలాసనునకు కుమారుల మీఁద కోపము వచ్చెను. ఆ బ్రహ్మదేవుని శరీరమునుండి మను, శతరూపము లను నరనారు లిద్దరుదయించిరి. వారిద్దరు బ్రహ్మదేవుని యుపదేశమును శ్రద్ధతో శిరస్సున ధరించిరి. పితాజ్ఞను బొంది దంపతు లిద్దరును గలిసికొనిరి. సుఖముగా వెళ్లి సృష్టిని చేసిరి. వారి హృదయకమలము వికసించినది.

# అన్యావతారములు

శ్లో॥ సవా ఇదం విశ్వమమోఘ లీలః
సృజత్యవత్త్యత్తి న సజ్జతేఽస్మిన్ ।
భూతేషు చాంతర్హిత ఆత్మతంత్రః
షాడ్వర్గికం జిఘ్రతి షడ్గుణేశః॥ *

(శ్రీమద్భాగవతము ౧ స్కం. ౩ అ. ౩౬ శ్లో.)

ఛప్పయ

హైఁ మనమౌజీ నాథ సూత్రధర విశ్వవిహారీ ।
నయే నయే నిత స్వాంగ్ రచే లీలా విస్తారీ॥
ఏక రూప తేఁ రచేఁ ఏక తేఁ పాలన కరతే ।
జగ సంహారన హేతు నేత్రత్రయధారన కరతే॥
కచ్ఛ మచ్ఛ వరాహ వప, ధరి కే ధరనీ ధారతే ।
ధర్మ ధేను ద్విజ పాలతే, దైత్య దుష్ట సంహారతే॥

అర్థము

ఆనందమూర్తియగు నాథుఁడు, సూత్రధరుఁడు, విశ్వవిహారి యగు శ్రీహరి నిత్యనూతనములగు లీలావిస్తారమును

---

* అమోఘ లీలాధారియగు శ్రీహరి యీ అఖిల విశ్వ బ్రహ్మాండమును రచించును, పాలించును, చివరకు సంహారము కూడ కావించును; కాని స్వయముగ దానియం దిసుమంతైన నాసక్తిని జెందఁడు. తనలోనే స్వాధీనతతో స్థితముగ నుండు ఆత్మతంత్రుఁ డగు భగవానుఁడు సమస్త ప్రాణులయొక్క అంతఃకరణమునం దుండి జ్ఞానేంద్రియము లైదింటికిని, మనస్సునకు గల ఆఱు విషయములను ననాసక్తభావముతో భోగించును. ఏలననఁగా నాతఁడు ఆ అన్నింటికిని నియంత.

స్వాంగములోఁ గావించెను. ఒక రూపముతో సృష్టిచేయును, ఒక రూపముతోఁ బాలనము చేయును, జగత్సంహారము కావించుటకు త్రినేత్రములను ధరించును. మత్స్య కూర్మ వారాహ రూపములను ధరించి భూమి నుద్ధరించును. ధర్మ ధేనువును, ద్విజులను బాలించును. దుష్ట దైత్యులను సంహారము కావించును.

ఒకే భగవంతుఁడు సృష్టితంత్రమును నడుపుటకు వీలగునట్లు తనశక్తిని బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లను మూఁడు రూపములుగ విభాగించును. తత్వతః వీనిలో నేభేదమును లేదు. ఆ ప్రభువే సృష్టి చేయునపుడు బ్రహ్మ యని పిలువఁబడును. పాలన చేయునపుడు విష్ణు వగును. సంహార సమయమున శివుఁ డగును. తన కార్యములకొఱకే దేవుఁడే విశేషావసరము లందు విశిష్టరూపము నందునపుడు ఈయనయే అవతారమని పిలువఁబడును. సామాన్యముగ మన్వాది ప్రజాపతులు సృష్టిని వృద్ధిచేయుటకు వచ్చిన బ్రహ్మయొక్క అవతారములే. ఇంద్రుడు, దేవతలు, ఋషులు, మానవులు, మనుపుత్రులు మొదలగు రూపములచే సృష్టిని పాలనము చేయుచుందురు. కావున వీ రందఱును విష్ణుని అవతారములు. మనస్సు, కాలాది సంహారము కావించువా రందఱును రుద్రావతారములు. ఇంకను భగవంతుఁడు భక్తులకొఱకు కూడ అనేక రూపములను ధరించుచుండును; కావున వా రందఱును విష్ణుమూర్తి యొక్క అంశావతార, కళావతార, ఆవేశావతారములను పేర విఖ్యాతము లైనవి. జీవు లెట్లనంతములో, బ్రహ్మాండము లన్నియు నెట్లనంతములో అట్లే అవతార

ములు కూడా, అయినప్పటికిని, యిచ్చట కొన్ని అవతార ముల వర్ణనమే చేయఁబడుచున్నది."

శౌనకుఁడు కూడ "సూతా! నీవు విరాట్పురుషుని యొక్కయు, ప్రథమావతార మగు శ్రీ సనకాది కుమారుల వర్ణనము కావించితివి. ఇఁక నింక ననంతవీర్యుఁ డగు భగవానుని యితర ముఖ్య ముఖ్యావతారములు ప్రసిద్ధము లగున వేవి కలవో, వాటి పేర్లను జెప్పుఁడు" యని అడిగెను.

అవతారముల విషయములో ఋషుల ఉత్సుకతను గాంచి సూతుఁడు "ఋషులారా! అవతార కథయే ప్రపంచములో శ్రవణయోగ్య మగు కథ; మిగిలిన వన్నియు జంజాలములే. ఈ కుమారులు నివృత్తి మార్గ ప్రదర్శకు లగు ఆది అవతారములు. దీనివలనఁ బ్రపంచములో బ్రహ్మచర్యమే సార మైన దని సిద్ధాంత మైనది. ఈ శ్రేష్ఠ మగు వ్రతమును బాలింపలేనివారు ప్రథమ ధర్మము నాచరించుచు నిటు ముందుకు రావలయును. సమస్త అవతారములకుఁ గారణము ధర్మ సంస్థాపనమే.

ప్రజాపతి యగు మనువును బ్రహ్మదేవుఁడు భూమి మీఁదకు వెళ్ళి సృష్టి చేయవలసిన దని యాజ్ఞాపించఁగా, నాతఁడు ధ్యానపూర్వకముగఁ జూచునప్పటికి సృష్టికి అధిష్ఠాత్రి యగు దేవి ఆతనిని అసురపాతాళమునకుఁ గొనిపోయినట్లు తెలిసికొనెను. బ్రహ్మదేవునకు పుట్టించుట మాత్రమే తెలియును. రక్షింపఁబడుట కాతఁడు విష్ణుని శరణు వేడవలయును. కావున భూమిని రక్షించుట కాతఁడు మనస్సులో

శ్రీహరి శరణు చొచ్చెను. వెంటనే పృథివిని రక్షించుటకు భగవంతుఁడు సూకర రూపమును ధరించి, పాతాళమునుండి భూమి నుద్ధరించి దానిని జలము నందు స్థాపించెను.

బంధనమునకుఁ గారణము కర్మయే. నైష్కర్మ్య ప్రాప్తి అకాముఁ డగుటచే నగును. మానవుఁ డొక్కక్షణ మైనను కర్మ చేయకుండ నుండఁజాలఁడు. ఇఁక జరుగున దెట్లు? ఈ మర్త్యలోకమున జీవు లీ విధముగ ననంత కాలము వఱకు నలిగి పోవలసినదేనా? వీరి నిష్కృతికి ఉపాయ మేమియు లేదా? భూమిమీఁద నెవఁడును కర్మను జేయ కుండ నుండఁజాలఁడు. కర్మ చేయుచున్నప్పటికిని బంధనములు పెరుగుటకు బదులుగాఁ దరుగు నట్టిదియు, కర్మ చేయుటచే సంసారములోనికి రాజపోక లాపునట్టి కర్మ యేదియు లేదా? ఈ పని లేకపోయిన నింక అవతార మెందులకు? కావున దేవర్షి శరీరము నాశ్రయించి శ్రీహరి నారద రూపమున నవత రించి పంచరాత్ర భక్తి శాస్త్రముయొక్క ప్రచార, ప్రసార, ప్రవచనములఁ గావించెను. దాని ననుసరించి చేసిన కర్మలు బంధన కారణముకాక సంసారము నుండి ముక్తిఁ బొందుటకుఁ గారణము లగును. వానిద్వారా భగవద్భక్తి ప్రాప్తి కలుగును.

ప్రపంచములోఁ గామదేవుఁడు విశ్వవిజయుఁ డని పిలువఁ బడుచున్నాడు. దేవతలు, ఋషులు, గంధర్వులు వీని నుండి తప్పించు కొనలేరు. ఈతఁ డందఱను బోల్తా కొట్టిం చెను. శివుఁడు భస్మము చేసినాఁడే కాని కామ విజయము కావించి భస్మము చేయలేదు. క్రోధముద్వారా వానిని అశరీ

రిగఁ జేసెను గాని క్రోధింపక నిరంతరము తపస్సులోఁ గూర్చుం డుటచే నీ ప్రబల పరాక్రమము గల శత్రువు కూడ నోడి పోవునా? ఈ యాదర్శమును బ్రపంచము ముందు పెట్టుటకు భగవంతుఁడు ధర్ముని పత్ని యగు మూర్తి యొక్క గర్భము నుండి నర, నారాయణు లను పేర నిద్దరుగ నవతరించి మన స్సును, ఇంద్రియములను నిగ్రహించు మార్గమును జెప్పెను. కఠిన తపస్సును జేసి కామునిపై విజయమును బొందెను.

ఈ విశ్వబ్రహ్మాండములో నన్నియుఁ గలిసి యెన్ని తత్త్వములు కలవో వాటి సంఖ్యను యెవరు చెప్పఁగలుగు దురు? ఈ నిమిత్తమై కపిలరూపమున భగవంతుఁ డవతరించి లుప్తప్రాయమైన సాంఖ్యశాస్త్రమును బ్రచారము కావించి యుండెను. ఆసురీ యను ఋషికి ఉపదేశము కావించి, వాని ద్వారా దానియొక్క ప్రచార ప్రసారములను గావించెను. అవి కృతయుగావతారములు. ప్రతి కృతయుగములోను అవత రించి జ్ఞాన ప్రసారము కావించును.

భగవంతుఁడు తన భక్తులపై నెంతటి కృపఁ జూపు నదియు, ఆతఁడు తన భక్తులను బ్రసన్నులఁ గావించుట కేమేమి యీయలేఁడో, దీనిని సిద్ధాంతము చేయుటకు పరమావధూత రూపమున భగవంతుఁడు అత్రిమహర్షి భార్య అనసూయా గర్భమున నుద్భవించి ప్రహ్లాద, అలర్కాదులకు బ్రహ్మ జ్ఞానము నుపదేశించెను. కార్తవీర్యార్జునునకు విద్యా, వరదాన ములు కావించెను. ఈతఁడు తపస్విని యగు అనసూయాదేవి తపముచే వరము నడుగఁగా బ్రకటమయ్యెను.

ఋషులు "సూతా! అనసూయ వరమేల యడిగినది? భగవంతుఁ డామెకడ నేల యవతరించెను? ఈ కథను విస్తారముగ మాకుఁ జెప్పుఁడు" అని అడిగిరి.

ఋషుల ప్రశ్నకు సూతుఁడు "మహాభాగులారా! ఈ సమయముననే అవతారముల చరిత్రమును నేను చెప్పుటలేదు. ఇక్కడ కొంచెము ప్రసిద్ధావతారములను గూర్చి చెప్పుచున్నాను. అవతారము లన్నిటిచరిత్ర ముందు ముందు వర్ణన చేయఁబడును. అవతార కథకే భాగవత మందురు. నేనీ యవతార చరిత్రము లన్నిటిని ఎంతయు యిఁక ముందు విస్తారముగఁ జెప్పెదను. ఇప్పుడు మాత్రము మీరు సంక్షేపముగ వీటిని సూచనప్రాయముగ శ్రవణము చేయవలయును.

స్వాయంభువ మన్వంతమున భగవానుఁడు "యజ్ఞుఁడు" అనుపేర నవతరించెను. రుచి ప్రజాపతి యొక్క భార్యయగు ఆకూతి గర్భమున నవతరించి యాతఁడు మనుపదము నధిష్ఠించి యొక మన్వంతర మంతయుఁ ద్రిలోకములను బరిపాలించెను.

ప్రజలందఱు గృహస్థ ధర్మమునే సర్వశ్రేష్ఠముగ భావించి దానియందే యాసక్తి చెందియుండిరి. పరమహంస మార్గమునెడల ప్రజలకు రుచి మందగించెను. అప్పుడు స్వయముగ శ్రీహరి "ఋషభ" రూపమున భూమియందవతరించెను. ఆతఁడు దిగంబరిగనుండి జీవన్ముక్త స్థితిని అందఱకును జూపించి, ప్రాచీన పరమహంస మార్గమును ప్రతిష్ఠించెను. ఈ యవతారము అజ్ఞజనులను భ్రమలోఁ

బెట్టునదియు, విజ్ఞజనులకు మోక్షమార్గమును జెప్పునదియు నై యుండెను.

వేనుని యొక్క అధర్మాచరణములకు విసుగుc జెంది పృథివి సమస్తబీజములను దనలో దాcచుకొనెను. ప్రపంచ మంతయు నాcకలిచే దుఃఖపడు చుండెను. అది సృష్ట్యారంభ సమయము. అప్పటి కింకను పట్టణములు గాని, గ్రామములు గాని అంతగా లేవు. పృథివి కూడ మెరక పల్లములుగ నుండెను. భగవానుcడు పృథురూపమును ధరించి పృథివిని తన పరాక్రమముచే సమము కావించెను. దాని నుండి అన్నౌషధములను బిండి ప్రజాపాలనము కావించెను. పృథివి సారవంత మైనదయ్యెను. పృథుమహారాజు పుత్రి యగుట చేతనే యీ ధరణికి పృథివియను పేరు వచ్చినది. ఈతcడే భూమిమీcద గ్రామ, మండల, నగరములను గల్పించెను.

అసురులు వేదములను హరించునపుడు దాcబోవు మన్వంతరాధిపతి వైవస్వత మనువునకు, సమస్త బీజములకు, మహర్షులకు ఆశ్రయ మేమియు దొఱకకపోగా భగవంతుcడు లోకనిందితమును, జలచర మని అందఱును దిను మత్స్యరూప మును ధరించెను. ఆ జలచర రూపమును ధరించి శ్రీహరి సప్త మహర్షులను, మనువును ప్రళయమునుండి రక్షించెను. ఈ భగవదవతార మే మత్స్యావతార మను పేరc బ్రసిద్ధ మయ్యెను.

ఒకసారి దేవతల "శ్రీ" సముద్రములో విలీన మైపో యెను. ఈ కథ విస్తారముగ ముందు చెప్పcబడును. ఆ సము

యమున భగవంతుఁడు క్రీడకొఱకు, మనోరంజనము కొఱకు, తన భక్తవత్సలతను జూపుటకు, వినోదము కొఱకు, ఇంక దేనికో గాని, గొప్ప గొప్ప మాయలను రచించెను. ఈ లీల యెంత అద్భుతమో తెలియునా ? ఒక్క అవతారముతో పని కాలేదు, రెంటిచేతఁ గూడ కాలేదు, మూఁడింటి చేతఁగూడ కాలేదు, నాల్గు అవతారములను ధరించెను. ఒక యవతారమున దేవతలకు మోసమును నేర్పి ప్రేరేపించెను. అసురులతో రాజనీతిచే సమయానుకూల సంధిని కావించి సముద్ర మథనము చేయుటకు ఒప్పించెను. గరుడునిమీఁద నెక్కి మందరాచలమును గవ్వముగఁ జేసి తీసికొనివచ్చి, మథించుటకు క్షీరసాగరములో వేసెను. ఇప్పుడు నిరాధార మగు నింతటి మహాపర్వతము అగాధమగు సముద్రజలములో నెట్లు నిలువగలదు ? అందులకని యాతఁడు లక్ష యోజనములు పొడవు గల తాఁబేలు రూపమును ధరించి దానిని తన వీపు మీఁద ధరించెను. ఇంతటి పెద్ద పర్వతము వీపుమీఁదఁ దిరుగుటచే వీపుచర్మ మూడదా ? కష్టమే అయి యుండ వచ్చును. నీవు కష్ట మనవచ్చును గాని ఆతని కా మహా పర్వతము వీపుమీఁద చీమ ప్రాకినట్లు కూడ లేదు. అది ఏదో మెల్ల మెల్లగా గీకిన ట్లుండెను.

ఇప్పుడు క్షీరసాగరమునుండి అమృతమును దెచ్చుట యే దేవతలకు సాధ్యమైన పనికాదు. కావున స్వయముగ "ధన్వంతరి" రూపమును ధరించి అమృత కలశమును దీసికొని వచ్చెను.

ఎట్టి లీలయో కాని, కొంచె మైనను దెలిసికొనఁ జాలము. స్వయముగఁ దానే మథించుచున్నాఁడు. స్వయముగ నమృతము దీసికొని వచ్చినాఁడు. ఇట్లుండియు నల్ప వీర్యునివలె నుండఁగా నొక్కసారిగాఁ బైకి ఉరికి ఈతని చేతిలోని యమృతమును అసురులు తీసికొని పోయిరి. ఈతఁడట్లే చూచుచుండెను. దేవతల ముఖము వాడిపోయెను. వారి యాకృతి వికృతి జెందెను. వారి యీ స్థితిని గాంచి కొంచెము వినోదముగ లీలాధారి నవ్వుచు వీరి నోదార్చుచు "దుఃఖించెద రెందులకు? నేను మీకు యుక్తిచే నమృత పానము చేయించెదను; భయపడకుఁడు" అనెను.

అప్పుడు, యెప్పుడును గననిదియు, విననిదియు నగు రూపము నాతఁడు ధరించెను. కుమార, నరనారాయణ, కపిల, దత్తాత్రేయ, నారదాదులు అఖండ బ్రహ్మచర్య పాలనము కావించుటయు, ఛల కపటములకు క్రోసుల దూరమున నుండుటయు, తపోనిష్ఠులు పరమ సాత్త్వికము లగు నవతారము లెక్కడ, ప్రమదావతార మెక్కడ? "దయానిధీ! నీ నడక యూహింపరానిది." మగవాఁడు ఆడుదయ్యెను.

"ఏమయ్యా, ఆడుది చెడ్డదియా యేమి;" చెడ్డ దని యెవ రనిరి. మంచిదే. ఇంత వఱకు వచ్చిన అవతారము లన్నియు నేదో తల్లిగర్భము నుండియే వచ్చినవి. ఆ తల్లు లెవరికో భార్యలై యుందురు. ఏదో మంచివానికి భార్యగా నుండినచో నేమియు నాశ్చర్యము లేదు; కాని యీ అవతారము ప్రమదా "పుణ్యస్త్రీ" రూపమున నయ్యెను.

ఆ మోహినీ స్వరూపము అసురులను మోహపెట్టుటయే కాదు. దేవాధిదేవుఁడగు మహాదేవుని గూడ మాయలోఁ బడవేసెను. "స్వామీ! నీ యీ యనుపమాద్భుతావ తారమునకు దూరమున నుండియే నమస్కారము చేయు చున్నాను".

బ్రహ్మయిచ్చిన వరములను సత్యము కావించుటకును తన భక్తుని రక్షించుటకును భగవంతుఁడు తన సగము శరీర మును నరరూపముగాను, మిగిలిన సగము శరీరము విలక్షణమగు సింహరూపమును ధరించి నరసింహావతారము నెత్తెను.

బలిచక్రవర్తి గొప్ప ధర్మాత్ముఁడు, కాని అసురుఁడు. అసురుఁడై యాతఁడింద్రాసనమునఁ గూర్చుండెను. ఇంద్రుని కొట్టి తరిమివేసెను. ఇంద్రుఁడు, అతని తల్లియు గూడ ఆయన భక్తులే; బలియు నంతే; ఇప్పుడు చేయవలసిన దేమి? ధర్మ సంకటమునఁ బడి యాతఁడు పెద్దవాఁ డయ్యు వామనుఁ డయ్యెను. కపటము నాశ్రయించి బలిని పాతాళరాజుగఁ జేసెను. ఇంద్రుని స్వర్గమునకు రాజు కావించెను. ఈ యద్భుత మనోహర కథనము వామనావతార కథయందు చేయుదుము.

చాలమంది క్షత్రియు లైశ్వర్యము బొంది మదోన్మత్తు లైరి. వారు తమ బ్రహ్మణ్యతా కర్మములను మఱచిపోయిరి. అప్పుడు దయాళుఁడగు భగవంతుఁడు తన చేత పరశువును బట్టెను. క్షత్రియులు కంపించిపోయిరి. ఇట్టి యవతార మిప్పటివఱ కెన్నడును కలుగలేదు. బ్రాహ్మణుఁ డయ్యు నింతటి నృశంసత. తోటమాలి పెద్దకత్తెరతో నిన్నివృక్షము

లను నిర్దయుఁడై ఏల తరుగుచున్నాఁడో ఎవరికి తెలియును ? ఆతఁడు దగ్గఱనున్న వృక్షముల నేల పెళ్ళగించుచున్నాఁడు ? ఏ చెట్టును పెఱికివేయవలయునో, దేనిని క త్తిరించవలెనో, దేనిని రక్షింపవలయునో ఈ రహస్యము వృక్షవిజ్ఞానము తెలిసిన విశేషజ్ఞుఁడు మాత్రమే తెలిసికొనఁగలఁడు. అట్లే పరశురాముని అవతారము నట్టిదియే.

ప్రతి త్రేతాయుగములోను ధర్మమును రక్షించుటకును, అసురులను సంహరించుటకును భగవంతుఁడు రామరూపమున నవతరించును. ఇది త్రేతాయుగావతారము. ఇంతటి సౌమ్య, సరళ, సత్య, సుందర, సాహస, సత్త్వగుణ, స్నేహభరిత మగు నవతార మీ ప్రపంచమున నింకొకటి లేదు, ఉండఁబోదు.

ద్వాపరాంతము నందు మానవు లల్పాయుష్కులై, అల్పజ్ఞానులై, శౌచ సదాచారహీనులై, ఉత్కృష్టజ్ఞానమును ధరింప నసమర్థులు కాఁగా శ్రీహరి ప్రతి ద్వాపరాంతము నందును వ్యాసరూపమున నవతరించును. వేదములను వ్యాసము కావించును. పురాణములను సంగ్రహము కావించి వాటిని మానవుల కుపయోగపడునట్లు విభాగించును. ఇతిహాస కథలను సంగ్రహము కావించి, సమస్త జ్ఞానమును సరళతాపూర్వకముగ లౌకిక భాషలోఁ బ్రకటించును. గత ద్వాపరయుగమున భగవతీ సత్యవతీ గర్భమునుండి పరాశర మహర్షి వీర్యముచే శ్రీకృష్ణ ద్వైపాయనుఁ డను పేర వేదవ్యాస రూపమున నవతరించెను. ఈతఁడే సమస్త పురాణములకును తిలక

స్వరూపమగు శ్రీమద్భాగవతమును గూడ రచించియుండెను. వేద విభాగమును గావించి, లౌకిక భాషలోఁ బంచమ వేద మగు మహాభారతమునుగూడ నిర్మించెను.

ఆ సమయమున వృష్ణి వంశమున రామకృష్ణ రూపమున రెండు అవతారములు ఒక్కసారిగ నయ్యెను. బలరాముఁడు ధరాధరుఁడగు శేషుని అంశావతారము. శ్రీకృష్ణుఁడు నరనారాయణావతారమని కొంద అందురు; కొందఱు లోకరక్షకుఁడగు విష్ణుని యవతార మందురు. వ్యాసులవారు "ఈ యవతారము లన్నియు నంశావతారములు; కొన్ని కళావతారములు; కాని కృష్ణుఁడు స్వయముగ సాక్షాత్పరబ్రహ్మయే. ఆతఁ డవతారము కాదు; అచ్చట యెట్లుండెనో అట్లే వచ్చెను. ఆ లోకములో నే లీలను మానవీయనేత్రముల కప్రకట రూపముగఁ జేయునో ఆ లీల లన్నిటిని తన సమస్త పరివారముతో వచ్చి ప్రత్యక్షముగఁ గొన్నిక్షణముల కాలము బృందావనధామమునఁ గావించెను. ఇవి చాల రహస్య విషయములు. ప్రసంగము వచ్చినప్పుడు ముందు ముం దీవిషయమును గూర్చి విశేష వివేచనము చేయఁబడును" అని చెప్పెను.

ధర్మము నష్టముగాఁ బెట్టుకొని యసురులు అధర్మమును జేయునప్పుడును, పాపమునకుఁ బుణ్యము పూతపూసి యింద్రియ తృప్తిలో మానవులు మునిఁగి పోయినపుడును; దైత్యులు బ్రాహ్మణవేషమును ధరించి మిథ్యా యజ్ఞ మానప్రతిష్ఠను, నింద్రియ లోలుపతను మిథ్యాయజ్ఞములందుఁ బ్రవృత్తులై యున్నపుడును భగవంతుఁ డా యసురులను మోసము

కావించుటకు "బుద్ధుఁడు" అను పేర నుత్పన్నమయ్యెను. ఈ యవతారము దైత్యులను మోసము చేయుటకై యున్నది. ఈతని యుపదేశములను దెలిసికొనుటకు దైవీసంపత్తి కావల యును. అసురులు పై యర్థమును మాత్రమే కైకొని ముగ్ధులగుచు ధర్మమునుండి పతితు లగుచుందురు.

ఘోర కలియుగము వచ్చినప్పుడు, ధర్మ మిసుమంతైనను లేకున్నప్పుడు, సర్వత్ర అధర్మము, అత్యాచారము, స్వార్థము, వ్యభిచారము పెచ్చు పెరిగినప్పుడు ఆ యధర్మమును నాశము చేయుటకు శ్రీహరి కల్కిరూపమున నవతరించును. ఇది కలియుగావతారము. ప్రతి కలియుగములోను ఈ యవతారము వచ్చి కలియుగ భావములను నాశను కావించి కృతయుగమును స్థాపించును. ఇవియే భగవంతుని ముఖ్య ముఖ్యావతారములు.

శౌనకుఁడు "సూతా! కుమారులతోఁ గలిసి యీ యవతారములు ఇరువది రెండైనవి. భగవంతునకు ఇరువదినాల్గవతారము లున్నట్లు మేము వినియున్నామే" అనెను.

సూతుఁడు "ఋషులారా! భగవ దవతారములకు నిశ్చితమగు లెక్కలేదు. వాటికి లెక్కయే యుండునెడల ననంతము లెట్లగును. ఇర ఉపలక్షణము మాత్రమే. ఇవి కాక ధ్రువునిపైఁ గృపజూచిన ధ్రువవిష్ణువు, గజమును గ్రాహము నుండి వదలించిన హరివిష్ణువు, హంసావతారుఁడగు విష్ణువు, హయగ్రీవావతారము; ఈ విధముగ భగవంతున కనంతావతారములు కలవు. రాఁబోవు అవతార ప్రసంగములో

నింకను లెక్కకు వచ్చును. ఋషు లందఱును, మనువులు, దేవతలు, మను పుత్రులు, పరాక్రము లగు రాజులు, ప్రజాపతులు అందఱును భగవంతునియొక్క అంశావతారములు. అందఱిలోను ఆ శ్రీహరియొక్క అంశము ప్రవేశించి త్రైలోక్య పాలనము కావించుచున్నది. ఒక్కొక్కప్పుడు అసురులలోఁ దన పరాక్రమమును బ్రవేశపెట్టునప్పటికి వారు ప్రబలులై దేవతలను అవతారములను గూడ అణఁచివేయుచుండును. అనేక రూపములలో నా నటనాగరుఁడు లీలాధారి క్రీడించుచుండును.

ఈ కళావతారములు, అంశావతారములు ఎక్కడనుండి మొదట బయలుదేఱెనో ఆ కృష్ణుఁడే పరాత్పర పరిపూర్ణ పరబ్రహ్మ. ఆతని అవతారములకు లేక్కలేదు. ఆతఁడవతారముల మయము. ఆతని అంశము చేతను, కళలచేతను బ్రకటమైన అవతారములు దైత్యదమనమును, అసుర సంహారమును గావించును. ఈ యవతారములు ప్రతి యుగములోను, ప్రతి మన్వంతర మందును నుత్పన్న మగును. అన్ని అవతారముల కార్యము వేఱు వేఱుగ నుండును. వారి కార్యమును వారు పూర్తి కావించుకొని అంతర్ధాన మగుచుందురు. చాల పను లున్నయెడల నొక్కొక్కప్పుడు చాల అవతారము లొక్కసారిగఁ బ్రకట మగుచుండును. మహాభారత సమయమునఁ జాల అవతారము లొక్కసారిగ వచ్చెను— నరావతారము, నారాయణావతారము, బలరామావతారము, వ్యాసావతారము, శ్రీకృష్ణావతారము. వీరు కాక పరశురామ, కపిల, నారద, కుమారులు ఇప్పుడు కూడ

నున్నారు. అందఱయొక్క కార్యక్షేత్రములు వేఱు వేఱు కాని శ్రీకృష్ణున కే కార్యమును లేదు. ఆతఁడు క్రీడించుచుండును. ఒకొక్కప్పుడు అనుగ్రహసృష్టిజీవు లీ భూమిపై నత్యధికముగ నుందురు. వారి ననుగ్రహించుటకు స్వయముగ సాక్షాద్రూపమున నీ ధరాధామమునఁ దన లీలలను బ్రకటించి చూపించుచుండును. ఆతనిని జూచుట కైనను అందఱు నధికారులు కారు. ఎవరి కర్మబంధనము తెగిపోయినదో, ఆతని నిత్య లీలలలోఁ బాల్గొనుట కెవరు అధికారులైరో, ఎవరికి ఆతని పరివారములోఁ బ్రవేశించుటకు యోగ్యత ప్రాప్తించినదో, ఆ మహాభాగులే యీ ప్రకట లీలలను దర్శించుట కధికారు లగుదురు. ఆతని లీల లాతని లోకములో నిత్యములుగ నుండును. భావుక భక్తులు భగవదనుగ్రహముచే భావనారూపమున భగవానుని యీ లీలలను నిత్యము నాస్వాదించుచుందురు. ఈ సమస్త విషయములను గూర్చిన చర్చ ప్రసంగానుసారముగా విస్తారముగఁ జెప్పఁబడును.

ఛప్పయ

హైఁ కుమార, వారాహ, కపిల, నారద అవతారా।
నర నారాయణ, ఋషభ, దత్త, పృథు, యజ్ఞ అపారా॥

ధన్వంతరి, నరసింహ, మత్స్య, కచ్ఛప, వామన, హరి।
పరశురామ, శ్రీరామ, వ్యాస, బలరామ, రూపధరి॥

కలాఅంశ సంభవ సకల, శుభ అవతార మహాన్ హైఁ।
కృష్ణ స్వయం భగవాన్ హైఁ, సబకే ఆది నిధాన్ హైఁ॥

అర్థము

కుమార, వారాహ, కపిల, నారద, నరనారాయణ, ఋషభ, దత్తాత్రేయ, పృథు, యజ్ఞ, ధన్వంతరి, నరసింహ, మత్స్య, కూర్మ, వామన, హరి, పరశురామ, శ్రీరామ, వ్యాస, బలరామ రూపములను ధరించిన యీ అవతారము లన్నియుఁ గలాంశ సంభవములు. ఇవి శుభకరములైన మహావతారములు. కాని సమస్తావతారములకు ఆది నిధాన మైనవాఁడు శ్రీకృష్ణభగవానుఁడే.

# పావన ప్రశ్న

శ్లో॥ కస్మిన్ యుగే ప్రవృత్తేయం
స్థానే వాకేన హేతునా।
కుతః సంచోదితః కృష్ణః
కృతవాన్ సంహితాం మునిః॥ *

(శ్రీమద్భాగవతము ౧ స్కం. ౪ అ. 3 శ్లో.)

ఛప్పయ

సూత ! కహాఁ అబ్ కథా కహాఁ పర్ కిస్ కే ద్వారా।
ప్రకట భాగవత భఈ కహాఁ కీయో విస్తారా॥
వ్యాసదేవ ముని మహా తనయ ఉనకే అతిజ్ఞానీ।
పాగల్ ప్రేత సమాన ఫిరేఁ మానో అజ్ఞానీ॥
సునీ కథా కైసే కహీం, నృపతి పరీక్షిత ప్రతి సభీ।
సూత! సునాఓ సబ్ కథా, హోఁ సంతోష హమేఁ తభీ॥

అర్థము

ఓ సూతా! భాగవతము ఎక్కడ, ఎవనిద్వారా ప్రకటమైనదో, ఎవరు ఎక్కడ దానిని విస్తారము కావించిరో యిప్పుడు చెప్పవలయును. వ్యాసమహర్షి కుమారుఁడును

* శౌనకాది మహర్షులు సూతుని యిట్లడిగిరి. "సూతా! మా యీ ప్రశ్నమునకు బాగుగా ప్రత్యుత్తర మీయవలెను. ఈ భాగవతకథ యే యుగములోఁ బ్రకటమైనది? ఏ స్థానమునఁ బ్రకటమైనది? ఏ కారణమునఁ బ్రకటమైనది? మహాముని శ్రీకృష్ణద్వైపాయనుఁ డెవరి ప్రేరణచే నీ సాత్వతసంహితను రచించెను.

అమితజ్ఞానియు నగు శుకమహర్షి బాలోన్మత్త పిశాచమువలె నజ్ఞాని రీతిని దిరుగుచుండును గదా! ఆతఁ డెట్లు కథను విన్నాడో, దానిని పరీక్షిన్మహారాజున కెట్లు చెప్పినాఁడో ఆ సమస్త సమాచారమును మాకు వినిపింపుఁడు. దానివలన అప్పుడు మాకు సంతోషము కలుగును.

రహస్యమయ విషయ భూమికను విని దానిని విస్తార పూర్వకముగ వినవలె నను ఇచ్ఛ స్వాభావికముగఁ గలుగును. సంభవము కాని విషయ సంబంధమున నెవఁడైన నేమైనఁ జెప్పఁ బూను నెడల మనస్సులో నిది సంభవముకాదే; ఇది యే కారణమున నైనది? అను ననేకము లగు ప్రశ్న లుద్భవించుచుండును.

సూతుఁడు, సూత్రరూపమున నీ భాగవత కథ మొదట వ్యాస భగవానుఁడు రచించెననియు, దానిని తన ప్రియపుత్రుఁడగు శుకునకుఁ జెప్పెననియు, శుకముని విప్ర శాపమున శాపితుఁడైన పరీక్షిత్తునకు వినిపించె ననియుఁ జెప్పెను. దీనిలో ననేకము లగు నసంభవ విషయములు కలవు. ఒకదానికంటె నొకటి ఆశ్చర్యకరమైన విషయము. ఆ కారణమున శౌనకాది ఋషులు సూతుని బ్రశ్నించు చుండిరి.

"మహానుభాగుఁడ వగు నో సూతా! నీవు చాల బుద్ధిమంతుఁడవు. బుద్ధిమంతులు చాలమంది యుందురు. కాని సమస్త విషయములను దెలిసికొనఁ గలవా రుండరు. ఏదో ఒక విశేష విషయమునందు మాత్రమే వారి బుద్ధి విశేషతను గనపఱతురు; కాని నీవో సర్వశాస్త్ర జ్ఞాతవు; సమస్త విషయ

విశేషజ్ఞుఁడవు; చాలమంది స్వయముగ సమస్త విషయము లను బాగుగఁ దెలిసికొనఁ గలుగుదురు; కాని నీవు వక్తలలోఁ గూడ విశారదుఁడవు ఏ విషయమును నీ వే విధముగఁ దెలిసి కొంటివో, దాని నావిధముగానే శ్రోతలకు వ్యక్తము చేయుట యందుఁ గూడ సమర్థుఁడవు. వక్తృత్వశక్తి అందఱిలో నుండఁజాలదు. వేయింటి కొకఁడు మాత్రమే సుయోగ్యుఁ డగు వక్త యుండును. నీవా కుశల వక్తలలోని వాఁడవు.

“నీవు భాగవత కథను శుకమహర్షి వలన వింటి వని చెప్పితివి. దయయుంచి ఆ పుణ్య కథనే మాకుఁ గూడ విని పింపుఁడు. మీ తండ్రి సమస్త పురాణములను, శాస్త్రము లను జెప్పఁగల వాఁడు; గొప్ప బుద్ధిమంతుఁడు; కావుననే మీ బిందు కులము చాల పవిత్రమైనది. నీవు యోగ్యుఁ డగు తండ్రికి సుయోగ్యుఁ డగు కుమారుఁడవు. నీవు కృష్ణ కథను శుకమహర్షి వలన వింటివి. శుకమహర్షిని గూర్చి చెప్పుటయన సూర్యుని దివ్వెపెట్టి చూపించుటయే. ఆతని తండ్రి సాక్షా ద్విష్ణుమూర్తి అవతారము. ఆతఁడు స్వయముగ పరమ విర క్తుఁడు, మహాజ్ఞాని, అద్వితీయ భగవద్భక్తుఁడు. ఆతనికి నీవు శిష్యుఁడవు. కావున నీ నాదకులము కూడ పరమ పవిత్ర మైనది. ఈ విధముగ నీవు బిందు నాద కులముల రెంటను కులీనుఁడవు. కులీనుఁ డగువాఁడు ధనహీనుఁ డగుఁగాక, గుణహీనుఁ డగుఁగాక, వాఁడు వందనీయుఁడు. కొంచెముగనో, గొప్పగనో కుల పరంపరా ప్రభావము సాధారణముగ నందఱి మీఁదను పడును. శీలమే మానవునకు శాలీనతా ద్యోతక మైనది. శీలగుణము అధికాంశము వంశ పరంపర వలననే

ప్రాప్తించును; లేదా సజ్జన సాంగత్యముచేతఁ గూడ ప్రాప్తించును. కులీనపురుషుని యాచించినది విఫలము కాఁజాలదు. అది సదా సఫలమగుచుండును. నీవు శుకదేవుని నోట నెట్లు కథను వింటివో అట్లే మాకును నీవు వినిపింపుము.

వ్యాసభగవానుఁడు లోకహితకారిణియు, శ్రీకృష్ణ స్వరూపధారిణియుఁ, విమల హారిణియుఁ, బద్ధ ప్రాణతారిణియు, విరక్త జ్ఞాని ముని మనోహారిణియు నగు భాగవతకథ నెచ్చట, ఎందులకు, ఎప్పుడు, ఎవరికొఱకు చెప్పెను?

ఆతఁ డట్లే తన యిష్టప్రకారము రచించెనని నీవన వచ్చును. నిజమే కాని యా మహర్షికి స్వయముఁగ గర్తవ్యమేమియును లేదు. ఆతఁ డాత్మారాముఁడు. అయినను ఆతఁడు లోకహితము కొఱకు వేదములను వ్యాసము కావించెను. పురాణములను సంగ్రహించెను. అట్లే ఈ కథను గూడ రచించెను; లేక యెవరైన నాతని నీ కార్యమందుఁ బ్రవృత్తి కావించిరా? సమస్త కార్యములును ఈశ్వరేచ్ఛ చేతనే దైవేచ్ఛచేతనే జరుగుచుండును. భగవదేచ్ఛ లేక నొక యాకైనను గదలదు. అయినప్పటికిని కార్యకారణములను గాంచి కర్మలు మూఁడు రకములుగ విభాగింపఁబడినవి. ఒకటి స్వేచ్ఛచేఁ జేయఁబడిన కర్మలు. ఒకటి పరేచ్ఛచేఁ జేయఁబడిన కర్మలు. ఒకటి దైవేచ్ఛచేఁ జేయఁబడిన కర్మలు. దుర్యోధనుఁడు స్వేచ్ఛగా జూదమాడి యుండెను. వనవాసము పూర్తి కాఁగానే ఆతఁడు పాండవులకు రాజ్యమును

దిరిగి యిచ్చివేయవలసినది; కాని యాతఁడు స్వేచ్ఛగాఁ దిరిగి యివ్వలేదు. ఇట్టి కార్యములు స్వేచ్ఛగాఁ జేయఁబడిన వందురు.

అర్జునునకు యుద్ధము చేయుట యిష్టములేదు. ఆతనికిఁ దన కులపరివారమును, పూజనీయ పురుషులను వధించుట కిష్టము లేదు. ఆతఁడు విత్తురుతోఁ దడుపఁబడిన రాజ్యముకంటె భిక్షావృత్తిపై నుండుటయే శ్రేష్ఠముగ నెంచుచుండెను; కాని శ్రీకృష్ణభగవానుఁడు ప్రేరణ చేసి వానిచే యుద్ధము చేయించెను. శత్రువులను సంహరింపఁ జేసెను. పాండవుల కేకఛత్రాధిపత్యము నొసంగెను. ఇతరులద్వారా ప్రోత్సహింపఁబడి చేసిన కార్యములను పరేచ్ఛాకర్మ లందురు. యుధిష్ఠిర మహారాజు కౌరవ వధానంతరము రాజ్య సింహాసనమునఁ గూర్చుండుట యిష్టము లేదు; కాని వ్యాసాది మహర్షులు, భీష్మ పితామహుఁడు, శ్రీకృష్ణ భగవానుఁడు ఆతనికి వివిధములగు నుపదేశము లొసంగి, వివిధములగు నీతులను జెప్పి రాజ్యము చేయుటకుఁ ప్రేరేపించిరి. స్వేచ్ఛా కార్యముచేఁ జేయువాఁడు నిశ్శంకముగఁ జేయును; దానికి ప్రతికూలమగు నితరుల వాక్యములను లెక్కచేయఁడు. శంకితావస్థలోఁ ప్రేరిత కర్మ చేయఁబడును. మనస్సులో నేవిధమగు శంకయు లేనప్పుడును, స్వయముగ దానిని సమాధానపఱచుకొని కార్యమందుఁ ప్రవృత్తిచెందు క్షమత లేనప్పుడు తనకంటె శ్రేష్ఠుఁడును, తన హితైషులైనవారు నేదైనఁ గార్యమునుఁ జేయుటకుఁ ప్రేరణ చేయునెడల దానినే కల్యాణ కారకమని భావించి మనము చేయుచుందుము. ఇది పరేచ్ఛచేఁ జేయఁబడిన కర్మ. మనకు స్వయముగఁ

జేయుట కిష్టము లేకయు, కాని పరిస్థితులు వానిని జేయుట తప్పనిసరి యగునట్లు చేసి, ఆలోచింపకయే మనము ప్రారబ్ధ వశమున వానియందుఁ బ్రవృత్తి చెందవలసినచో నా కార్యములను దైవేచ్ఛా కార్యము లందురు. కుమారావస్థలో కుంతికి గర్భధారణ చేయుట యిష్టములేదు. కాని దైవేచ్ఛచే ధారణ చేయవలసి వచ్చినది. ఆమె తన పుత్రుని నీటిలో వదలిపెట్టుటకు నడుము కట్టుకొని యుండలేదు; కాని పరిస్థితులామెను అట్లు తప్పనిసరిగ చేయునట్లు చేసియుండెను. కర్ణునికి తన తోఁబుట్టువు లగు పాండవులతో పోరాడుట కిష్టము లేదు; కాని భవితవ్యతా తంత్రముచేఁ దన తోఁబుట్టువులతోఁ బోరాడవలసివచ్చెను. తన తమ్ముల భార్య యగు ద్రౌపదిని కువాచ్య వచనములు పలుకవలసి వచ్చెను. వీటి అన్నిటిలోను ప్రభ్వేచ్ఛయే. కావున సూతా! వ్యాసభగవానుఁడీ భాగవత సంహితను స్వయముగ రచించెనా? లేక యెవరి యాజ్ఞచే నైన రచించెనా? ఒకవేళ నాజ్ఞచేతనే రచించి యుండిన నెవరి యాజ్ఞచే రచించినాఁడు? ఆతఁ డెందుల కాజ్ఞాపించెనో మాకుఁ జెప్పుఁడు.

మీ రింకొక ఆశ్చర్యకర మగు విషయమును గూర్చి ముచ్చటించితిరి. దానివలన మా కాశ్చర్య మధిక మైనది. వ్యాసు డీ బృహత్సంహిత నంతను శుకదేవునకుఁ జెప్పినట్లు చెప్పియుంటిరి. శుకదేవుని గూర్చి మేము మా ఋషుల వలనను, మునులవలనను వినియుంటిమి. ఆతని త్యాగ వైరాగ్యములను గూర్చి మే మనే కాద్భుతము లగు నుపాఖ్యానములను వింటిమి. ఆతని యుత్కట వైరాగ్య విషయములు

మమ్ములను చాల పైకి లేవనెత్తినవి. విరక్తి పాఠమును పఠింపఁ జేయుచున్నవి. వాసనా హీనతను గూర్చి నేర్పుచున్నవి. ఆతఁడు పుట్టుకతోడనే సాంసారిక విషయములం దుదాసీనుఁడు, ద్వైతభావ విరహితుఁడు, సర్వసముఁడు, పరమహంస వృత్తికలవాఁడు. ఆతనికి చదువవలె నని గాని, చెప్పవలె నని గాని లేనేలేదు. ఆతని విషయములో మేము ఋషులవలన నొక చాల విచిత్ర మగు సమాచారమును వింటిమి.

శుకుఁడు పదునాఱు సంవత్సరముల వఱకు ఈ సంసార బంధనములకు భయపడి గర్భములోనే యుండెనని వింటిమి. అప్పుడు వ్యాసునకుఁ జాల చింత కలిగినది. ఆతఁడు ద్వారకానాథుఁడగు శ్రీకృష్ణచంద్రునకీ వృత్తాంతమంతయును జెప్పెను. శుకుని సమాచారమును విని శ్యామసుందరుఁడు ద్వారక నుండి వ్యాసాశ్రమమునకు వేంచేసెను. అంత నాతఁడు గర్భస్థ శిశువు నాశ్వాసించుచు నీకు సాంసారికమాయ వ్యాపించ దనెను. భగవద్వాక్యమునందు విశ్వాస ముంచి శ్రీశుకుఁడు గర్భమునుండి బయటకు వచ్చెను. బయటకు రాఁగానే వ్యాసుఁ డాతనికి లౌకిక వైదిక సంస్కారములను జేయుటకుఁ బ్రవృత్తుఁ డయ్యెను, కాని యాతఁ డా కర్మల ననుమోదింప లేదు. ఆతఁ డా సంస్కారములను జేయకయే యెట్టి స్థితిలో గర్భమునుండి వెలువడెనో అట్లే మొండి మొలగా నుంచి వెళ్ళిపోయెను. వ్యాసుఁడు పుత్రశోకముచే దుఃఖితుఁడై "హా పుత్రా! హా పుత్రా!" యనుచు నాతని వెనువెంటఁ బరువిడెను. కాని యాతఁడు వెనుదిరిగి చూడ

లేదు. ఇట్టి శుకమహర్షి ఈసాత్వత సంహిత యగు నీ భాగవతము నెట్లు పఠించెను? ఇంతేకాదు; ఆ యేకాంతమతి యగు మహాయోగి యొక్క సమదర్శిత్వమును గూర్చి యింకొక విలక్షణ మగు కథను వింటిమి.

ఆతఁడు నగ్నుఁడై స్వాత్మానందమగ్నుడై వనములోఁ బోవుచుండఁగా నాతని వెనువెనకనే వృద్ధుఁ డగు వ్యాసుఁడు కూడ పుత్రా! పుత్రా! యని పిలుచుచుఁ బరువిడు చుండెను. ఎదురుగా నాతఁడు గంగానదిలో స్నానము చేయుచున్న స్వర్గములోని అప్సరసలను గాంచెను. వారు తమ వస్త్రములన్నిటిని పుణ్యసలిల యఁగు అలకనందానది యొడ్డున నుంచి నగ్నలై స్నానముచేయుచుండిరి. వారి యెదుట పరమరూప యౌవన సంపన్నుడును, పదునాఱు వత్సరముల వయస్సుకలిగి దిగంబరుఁడైన శుకుఁడు వెళ్లుచుండఁగా, వారల్లే నవ్వుచు, నొకరిపై నొకరు నీరు జల్లుకొనుచు, నానావిధములగు జలక్రీడలు కావించుకొనుచు నేవిధమగు శీల సంకోచమును లేక స్నానము చేయుచుండిరి. శుకదేవుఁడు వన పర్వత, వృక్షాదుల నెట్లు చూచుచుఁ బోవుచుండెనో, అట్లే యీ దేవాంగనలఁ గూడ కాంచెను. దేవాంగనలు కూడ ఆతనిఁ జూచిరి. వారి మనస్సులలో నేవిధ మగు భావమును గలుగలేదు. పశు పక్ష్యాదు లెట్లు అటు నిటు యెరిగిపోవుచున్నవో అట్లే యీ శుకుని గూడ ఒక సుందర మగు పక్షి యనుకొనిరి. శుకుఁడు స్వాత్మానందములో మునిఁగి ముందుకు సాగిపోయెను. శుకుని వెనువెనక హంస ఱెక్కలవలెఁ దెల్లని గడ్డమును, జడలను ధరించిన వ్యాసభగవానుఁడు వచ్చుటను గాంచి శీఘ్రముగా

అస్తవ్యస్తావస్థతోఁ దమ వస్త్రములను ధరించిరి. వారు తమ సమస్తములైన యంగములను గప్పుకొనిరి.

వ్యాసుఁ డీచరిత్రమును గాంచి పరమాశ్చర్యమును జెందెను. ఆతఁడు మనస్సులో నిట్లనుకొనసాగెను. వీరిదిన మున విచిత్ర వ్యవహారమును గావించిరి. పరమరూప యౌవన సంపన్నుఁడును, నగ్నుఁడు నగు నా పుత్రుని గాంచి వీరు మొండి మొలలతోడనే స్నానము చేయుచుండిరి. వస్త్రము లను ధరించిన ముసలివాఁడ నగు నన్నుఁ గాంచి లజ్జావతు లగుచున్నారు. ముసలివాఁ డాగలేదు; ఆ విషయమును జీర్ణింపఁ జేసికొనలేక పోయెను. జీర్ణింపఁ జేసికొనవలసినది కూడ లేదు. ఇది తనకు మచ్చగను, ప్రత్యక్షావమానము గను దోఁచెను. వెళ్ళి అక్కడ నిలువఁబడి, పలుకరించుచు "పుత్రికలారా! ఈత్రోవను మా పిల్లవాఁడు వెళ్ళినాఁడు. మీరు వాఁడు వెళ్లుటను జూడలేదా?" అని అడిగెను. లజ్జతో తమ గుహ్యాంగములను యత్నపూర్వకముగఁ గప్పుకొనుచుఁ దమ శరీరములోనికే తాము ప్రవేశించు చున్నారా యను నట్లు తమ శరీరములను సంకుచితము కావించుకొని లజ్జా వశమున వారు "అవును స్వామీ! మేమా మహాభాగుఁడు వెళ్ళుటను గాంచితిమి. ఆతఁ డిప్పుడే యీ ఉత్తరవైపుగా వెళ్ళియుండెను. కొద్ది దూరమే పోయియుండవచ్చును" అని ప్రత్యుత్తర మిచ్చిరి.

వ్యాసుఁడు పుత్రుని విషయములో నింకను అడుగ వలసి యున్నది. పుత్రుఁ డాతని ముందుగనే వెళ్ళుచుండెను.

ఆతఁడు ప్రసంగమును పెంచుచుండెను. ఇది అసలు విషయము నెత్తుటకు ప్రాతికదిక. సంభాషణారంభము కాఁగానే యాతఁడు "పిల్లలారా! నే నొక విషయము మిమ్ముల నడుగఁ దలఁచు చున్నాను. మీ రది చెడ్డగాఁ దలఁపకుండిన నడిగెదను" అనెను.

దేవాంగనలు సిగ్గుపడుచు "స్వామీ! మీ రే మిది యిట్లు పలుకుచున్నారు. మీరు మాకు తండ్రితో సమానులు. ఎక్కడనైనఁ దమ పుత్రికల ని ట్లడుగుదురా? మీ రేమియు సంకోచింపకయే అడుగఁ దలఁచిన దేమో అడుగుఁడు. మేము దానికి యథామతిగఁ బ్రత్యుత్తర మీయఁ గలము. అనిరి.

వ్యాసుఁడు మహాత్మ్యమును బ్రకటించుచు "అట్లైన నే నడిగెదను. నే నడుగున దేమనఁగా — నా కుమారుఁడు పరమ రూపవంతుఁడు. యౌవన సంపన్నుఁడు. అతని యంగము లన్నియు సుందరము లైనవి. అట్లయ్యు దిగంబరుఁడు, శరీరము మీఁద నొక వస్త్ర మైనను లేదు. ఆతఁడు మీ ముందుగా వెళ్ళినప్పుడు మీ రే విధమగు శీల సంకోచమును గావింపలేదు. దిగంబరులై స్నానమును జేయుచునే యుంటిరి; ఆడుచుంటిరి, పాడుచుంటిరి. నేను ముసలివాఁడ నైతిని; వెంట్రుకలు తెల్లపాఱినవి; వృద్ధావస్థచే నింద్రియములు శిథిలము లైనవి. సమస్తము లైన అంగములను వస్త్రములచేఁ గప్పు కొంటిని. ఇట్టి నన్ను గాంచి మీ రధికముగ సిగ్గుపడితిరి. అత్యంత మగు నడావిడిచే వస్త్రములను ధరించు చుంటిరి.

దీనికిఁ గారణ మేమి? నేను ముసలివాఁడను. మీ తండ్రితో సమానుఁడను. శత శాస్త్రములలోఁ బారంగతుఁడను. ధర్మ వ్యవస్థాపకుఁడను. అట్టి నన్ను మీరు సందేహించితిరి. ఏ యువావస్థను బొంది జీవు లున్మత్తు లగుదురో, కర్తవ్యా కర్తవ్యతా విమూఢు లగుచుందురో, అట్టి యవస్థను బొందిన నా పుత్రుని విషయములో మీరు చాటుకు బోకుంటిరి. ఈ రహస్యమును నాకుఁ జెప్పుఁడు" అనెను.

ఆ దేవాంగనలలో సర్వశ్రేష్ఠురాలు "స్వామీ! మేము మీ యెడల నవిశ్వాసమును జెందుటయు లేదు; మీ యెడల మా విచార మింకొక విధముగను లేదు. కాని మే మేదైనఁ జేసియుండిన నది నారీసులభ మగు స్వాభావిక లజ్జకు వశీభూతుల మై చేసియుంటిమి. స్త్రీ యెటువంటి దైనఁ గానిండు, దానిలో శీలసంకోచ లజ్జ యుండియే తీరును" అనెను.

వ్యాసుఁడు "అవును, అది నే నొప్పుకొనెదను. కాని మీరు నా పుత్రు నెదుట ఏల లజ్జపడలేదు?" అనెను.

ఆ వారాంగనయే "ప్రభో! వికారము సంభవించి నచో లజ్జ కలుగును. వికార సంభావన లేకున్న యెడల లజ్జ కూడ లేదు" అనెను.

వ్యాసుఁడు "అయితే నా చరిత్ర మీఁదఁ బ్రత్యక్షముగ నవిశ్వాసమును బ్రకటించుటయే యగును" అనెను.

చేతులు జోడించి గడ గడ వణఁకుచు, భయ భీత వాక్కులతో నా దేవాంగన "స్వామీ! నేను మీ శ్రీచర

ణాములకు శిరః సాష్టాంగ నమస్కారములు చేసెదను. నా యభిప్రాయ మిది కాదు. మీకును మీ పుత్రునకును భేద మేమి యనఁగా మీరు సంసార సుఖముల ననుభవించితిరి. మీకు స్త్రీ భోగ్యవస్తువని తెలియును. కాని మీ పుత్రుఁడు సాంసారిక సుఖములకు సర్వథా అపరిచితుఁడు. ఆతనికి స్త్రీ పురుష భేదము లేనే లేదు. ఇది స్త్రీ, ఈతఁడు పురుషుఁడను సంగతి మీకు తెలియును. ఇంతేకాదు, స్త్రీల యందు కూడ మీకు మనస్సునందు భేదభావము కలదు. మేము చిన్నవాం డ్రము కాఁబట్టి మీరు మమ్ములను మాటి మాటికి పుత్రీ పుత్రీ యని పిలుచు చున్నారు. నీ యీడుజోడువారి నైనట్లైన మీరు 'సోదరీ' యనెడువారే. మీ కంటెను ఇంక ముసలి వాండ్రైన యెడల 'అమ్మా' యని పిలిచెడు వారే. అది యును గాక శుకదేవుని జననియందు మీకు పత్నీభా వము కూడ కలదు. స్త్రీ లందఱు నెవరికో ఒకరికి భార్య యగు నను జ్ఞానము కూడ మీకుఁ గలదు. పరుని భార్యతో సంసర్గము కావించుట పాప మను సంగతి కూడ మీకుఁ దెలియును. అందుకనియే మీరు ఇతర స్త్రీల నందఱను పుత్రి గానో, సోదరిగానో, తల్లిగానో భావించుటకుఁ బ్రయత్నము చేయుచున్నారు. మేము స్త్రీల మైనను చిన్న పిల్లలకు భేద భావము లేనంతవఱకు ఏవిధముగాను లజ్జింపము. వానికి స్త్రీ పురుష భేదము కలుగఁగానే వాఁడు మా పుత్రుఁ డగుగాక, సోదరుఁ డగుగాక మేము లజ్జించెదము. పెద్దవార మైన తర్వాత తండ్రికి కూడ లజ్జించెదము. స్త్రీ పురుషు లను వా రిద్దరు కల రను సంగతి మీ పిల్లవానికి తెలియదు. స్త్రీ పురుష భేదమే

తెలియని వానికి స్త్రీలలో భేద మేమి తెలియఁ గలదు. అందుకనియే మేము నిశ్శంకగా స్నానము చేయు చుంటిమి. ఆతఁడు మా వైపు చూచినాఁడు కూడ. కాని యట్లే ఆతఁడు పర్వత వృక్షములను జూచి నట్లే చూచెను. ఆతని కన్నుల లో నేవికారమును లేదు; మనస్సులో భేద భావమును లేదు. మీరు మా వైపు చూడకయే వెళ్ళినప్పటికిని, మా వైపు చూచుట పాప మని తలఁచి నప్పటికిని మనస్సులో నైనను "ఈ స్త్రీ లెంతటి నిర్లజ్జలు; పురుషుఁ డగు నన్నుఁ గాంచి దిగంబరులై స్నానము చేయుచున్నారు" అని అనుకొనఁ గలరు. ప్రభో! మా యపరాధమును క్షమింపుఁడు. మీ రడిగితిరి కావున మీకు ప్రత్యుత్తర మిచ్చు ధైర్యమును వహించితిమి; లేకపోయిన మీకు చెప్పఁ గల వా రెవరు? దేవతా గురు వగు బృహస్పతి కూడ మీకు చెప్పుట కసమర్థుఁడే యగును. మీరు సాక్షాన్నారాయణులు మా ప్రత్యుత్తరములో నేదైన నవినయము కలిగినచో మీరు దానిని మీ యుదార భావముచే క్షమించి మా కభయదాన మీయవలయును" అనిరి.

దేవాంగనల యొక్క యీ ప్రత్యుత్తరమును విని వ్యాసుఁడు లజ్జితుఁడును, ప్రసన్నుఁడు నయ్యెను. ఈ యప్స రసలు నా ప్రశ్న కెట్టి మృదు మధుర భాషలో నోరు తెఱచు కొని ప్రత్యుత్తర మిచ్చినను లజ్జయు, నా పుత్రుఁ డెంతటి నిర్వికారుఁ డను సంతోషమును ఆయనకుఁ గలిగెను. సమస్త ప్రాణుల హృదయము సందును ఆతని సమత్వ మెట్లు హత్తు కొనినది? ఎవనికిని ఈతని వలన నుద్వేగము కలుగదు. అని అనుకొనుచు వ్యాసుఁడు ముందుకు సాగిపోయెను. దేవాంగ

నలు కూడ ఆతనికి భక్తి పూర్వకముగఁ బ్రణామము కావించి స్వర్గమునకు వెళ్ళిపోయిరి.

కాఁబట్టి, సూతా! ఇట్లు శుకదేవుని విషయములో మేము భేదభావ విరహితత్వమును గూర్చియు సమదృష్టిని గూర్చియు వింటిమి. ఆతని తండ్రి ఆతని వెనువెంట 'పుత్రా! పుత్రా!' యని పిలుచుచుఁ బరువెత్తుచుండ నాతఁడు వనము లోని సమస్త వృక్షములచేఁ దన తన్మయత్వమును జూపించుచు 'ఓ' 'ఓ' యని ప్రత్యుత్తర మిచ్చునట్లు చేసెను. సమస్త వృక్షముల నుండి ప్రత్యుత్తరమును బొంది వ్యాసుఁడు పుత్ర విషయకమగు తన శోకమును వదలి పెట్టెను. తన పుత్రుఁడు సర్వ భూతాత్మ యని యాతఁడు గ్రహించెను. ఆతఁడు సమస్త ప్రాణులలోఁ దననే చూచుచుండును. తనలో నన్ని ప్రాణులను జూచుచుండును. ఇట్లు సమస్త భూతాంతరాత్మ యగు వ్యాసనందనుఁ డగు ( ) శుకమహర్షి ఈ మహాభక్తి వర్ధకమగు గ్రంథము నెట్లు చదివెను? ఆతని కాబుద్ధి యెట్లు కలిగినది. ఆతఁడు తన జ్ఞాన వైరాగ్యమును మఱచి నిరత పారనమందేల ప్రవృత్తుఁ డయ్యెనో? ఇది మా రెండవ ప్రశ్న.

విప్ర శాపమున శాపితుఁడై గంగాతీరమున నన్న జలములను వీడి మునులచేఁ జుట్టుకొనఁ బడియుండిన పరీక్షిన్మహారాజునకు శుకుఁ డేడు దినములలో నీ భాగవత కథను వినిపించె ననియు, దానిని విని యా రాజు ముక్తుఁ డయ్యె ననియుఁ జెప్పితివి. ఈ విషయములో గూడ మాకు చాల శంకలు కలవు.

అసలు ముందు సంగతి, అక్కడ అందఱును పరమ హంసయగు శుకదేవుని ఎట్లు గుర్తించిరి? ఏలననఁగా నాతనికడ సాధుత్వ, బ్రాహ్మణత్వ జ్ఞానత్వములకు సంబంధించిన బాహ్యచిహ్నము లేవియు గానిపింపవు. ఇంతే కాదు, అందఱును మఱపించుటకును, తా నెవరికిని దెలియ రాకుండు టకును ఆతఁ డున్మత్తునివలె వేషమును వేసికొనియుండెను. ఆతఁడు గొప్ప జ్ఞానియు, మహావక్తయు నైనప్పటికిని ఆతని నేదైన ప్రశ్నించినఁ, గన్నులు తెఱచుకొని ఊఁ ఊఁ యను చుండును. ఆతనికి మాటలాడుట చేతగానట్లును, మూగవాఁ డైనట్లును నటించును. ఆతని చర్చ విషయములో నాతఁడు తన జ్ఞానమును దాఁచుకొని అజ్ఞానుల వలె నాచరించును. ఈతఁడే వ్యాసాత్మజుఁడగు శ్రీశుకుఁ డని యీ కురుజాంగల దేశవాసుల కెట్లు తెలిసినది ?

ఇక రెండవ విషయము. పరీక్షిత్తునకు, శుకునకు నీ సంవాద మెట్లు జరిగినది? ఇంతటి గొప్పకథను ఆతఁడు రాజు అడుగఁగానే యెట్లు చెప్పెను? రాజు అధికారిగ నెంచి చెప్పి యుండవచ్చునని మీ రనవచ్చును. మంచిదే, కాని యింకను నాశ్చర్యకర మగు విషయ మేమి యనఁగా శుకదేవుఁ డేడుదినము లొక్కచోట యెట్లు నిలిచెను ? శుకదేవుఁడు గృహస్థుల యిండ్లలోఁ గేవలము భిక్షఁ గైకొను టకు వెళ్లుననియు; నక్కడ నైనను ఆవును బాలు పితికినంత సేపే యుండుననియు వినియుంటిమి. అదియైనను భిక్షాలోభ ముచే వెళ్ళఁడనియు, కేవల మా గృహస్థులను కృతార్థులఁ గావించుటకు వెళ్లుననియు వింటిమి. గృహస్థుల యిండ్లలో

రాత్రింబవళ్ళు శోకమోహములు వ్యాపించుననియు, నొకఁడు చచ్చుటయు, ఒకఁడు దుఃఖించుటయు, వేఱొకఁడు జబ్బుతో నుండుటయు, నింకొకఁడు చెడ్డ వాసనలచేఁ బాపమును చేయుటయు, భ్రూణహత్య, ఆత్మహత్య, పశుహత్యాదులు జరుగుచుండు ననియు, నీ సమస్త ఆధివ్యాధి పాపములచే గృహస్థుల యిండ్లు నరక సమానులుగఁ బాపాలయము లగు ననియుఁ దెలిసినదే. ఈ గృహములకు మహాత్ములు, సిద్ధపురుషులు, అవధూతలు, జ్ఞానులు భిక్షార్థ మను వంక బెట్టుకొని రాకుండు నెడల నివి పవిత్రము లెట్లగును? అట్లే యుండిన నవి నరక సమానము లగును. ఆ దీన చిత్తములు గల గృహస్థులపై దయయుంచియే శ్రీ శుకుఁడు వారి ద్వార ములకు వెళ్ళును. అచ్చట కొందఱతనికి సత్కారము కావింతురు. కొందఱు తిరస్కారము కావింతురు. ఆతఁడు రెంటెని సమానముగ నెంచుకొని నగర గ్రామములను కృతార్థము కావించుకొనుచు సదా నారదునివలెఁ దిరుగు చుండును. అట్టియెడ నేడుదినములు పరీక్షిత్తుదగ్గఱ గంగాతటమున నాతఁ డెట్లుండెను?

మీరింకొక విషయము గూడ చెప్పితిరి. పాండవ పౌత్రుఁడు, అభిమన్యు సుతుఁడు పరీక్షిన్మహారాజు గంగాతీర మున నామరణాంతము నిరాహారదీక్షతో నుండి రంటిరి. ఇది అంతకంటె నాశ్చర్యకర మగు విషయము. ఆ రాజు చాల ధర్మాత్ముఁడు, కులీనుఁడు, వంశానురూప మైనది. ఆతఁడు పాండవుల కీర్తిని దేశవ్యాపినిగాఁ జేసెను. ఆతఁ డశ్వ మేధాది గొప్ప గొప్ప యజ్ఞములను గావించెను. నల్దిక్కు

లను జయించి యాతఁడు తన సామ్రాజ్యము ను వృద్ధి కావించి యుండెను. ఆతఁడు తన పరాక్రమముచే సమస్త నరపతులకు మకుట మణి యయ్యెను. ఆతని చరణములందు దేశ విదేశ ములలోని అగణిత నృపతిగణము వచ్చి తమ ముకుటములతోఁ బ్రణామము కావించు చుండెడువారు. ఈ సామ్రాట్టునకు మామీఁద దయాదృష్టి కలుగుఁగాక! అది మాకు కల్యాణ భాజన మగుఁగాక యని యనుకొనుచుండెడువారు.

సాధారణముగాఁ జూచిన ధర్మాత్ముఁ డగు రాజు సమస్తైశ్వర్యము లనుభవించి, ముసలితనము రాఁగానే వైరాగ్యము చెందును. అప్పుడు రాజ్యము, బంధువులు, దారాపుత్రులమీఁద వారికి ప్రీతి యుండదు. వారు సమస్తమును విడిచి, యేదైనఁ బుణ్యక్షేత్రమునకు వెళ్ళి ఆ పావన తీర్థస్థలము లందు తపస్సు నందును, వ్రతోపవాసము నందును నిరతు లగుచుందురు. కాని పరీక్షిన్మహారాజునకు మేము చూచితిమి. ఆతని రాజ్యకాలములోనే మే మీ సత్రయాగ దీక్షను గైకొంటిమి. ఆతఁ డింకను యువకుఁడు. ఆతఁడు రాజ్యభోగము లైనను జాల దినములు భోగింపలేదు. ఆతఁడు మిక్కిలి పరాక్రముఁడు. ఆతని క ప్రాప్య మగు పదార్థమే లేదు. ఆతని శరీరము సుందర మైనది, నిరోగ మైనది. రూపవంతము, దివ్యము నైనది. ఆతని పట్టపురాణి పతివ్రత, వీర వనిత, కులీన, సత్స్వభావ. ఆతని పుత్రులు జనమేజయాదు లందఱును సుయోగ్యులు, పితృభక్తులు, సర్వగుణ సంపన్నులు, శూరులు, సచ్చరిత్రులు. ఈతని రాజ్యము సముద్రపర్యంత ముండినది. అంతట నృపతిహాత మగు నాజ్ఞయే. ఈ సమస్త

దుస్త్వజ పదార్థములమీఁది మోహమును తృణముగ వదలి వేసి యాతఁ డా సర్వగుణసంపన్నమును, సర్వోపయోగకర మగు శరీరము నేల త్యాగము కావించెను ?

ఇది మన శరీరము. దీనిని మనము వదలివేయఁగల మనియు, నిచ్ఛ యుండిన నుంచుకొనుటయు, లేకున్న ద్యాగము చేయుటయు కలదనియు, నిందులో నితరుల ప్రమేయ మే మున్నదనియు మీరనవచ్చును. ఈ విషయము సాధారణ మానవుల విషయములో నైతే కావచ్చును గాని పరోపకారియు, అనేక జీవుల కుపకారముగనుండు వాని శరీరము తమది కాదు. అది సార్వజనికవస్తువు. దానిని రక్షించుట సార్వజనిక సంపత్తిని రక్షించుటయే. దానిని వారు స్వేచ్ఛగా వదలుటకు స్వతంత్రము లేదు. ప్రతి జీవికి దాని మీఁద నధికారము కలదు. అట్టియెడ దాని నెట్లు నాశము చేసికొనఁగలఁడు? అతఁడు ప్రజాపరతంత్రుఁడు. ఆ చక్రవర్తి కల్పవృక్షము వంటివాఁడు. పరమ భగవద్భక్త భాగవత శిరోమణి. ఆతని మూలమున పృథ్విలోని చరాచర జీవుల కుపకారము కలుగుచున్నది. ఆతఁ డుపవాసమును జేసి ఆ సమయమున నీ శరీరము నేల త్యాగము కావించినాఁడు? ఆతని జన్మ యెట్టిది ? ఆతఁ డెట్టి ప్రసిద్ధ ప్రశంసనీయమగు కార్యములు చేసినాఁడు ? ఆతఁడు పరమ మహాత్వకార్యము లేమి చేసినాఁడు ? ఆతఁడు బ్రాహ్మణులకుఁ బరమ భక్తుఁడు. అట్టివాని కేదో ఒక బ్రాహ్మణుఁడు శాపము నేల యొసంగెను ? శాపము విషయమును విని యాతఁ డేమి చేసెను ?

ఈ సమస్త విషయములకును మీరు మాకు యథార్థమగు ప్రత్యుత్తర మీయవలయును.

మీ యిన్ని ప్రశ్నలకు నేను ప్రత్యుత్తర మెట్లీయఁ గలను ? నా యందంతటి విద్యాబుద్ధు లెక్కడివని మీ రన వచ్చును. కనుక నూతా ! మీ విద్యాబుద్ధుల విషయము మాకు బాగుగాఁ దెలియును. వేదాధికారము ఋషులు మీ కీయలేదు. అందువలన నొక్క వేదము తప్ప మిగిలిన ధర్మ శాస్త్ర, పురాణేతిహాసాది ఆఖ్యానము లేవి కలవో వాటి అన్నిటియందును మీరు నిష్ణాతులు. నిస్సందేహముగ మీరు వానిలోఁ బారంగతులు. మా ప్రశ్నలకు ప్రత్యుత్తర మీయఁ దగినంతటి యోగ్యత కలదు. అందువలననే మేము మిమ్మల నడుగుచున్నాము. మా ప్రశ్నల కన్నిటికిని యథార్థములగు ప్రత్యుత్తరము లిండు'' అనెను.

ఛప్పయ

సుత అభిమన్యు నృపాల, ఉత్తరా కే సుఖ దాతా ।
పాండు వంశ కే బీజ్, దీన దుఃఖియోం కే త్రాతా॥

చింతామణి కే సదృశ సబనికీ చింతా హరతే।
కల్పవృక్షకీ భాఁతి కామనా పూరన కంతే॥

భరత ఖండ కీ ప్రజా కా, సుత సమాన పాలన కియో।
న్యాసభూత నిజ దేహకో, తృణ సమాన క్యోఁ తజిదియో॥

## అర్థము

అభిమన్యుని కుమారుఁడు తల్లియగు ఉత్తరాదేవికి సుఖముల నిచ్చినవాఁడును, పాండువంశమునకు బీజమువంటి వాఁడును దీన దుఃఖులను రక్షించినవాఁడును, చింతామణితో సమానముగ నన్నికోరికల నిచ్చువాఁడును, అందఱియొక్క చింతలను హరించువాఁడును, కల్పవృక్షము వలె సమస్త కోరికలను బూర్ణముచేయువాఁడు నగు పరీక్షిన్మహారాజు భరతఖండములోని ప్రజలను బిడ్డలవలెఁ బరిపాలించినాఁడే! అట్టివాఁడు తన శరీరమును దృణమువలె నేల త్యజించి వేసెను?

# శ్రీ వ్యాసుఁడు

శ్లో॥ ద్వాపరే సమనుప్రాప్తే
తృతీయే యుగపర్యయే।
జాతః పరాశరాద్యోగీ
వాసవ్యాం కలయా హరేః॥ *

(శ్రీమద్భాగవతము ౧ స్కం. ౪ అ. ౧౪ శ్లో.)

ఛప్పయ

లీలా అమిత అపార పార ప్రాణీ నహీఁ పావేఁ।
వివిధ రూప సే ఉతరి అవనిపై అచ్యుత ఆవేఁ॥
శూకర సింహ సరూప మీన కచ్ఛప వపు ధరతే।
అంశ కలా అవతార ధారి భక్తని భయహరతే॥
సత్యవతీ, ముని పరాశర, ద్వాపర యుగమేఁ ధన్య హైఁ।
విష్ణురూప శ్రీ వ్యాసజీ, జినకే తనయ అనన్య హైఁ॥

అర్థము

భగవంతునియొక్క లీలలపారములు. వాటిని ఎవరును దాఁటలేరు. అనఁగాఁ దెలియఁజాలరు. భగవంతుఁడగు విష్ణువు వివిధ రూపములను ధరించి భూమిమీఁదకు వచ్చెను. మత్స్య, కూర్మ, వరాహ, నృసింహాది రూపములను ధరిం

---

* కృత, త్రేత, ద్వాపర, కలియుగములను నీ మహాయుగములో మూఁడవది యగు ద్వాపర యుగములోఁ బరాశరమహర్షియొక్క వీర్యమున వాసవీసత్యవతీదేవియందు శ్రీ మహావిష్ణుని అంశభూతుఁడగు వ్యాస భగవానుఁ డుద్భవించెను.

చును. ఇవి కాక అంశ, కళావతారములను ధరించి భక్తుల భయమును హరించును. ద్వాపరయుగములో విష్ణు స్వరూపుఁడగు (శ్రీ) వ్యాసభగవానుఁడు తనయుఁడు గాఁగల సత్యవతీ పరాశరులు ధన్యులు.

ప్రతి కార్యమునందును గారణము దాగియుండును. ఏ కారణమువలన నైనఁ గార్యము ప్రకటము కాఁగానే లోకులు వివిధము లగు వాద వివాదములు కావించుచుందురు. కొందఱు దానిని అకస్మాత్తుగఁ జెప్పుదురు. కొందఱు వెంటనే చెప్పుదురు. కొందఱు దైవేచ్ఛ యనుచు మన స్సమాధానము చేసికొందురు. అజ్ఞానులు కారణమును దెలిసికొనక మోహితు లగుచుందురు. జ్ఞాని అన్నిటికిని కారణమును దెలిసికొనును. కావున నాతఁడే కార్యమువలనఁ గాని అసంభవ మని చెప్పఁబడు ఘటనము చేతను మోహమును బొందడు. నిజము చెప్పవలసి వచ్చిన ప్రపంచములో నకస్మాత్తనునది లేదు.

ఒక బీజమును మనము నాటితిమి. దానినుండి అంకుర ముద్భవించినది. దానికి మనము ప్రతి దినము నీరు చిలకరించుచు నీరు పెట్టెదము. ఒక దినమునఁ బ్రభాతమున లేచి చూచునప్పటికి దానికి పూలు పూచియుండును. మనము దానిని గాంచి ఆశ్చర్య చకితుల మగుదుము. ఇంకా కొన్నాళ్ళకు చూచిన దాని కొక కాయ గూడ పుట్టినట్లు తెలిసికొనఁగలము. ఈ ఫల మీ రాత్రిలోనే యెట్లు హఠాత్తుగా వచ్చినదా యని మన మాశ్చర్యచకితుల మగుదుము. అయితే

బీజముతోం బాటుగా మనము వృక్ష పుష్ప ఫలాదుల కారణ మును గూడ నాటితిమని యజ్ఞానవశమున నెఱుంగము. బీజము లోనే యివి యన్నియు నిహితమై యున్నవి. కారణము వలనం గార్యము ప్రకటము కావలయును.

ప్రాతఃకాలమున నిద్ర లేచునప్పటికి శరీరమున నొక భాగమున నొప్పి పుట్టినది. చూచుచుండఁగనే అచ్చట ఒక కురుపు లేచినది. అది హఠాత్తుగ అక్కడనుండి వచ్చిన దనుకొందుము. అది నిన్న లేదు, ఇవ్వేళనే వచ్చిన దనుకొందుము. అందువలననే పాప పుణ్యములకుఁ గారణము శరీర మని చెప్పఁబడినది. పాప పరిణామము దుఃఖము, పుణ్య పరిణామము సుఖము. పాప పుణ్యములు బీజములు. సుఖదుఃఖ ములు ఫలములు. వీటి నన్నిటిని అనుభవించి తీరవలయును. కారణము లేక కార్యము జరుగనే జరుగదు. కావున ప్రతి కార్యమునకును గారణమును విచారించినచో శంక లన్నియు దూర మగును.

శౌనకాది మును లడుగఁగా సూతుఁడు వ్యాస చరిత్ర మును జెప్పుట కారంభించెను. సూతుఁడు "మునులారా! వ్యాసదేవుని యవతారము పరాశర మహర్షి వీర్యముచే నిషాదరాజుచేఁ బెంచఁబడిన కన్య యగు సత్యవతీ గర్భము నుండి కుమారీ అవస్థలో ద్వాపర యుగాంతమునఁ గలిగెను." అనెను.

అంత శౌనకుఁడు "మహాభాగుఁడ వగు నో యుగ్ర శ్రవా! మాకు వ్యాసభగవానుని గథను విస్తారపూర్వకముగ

వినిపింపుఁడు. మహాభాగ్యవతి యగు సత్యవతి నిషాదకన్య యని యేల పిలువఁ బడెను? ఆమె వాసవీ యను పేర నేల ప్రసిద్ధి చెందినది? మహామునియు, నూర్ధ్వరేతస్కుఁ డగు పరాశర మునితో నామెకు సాంగత్యమెట్లు? ఎక్కడ కలిగెను? అవతార ప్రసూత యగు సత్యవతీదేవి విశుద్ధక్షేత్రము, విశుద్ధకులము ప్రాప్తింప నంతటి యపరాధమును బూర్వ జన్మలో నేమి చేసినది? మీరు ముందుగా మాకు వ్యాస భగవానుని చరిత్రము నున్న దున్నట్లుగ వినిపింపుఁడు; తర్వాత భాగవత కథను వినిపింపుఁడు" అనెను.

మునుల ప్రశ్నను విని యుగ్రశ్రవుఁ డగు సూతుఁడు "మునులారా! ఈ జీవుఁడు తన యుచ్చ నీచ కర్మానుసారముగ జన్మ లెత్తు చుండును. ఇదియే ప్రారబ్ధ చక్రము. దైవ విడంబన మిదియే. లీలాధారి యొక్క లీల యిదియే. ఖేలకుని ఖేలన మిదియే. మాయపతి యొక్క మాయ యిదియే. అచింత్యవీర్యుఁ డగు భగవానుని చేత లెవరికిని దెలియరావు. ఆతఁ డిట్టి కౌతూహాల పూర్ణ మగు జగత్తు నేల నిర్మించును? ఇది యాతని వినోద మని కొందఱను చుందురు. ఆ వినోదమైనను ఎన్నటికిని సమాప్తము కాని వినోదము. జీవుఁ డొక్కసారిగ నంధుఁడై దానిలోనే లిప్త మగుఁ గాక! ఈ కర్మ చక్రమే సంసారమునకు శిష్యుఁడు. ఈ పాప పుణ్యములే జీవుని అనేక యోనులలో భ్రమింపఁ జేయు చున్నవి. పాప పుణ్యములు కాయిక, వాచిక, మానసికము లని మూఁడు రకములుగ నుండును. వాటి పరిణామము కూడ సుఖ దుఃఖ రూపములలో మూఁడు రకములుగఁ బ్రకట మగు చుండును.

ప్రపంచము పుట్టుచుండును, గిట్టుచుండును. ఒక సృష్టి యుత్పత్తి యగుచుండును; వినాశము కలుగుచుండును, మరల నూతన సృష్టి యగుచుండును. నూతన సృష్టి యెక్కడనుండి వచ్చుచున్నదో, కొంచె మేనియుఁ దెలియుట లేదు. గంగలో నిత్య నూతన జలము ప్రవహించుచు వచ్చుచున్నట్లును, వృక్షములకు ఆకులు రాలిపోఁగానే మరల నూతన పత్రములు వచ్చినట్లును, ఒకసారి పండ్లు పండి రాలఁగా మఱు సంవత్సరము మరల దానికి పండ్లు కలుగుచుండునట్లును ఆ పండ్లలోనైనను అనంత ఫలముల నుత్పత్తి చేయు శక్తి యున్నట్లు, ఈ సృష్టి చక్రము తిరుగుచున్నది. ఇది యెన్నటికిని బూర్తి యగునది కాదు. జ్ఞానము ద్వారా సర్వాత్మ భావేన భగవంతుని శరణు వేఁడు నెడల నిది దాని కదియే విలీనమైపోవును.

ఋషులారా! ఈ సృష్టి సంకల్పము ద్వారా అయినది. సంకల్పముచేతనే వృద్ధి చెందుచున్నది. సంకల్పముచేతనే విలీన మగుచున్నది. దేవ, పితృ, యక్ష, గంధర్వ మనుష్యు లందఱును సంకల్పము చేతనే యుత్పన్న మగుచుందురు. ఆ సంకల్పమే స్థూలరూపము ధరించి వచ్చు నెడల దానిని 'కామ' మందురు. కామము సంకల్పమునకుఁ బుత్రుఁడే. మొదటిసృష్టి మైథునము వలనఁ గాక కేవలము సంకల్పమాత్రము చేతనే జరిగెడిది. పరస్పర అంగ సంగేచ్ఛా సంకల్పము కలుగునప్పటికి కామవశీభూతులై జీవులు మైథునములోఁ బ్రవృత్తులైరి. దీనివలన వారియొక్క సంకల్పశక్తి

విలుప్తమై పోయెను. అప్పటినుండి మైథునసృష్టి జరుగ మొదలిడినది.

పితృలోకములోఁ జాలమంది నిత్యపితరులు కలరు. ఆ పితరులలో నొకఁడు అగ్నిష్వాత్తుఁ డనువాఁడు కలఁడు. పితరులు 'అచ్ఛోద' యను నొక పవిత్రసరోవరమును నిర్మించిరి. ఆ స్థలమున నగ్నిష్వాత్త పితరున కొక మానసీకన్య యుద్భవించెను. ఆమె మిక్కిలి రూపవతి, గుణవతి, ధర్మపరాయణ. పితరు లామె కాతీర్థము పేరటనే అచ్ఛోదా యను పేరిడిరి. అచ్ఛోద తన మనస్సును తపస్సునందు లగ్నము కావించినది. ప్రపంచములో తపస్సే సార మని భావించి యామె వేయి దివ్యవర్షముల వఱకు తపస్సునే చేయుచుండెను. ఆమె తపస్సునకుఁ బ్రసన్నులై పితృగణ మామెకు వరదాన మిచ్చుటకా మె సమీపమునకు వచ్చిరి. వారందఱును దివ్యరూపమును ధరించిన నవమన్మథ సమాన సుందరులై యుండిరి. స్వర్గీయ దివ్య వస్త్రభూషణములచే వారు భూషితులైరి. వారిలో అమావసు అనువాఁ డొకఁ డతి రూపవంతుఁడు. ఆతని దివ్యరూపమును గాంచఁగానే అచ్ఛోద మనస్సులో వికార ముత్పన్నమయ్యెను. దివ్యజ్ఞాను లగు పితరు లామె మనోభావమును గ్రహించిరి. మనస్సులో వికార ముత్పన్నము కాఁగానే ఆమె తన యోగమునుండి భ్రష్టురా లయ్యెను. ఆమెకు దివ్యలోకమునుండి పతనము కలిగినది; కాని భూమి మీఁదకు రాలేదు, అంతరిక్షములోనే నిలిచిపోయెను. అమావసు మనస్సులో వికార మేమియు లేదు. ఆతఁడు ధైర్యమును వహించి యుండెను. ఆతని ధైర్యముతో నామె మాన

సిక సంకల్పము సంయోగము చెందునప్పటికి నల్లని శరీర మును ధరించి అంధకారమువంటి యొక కన్య యుత్పన్న మయ్యెను. అమావసుయొక్క ధైర్యమువలనఁ బుట్టుటచే దేవతలకును, పితరులకును పరమ ప్రీతికి కారణురా లగు అమావస్య అనునది పుట్టెను. అందువలననే అమావాస్య నాఁడు పితరుల నిమిత్తమై చేయఁబడిన శ్రాద్ధము అక్షయ మగుచున్నది. ద్విజులు అమావాస్యనాఁడు పితృదేవతల కొఱకు దార్శయజ్ఞమును జేయుచుందురు.

అంతరిక్షమున నున్న యా అచ్ఛోదకన్య తాను చేసిన దానికి సిగ్గుపడి పితృదేవతలను తన యుద్ధారమును గూర్చి ఉపాయము నడిగెను. ఆమె అడుగఁగా పితరులు "చేసిన కర్మ మానసికమైనను, శారీరకమైనను దాని ఫలము నవ శ్యము భోగింపవలసినదే. నీ మనస్సున వికార ముద్భవించి నది. అదియైనను నీ కులములోని పురుషునియెడలనే కావున నీవు ఇరువది యెనిమిదవ ద్వాపరాంతమున భూమిమీఁదఁ బుట్టవలసి యున్నది. అదియైనను హీన యోనియందు. చేప కడుపున నీవు పుట్టవలసియున్నది. అకులీన వంశమందు నీవు పాలన పోషణ కావింపఁబడుదువు. దీనివలననే నీకు పాప ప్రాయశ్చిత్తము కాఁగలదు. అయితే నీ గర్భమునుండి భగ వంతుని యంశావతార మగు వ్యాసుని జన్మము కలుగును. కావున నో ఋషులారా! ఆ పితృదేవతల కన్య యగు అచ్ఛోదయే సత్యవతీ యను పేర నీ భూమిమీఁదఁ బుట్టి వాసవీ యను పేరఁ బ్రసిద్ధి చెందినది" అని చెప్పిరి.

ఋషులు "సూతా! సత్యవతీ వాసవీ యను పేర నెట్లు బరగినదో దీని తత్త్వమును మాకుఁ దెలుపుఁడు." అని అడిగిరి.

ఋషు లడుగఁగా సూతుఁడు "మునులారా! ఆర్య సంస్కృతియందు సాధారణముగ నామము సార్థకముగ నుండును. అవి వంశ సంబంధముగ నైన నుండును, లేదా వీర్య, పరాక్రమ, కర్మల ద్వారాగా నైన నుండును. సత్యవతికి వాసవీ యను పేరు కూడ ఆమె కులపరంపరకు సంబంధించినదియే.

ద్వాపరయుగములో నొక గొప్ప ధర్మాత్ముఁడు, పరాక్రమవంతుఁడు, పితృదేవ పూజకుఁడు 'వసు' వను రాజుండెను. ఆతని భార్య కూడ మిక్కిలి యశస్విని, ధర్మపరాయణ, పతివ్రత. ఒక దినమున నామె ఋతుస్నానము కావించి వచ్చెను. సంతానాపేక్ష కలిగిన యా రాణి తన పతియందు మిక్కిలి యనురక్తి చెందినది. రాజు కూడ ఆమెను జాల ప్రేమించుచుండెడువాఁడు. ఆదినముననే దైవయోగముచే రాజు పితృకార్యమునకు మేధ్యశవ్యమును దెచ్చుటకు ఘోర వనమునకు వెళ్ళవలసి వచ్చెను. మహారాజు కర్తవ్యవశమున వనమునకు వెళ్ళిపోయెను, కాని యాతని మనస్సు తన భార్య యందే లగ్నమై యుండెను. అరణ్యములో శ్రమ చెంది యాతఁ డలసిపోయి, యొక వృక్ష చ్ఛాయయందు తన ప్రియతమ యగు రాణిని జింతించుచుఁ గొంచెముగ నిద్రించెను. ఆ స్థితిలో నాతని వీర్యము స్ఖలన మయ్యెను. ఆ రాజర్షి అమోఘ వీర్యుఁడు. ఆతని వీర్య మెన్నటికిని వ్యర్థ మగునది కాదు.

అగ్నివలె జ్వాజ్వల్యమాన మగు నా శుక్రమును రాజొక దొన్నెలో నుంచెను. సమీపముననే ఒక డేగ కూర్చుండి యుండెను. దానితో నా రాజు "ఓ పక్షీ! నీవు శీఘ్రముగ నెగిరిపోవ నున్నావు. నా యీ యమోఘ వీర్యమును వ్యర్థము కాకుండు నుపాయమును గావింపుము. దీనిని శీఘ్రముగఁ దీసికొనిపోయి నా మహారాణి కొసంగుము" అనెను.

ఇట్లు చెప్పఁగా నా పక్షి రాజాజ్ఞచే నా వీర్యము గల దొన్నను ముక్కుతోఁ గఱచుకొని, ఆకాశమార్గమున నెగిరి వెళ్ళెను. ఈ సమయమును గాంచి యంతరిక్షమున నున్న యా అచ్ఛోద ఆ వీర్యములోఁ బ్రవేశించెను. రాజర్షి యొక్క విశుద్ధ వీర్యమందే యిట్టి దివ్యకన్య యుండఁగలదు. ఆ పక్షి ఆ దొనెను దీసికొని ఆకాశ మార్గమున వెళ్ళుచుండఁగా నింకొక డేగ దానిని మాంసపు ముక్కగా భావించి కొట్టివే యుటకు బ్రయత్నించెను. రెంటికిని పరస్పర యుద్ధము జరిగెను; ఈ యుద్ధములో నా దొనె గంగలోఁ బడిపోయెను. అక్కడ నొక చేప దానిని మ్రింగెను. రాజర్షి వీర్య మెచ్చటికి పోయినను వ్యర్థ మగునది కాదు. అది చేప కడుపులో నొక కన్యక అయ్యెను.

దైవగతి, పైకి రావలసి యున్నది కావున నా చేప పల్లెవాండ్ర వలలోఁ బడెను. ఆ పొట్టను కోసిరి. దానిలో నుండి యొక పరమ సౌందర్యవతి యగు కన్యక యుద్భవించెను. పల్లెరాజు ఆమెను దన పుత్రికగా భావించి పెంచుచు నామెకు సత్యవతి యను పేరు పెట్టెను.

శుక్లపక్ష చంద్రుని రీతి నా కన్యక దిన దినాభి వృద్ధి చెందుచుండెను. ఆమె యనిన నామె తండ్రికి మిక్కిలి ముద్దు. తండ్రి యామె సుందర స్వరూపమును, ఆమె శీలస్వభావమును, ఆమె అమాయకత్వమును గాంచి లోలోన మిక్కిలి యానందమును చెందుచు, నామెను దన ప్రాణముల కంటె నెక్కుడుగఁ బ్రేమించెడువాఁడు. ఇంకఁ గొంచెము పెద్ద దగు నప్పటికి ఆమె యొక చిన్న నావను నడుపు చుండెను. యాత్రికులను గంగలో నీవలి యొడ్డునుండి యావలి యొడ్డునకు దాఁటవేయు చుండెను. ఆమె అందఱకును మిక్కిలి ప్రీతి పాత్రు రా లయ్యెను. అందఱు నామెయొక్క సరళ మగు బిడియ స్వభావమునకు సంతుష్టి చెందుచుండెడువారు. ఆమె రూప లావణ్య మద్వితీయ మైనది. ఆమె మర్త్యలోకములోని కన్యకగాఁ గనఁబడుట లేదు. పుణ్యక్షీణము కాఁగా దేవలోకమునుండి వచ్చిన దేవకన్యకయో లేక విద్యాధరియో భూమిమీఁదకు దిగినదా యను నట్లుండెను. ఆమె పెద్ద దగు కొలఁది ఆమె సౌందర్యము కూడ వన్నె కెక్కుచుండెను.

ఆమెకు తెలియకయే యౌవన మామె శరీరమునఁ బ్రవేశించెను. తండ్రికి ఆమె వివాహచింత కలిగెను. ఈమె క్షత్రియ వీర్యమువలన నుద్భవించినది. ప్రపంచములో నద్వితీయ రూపలావణ్యవతి. కావున నీమె యెవరైన చక్రవర్తికి పట్టపు రాణి కావలె నని యాతని కోరిక. పుత్రికకు మంచి సంబంధము లభింపవలె ననియే సత్పితకు కలుగు నేకైక వాంఛ. తండ్రి యీ చింతలో మునిఁగిపోవు చున్నాఁడు. కాని సత్యవతి కీ ప్రపంచపు గోడే తెలియదు. ఆమె పక్షివలె

నౌకమీఁద రెండు దండములతోఁడను జలములో పక్షివలె యెగిరి పోవుచున్నదా యనునట్లు నావ నతి శీఘ్రముగ నడుపుచుండెడిది. గంగా ప్రవాహములో నామె నిశ్శంకతో రాజహంసిని వలె నీదుచుండెడిది. గట్టుమీఁద పెంపుడు లేడివలె నేకాకిగ నిటునటు గంతు లిడుచుఁ దిరుగు చుండును. ఆమె పావన గంగా సలిలము లందు అలసిపోయి పడుండును. ఒక్కొక్కప్పుడు కూనరాగములు కూడ తీయు చుండును. నిభృత నికుంజములలోఁ గూర్చుండి యామె పక్షులతో నాడు చుండును. ఆమె చిలిపి స్వభావ మింకను చిలిపిగ నయ్యెను. ఆమె మనస్సు ఏదో అవ్యక్త భాషలో నేదియో నవీన విషయములను జెప్పఁ దలఁచుచున్నదా యను నట్లుండెను. కాని యామె ఆ భాషను దెలిసికొనఁ జాలకుండెను. ఆమె యింకను ఆటపాటలలోనే మునిఁగి యుండెను. తన చిన్న నౌక, రెండు తెడ్లు, గంగ ఇవియే ఆమె మనోరంజనమునకును, దైనిక వ్యాపారమునకును సాధనము లయ్యెను. గంగయొక్క యీవలి యొడ్డు, ఆవలియొడ్డు యివియే ఆమెకు ప్రపంచము. గంగాతీరమున నున్న పూరిల్లే ఆమె సంపత్తు. వృద్ధుఁ డగు తండ్రియే ఆమెకు సమస్త పరివారము.

గ్రీష్మఋతువు వెళ్ళిపోయినది కాని యింకను దాని తీక్ష్ణత మిగిలియే యున్నది. వర్షఋతువు వచ్చినప్పటికిని నది యింకను బాల్యావస్థలోనే యుండెను. భగవానుఁ డగు భువన భాస్కరుఁడు తన తీక్ష్ణ కిరణావళిచే లోకమును దప్తము కావించి అస్తాచలమునకు ద్రుతగతితో వెళ్ళుచుండెను. మరీచిమాలియొక్క ముఖము మ్లాన మగుచుండెను. క్షీణతేజుఁ

డగు పూర్ణిమాచంద్రుఁడు చాల పరీక్షించి చూచిన మస కగా ధూళిధూసరిత మైనట్లు కాంతి లేక కనఁబడుచుండెను. ఆ సమయమున రేవు దగ్గఱకు పరాశర మహాముని వచ్చెను. నిషాదరాజు మునిని బూజించి యథోచిత ఆదర సత్కార ములు కావించెను. ముని త్వరగా "నే నావలి యొడ్డుకు పోవుదును" అనెను.

చేతులు జోడించి నిషాదుఁడు "స్వామీ! నేఁ డిచ్చ టనే విశ్రమించుఁడు. రేపు సుఖపూర్వకముగ దాఁటి పో వచ్చును. ఈ సమయము ఆవలి యొడ్డునకు పోవలసిన సమ యము కాదు" అనెను.

"కాదు, నేను వెళ్ళితీరవలసినదే" అని అనెను. ఋషి వాక్యములలో దృఢత్వము కలదు. ఋషి నిశ్చయమును దెలిసికొని వృద్ధుఁ డగు నిషాదుఁడు "అమ్మాయీ! ఋషిని ఆవలకు దాటించి రమ్మ" అనెను.

తన తండ్రి యాజ్ఞ ననుసరించి, యామె తన లోహపు కడియములను రెండింటిని దీసికొని వాటిని ఛిద్రములందు యథాస్థానమున నమర్చెను. వానిలో వెడల్పాటి తెక్కల తెడ్ల నమర్చి నౌకను ఒడ్డునకు లాగుకొని వచ్చెను. తటము నకు నెట్టి కొయ్యపలకను వేయఁగా ఋషి యా కొయ్య పలక మీఁదుగా నౌకమీఁద కెక్కి కూర్చుండెను. సత్యవతి తెడ్డు వేయఁ బ్రారంభించినది. గంగానది యొక్క ప్రబల వేగ మును జించుకొనుచు జక్రమువలె నౌక ప్రవాహము దిక్కు నకే కొట్టుకొని పోవుచుండెను. సత్యవతి బలముకొలఁది

ప్రవాహమునకుఁ బ్రతికూలముగ నడుపఁ దలఁచెను. చాల గట్టిగా త్వరితగతిని తెడ్లను నడిపి విసుగుఁ జెందుచుండెను. ఆమె ముఖమండల మందు గాఢముగ నరుణిమా కాంతి వ్యాపించెను. శ్రమ కారణమున నామె ముఖమండలము మీఁద చెమట బిందువులు వ్యాపించెను. ఆమె ముఖ లలాటము లందు వ్యాపించిన చిఱుచెమట బిందుకణములు వికసించిన కమలము మీఁద ముత్యాలు చల్లినట్లుండెను. ఋషి తదేక దృష్టితో నా వైపునకే చూచుచుండెను. ఆమె తొందఱను, హస్తలాఘవమును, పటుత్వమును గాంచి ముని లోలోన ముగ్ధుఁ డగుచుండెను. ఆతఁడు "నీకు జనమును దాఁటించుట చాల శ్రమ యగుచున్నట్లున్నది, ఎందులకు?" అనెను.

"ఏమి చేయుదును? స్వామీ! ఇది మా పైతృక సంబంధ మగు వృత్తియైనది" అని సత్యవతీదేవి సరళతాపూర్వకముగ నౌకను నడుపుచు ననెను.

"ఈవిధముగ నీ యొడ్డునుండి యా యొడ్డునకు ఎన్ని సార్లు నీవు రాకపోకలు జరుపవలసి యుండును?" ఈ వ్యర్థ ప్రశ్నను ఆ ముని యెందుల కడిగినాఁడో ఆయనకే తెలియవలెను.

ఆమె ఆలోచింపకయే "ఎన్నిసార్లో లెక్క లేదు. పది తడవలు, ఇరువది తడవలు, వేయేల యెప్పుడు యాత్రికులు వచ్చిన నప్పుడు రావలసి యుండును" అని ప్రత్యుత్తర మిచ్చెను.

ముని కొంచెముసేపు ఊరకుండెను. తర్వాత కొంచె మాలోచించి "శ్రమ యెక్కువ, ఫలము తక్కువ. నీవు వీరిని

దాటించిన నేమగును? ఈ యొడ్డునుండి యా యొడ్డునకుఁ దీసికొని పోవుదువు; ఆ యొడ్డునుండి యీ యొడ్డునకుఁ దీసికొని వచ్చెదవు. ఇది నిజముగఁ దాటించుట కానే కాదు. లోకుల నందఱను శాశ్వతముగ నిరంతరము సంసార సముద్రమునుండి దాటించు పుత్రు నొకనిని నీకుఁ బ్రసాదించెదను" అనెను.

పుత్రుఁ డనుమాట వినునప్పటికి లజ్జచే నా పిల్ల ముఖమెఱ్ఱబారెను. ఆమె తెడ్డు వేయుటను మాని అంజలి ఘటించి భయ భీత స్వరముతో "ప్రభో! దీనబంధూ! ఇదేమి? మీ రిట్లనుచున్నారు? నేను కుమారిని. నా తండ్రి స్వాధీనములో నున్న దానను. కుమారికి పుత్రుఁ డెట్లు కలుగును?" అనెను.

ఆమె యిట్లు భయభీత యగుటను గాంచి ఋషి యోదార్చుచు "ఇదిగో, చూడు. నీవు భయపడకుము! నా వాక్య మమోఘ మగును. అది వ్యర్థ మెన్నటికిని కాదు. నా తపః ప్రభావమువలన నీ కన్యాభావము దూషితము కాఁజాలదు. అది యథారీతిగానే యుండును" అనెను.

గడగడ వణఁకుచు బాలిక "సర్వసమర్థుఁడ వగు నో మునీ! కన్యాభావము దూషితము కాకపోతే కాకపోవచ్చును; గాని లోకాపవాదము వచ్చునుగదా!" యనెను.

ముని గంభీరస్వరముతో "నీ పుత్రుడు భగవానుని యంశావతారము కాఁగలఁడు. వాఁడు పుట్టఁగానే లోకాపవాద మంతయు దూరమై పోగలదు. నీవు యశస్వినియు, జగద్వంద్య యగు లోకమాతగఁ బిలువఁబడెదవు" అనెను.

సత్యవతి రెండుచేతులతో నంజలి ఘటించియుండెను. నౌక దాని కదియే ప్రవాహములోఁ గొట్టుకొని పోవుచు మధ్యలో నొక దిబ్బకు తట్టుకొనెను. ముని యా ద్వీపమందు గర్భాధాన సంస్కారము కావించెను. ఆ మహర్షి ప్రభావ మమోఘము. ఆతని శక్తి అపరిమితము. ఆతఁడు సత్య సంకల్పుఁడు. ఆ క్షణమునందే ఆ ద్వీపమందే వేదవ్యాస భగవానుఁ డవతరించెను. ఆతని జన్మకాలమున నాకాశము నుండి దేవతలు పుష్పవృష్టిని గురిపించిరి. గంధర్వులు నగారాలు వాయించిరి. స్వర్గములోని అప్సరసలు నృత్యము చేసిరి. అంతరిక్షమున విహరించు సిద్ధులు, తపస్వులు, ఋషులు, మునులు సాధుసాధు, జయజయ శబ్దములు కావించిరి.

వ్యాసుని శరీరవర్ణము అతసీ పుష్పమువలె నీలముగ నుండెను. అందువలన నాతనికి కృష్ణుఁడను పేరు వచ్చెను. ద్వీపమున నుద్భవించుటచే ద్వైపాయనుఁ డయ్యెను. వేదములను వ్యాసము కావించుటచే సందఱు ఈతనిని 'వేదవ్యాసుఁడు' అందురు. ఈ విధముగ వేదవ్యాస భగవాన్ కృష్ణద్వైపాయనుని జన్మ కలిగెను.

పుట్టఁగానే ఆతఁడు చేతులు జోడించుకొని తన తల్లితో "అమ్మా! నాకు తపస్సుమీఁదఁ బ్రీతి కలదు. మీ యాజ్ఞ యగుచో నేను తపస్సు చేయుటకు గంధమాదన పర్వతమునకు వెళ్ళెదను'' అనెను.

తేజస్వియు, నలౌకిక కాంతియుక్తుఁ డగు తన దివ్య పుత్రుని నోట నిట్టి యద్భుతవాక్యములను వినఁగానే ఆ తల్లి హృదయమున దుఃఖము పొరలివచ్చెను. ఆమె యాతనిని

ముద్దు పెట్టుకొనెను. కౌఁగిలించుకొని మూర్కొనెను. అత్యంత స్నేహమును ప్రకటించుచు నీవు మాతా పితృ మోహబంధమునఁ బడవని మీతండ్రి మొదటనే నాకు చెప్పినాఁడు. ఇంతే కాదు, సంసారములోఁ బడిపోయిన ప్రాణులను నీవు ఉద్ధరించెదవు. వారిని భవసాగరమును దాఁటించెదవు. వెళ్ళు నాయనా; సుఖముగ వెళ్ళుము. నీకు కల్యాణ మగు గాక! ఎలుకపిల్ల కన్నమునే వేయును. తపస్వికుమారుఁడు తపస్సునందే మనస్సును లగ్నము కావించును. మంగళ మయుఁడగు శ్రీహరి నీకు మంగళములను గలిగించుఁ గాక! వనదేవత లందఱు నిన్ను రక్షింతురు గాక! గంగా భగవతి నిన్ను తల్లివలె రక్షించుగాక! సరస్వతీదేవి నీమీఁద వాత్సల్య స్నేహముల ప్రకటించుఁ గాక! నీవు మోహ బంధములోఁ బడుట నా కిష్టము లేదు. కాని వెళ్ళునప్పుడు నా కొక వరదానము నొసంగి వెళ్ళుము. నే నెప్పుడు నిన్ను స్మరించిన నప్పుడు సమస్త కార్యములను వదలిపెట్టి నా దగ్గఱకు రావలయును" అనెను.

చేతులు జోడించి వ్యాసుఁడు "అమ్మా! నాకు నీ యాజ్ఞ శిరోధార్యమైనది. నీవు ఎప్పుడైనను, ఎక్కడైనను, ఏ స్థితిలో నైనను నన్ను స్మరించు నెడల నేను నా యోగ బలముచే నా సమయమును గ్రహించి త్వరితగతిని నీ సేవలో నుండెదను" అనెను. ఇట్లని, తన తల్లికి చరణ వందనము కావించి వ్యాస భగవానుఁడు గంధమాదన పర్వతమున నర నారాయణ సాన్నిధ్యమున సమ్యాప్రాస మను స్థానమున ఘోరతపస్సు చేయు చుండెను.

ఈ విధముగ భగవతీ వాసవీ సత్యవతీ దేవికి వ్యాస భగవానునకు జననియగు భాగ్యము కలుగుటచే జగద్వంద్య పదమును బొందెను. చేప కడుపునఁ బుట్టిన కారణముచే మొదట యీమె శరీరము నుండి సదా మత్స్యగంధమే ఉత్కటముగ వచ్చుచుండెడిది. అందువలన నీమెకు మత్స్యగంధి యను పేరుకూడ వచ్చినది. పరాశర భగవానుని ప్రతాపముచే నాగంధము నశించి యీమె శరీరమునుండి నూత్న వికసిత కమలముల వంటి సుగంధము రా మొదలిడెను. ఆ సుగంధ మొక యోజనము వఱకు పోవుచుండెడిది. అందువలన నీమెకు 'యోజనగంధి' యను ప్రసిద్ధి వచ్చినది. తర్వాత నీమె వివాహము భీష్మపితామహుని తండ్రియగు శంతను మహారాజుతో నయ్యెను. ఆతని వీర్యమున నీమె గర్భము నుండి భరతవంశ విస్తార కారకు లగు చిత్రాంగద, విచిత్ర వీర్యులను నిద్దరు పుత్రులు జన్మించిరి.

ఇదియే వ్యాసభగవానుని పరమ రహస్య మయ మగు జన్మకథ. వసిష్ఠభగవానుఁడు బ్రహ్మమానస పుత్రుఁడు. వశిష్ఠుని పుత్రుఁడు శక్తి; శక్తికి పరాశరుఁడును, పరాశరుని వీర్యమున సత్యవతియందు ఈ వ్యాసభగవానుఁ డవతరించెను. అందువలన నీతఁడు పారాశరుఁ డనియు, వాశిష్ఠుఁ డనియుఁ బిలువఁబడుచుండెను. ఈతఁడు అచతుర్ముఖ బ్రహ్మ. రెండు చేతులు గల సాక్షా ద్విష్ణువు. ఒకటి తక్కువగ మూఁడు కన్నులు గలిగిన సాక్షా చ్ఛంకర స్వరూపుఁడే. ఈతఁడే సమస్త జ్ఞాన దాత, సమస్త జ్ఞానమును వ్యాసోచ్ఛిష్ట మనుచుందురు. అట్టి నా గురువునకుఁ గూడ గురువైనట్టి పరమ గురు వగు వ్యాస

భగవానుని పాదపద్మములకు నా కోటి కోటి ప్రణామములు అని పలుకుచుండఁగనే సూతునకు గద్గదిక మయ్యెను. ఆ వ్యాసుని స్మరించుచునే ధ్యానమగ్నుఁ డయ్యెను.

ఛప్పయ

కమల పంకతే హోయ్, కాక విష్ఠాతే పీపర్!
మృగ మద మృగ కీ నాభి మాంస మేదాకే భీతర్॥
మోతీ ఉపజే సీప్ శంఖ హడ్డీ హీ హోవే।
వాధ పాఇకే చర్మ అశుచిత అపనీ ఖోవే॥
గుణీ గుణని తే పూజ్య హైఁ, క్షేత్ర పరీక్షా నహీఁ కహీ।
వ్యాస విష్ణు భగవాన్ హైఁ, మాతృవంశ త్రుటినహీఁ లహీ॥

అర్థము

కమలము బురదనుండి పుట్టును. కాకిపెంట నుండి రావి మొక్క పుట్టును. కస్తూరి మృగ నాభి మాంసము యొక్క మేదస్సు వలనఁ బుట్టును. ముత్యపుచిప్ప నుండి ముత్యము పుట్టును. శంఖము ఎముకయే కదా! చర్మము రాయిడిచెంది తన యశుచితను బోఁగొట్టుకొనును.

గుణము వలన గుణి పూజ్యుఁ డగుచున్నాఁడు గాని క్షేత్రము వలనఁ గాదు. వ్యాసుఁడు సాక్షాద్విష్ణు భగవానుఁడు. అందువలన మాతృవంశములోని లోపము లన్నియుఁ బోయినవి.

# వేదవ్యాసుని చింత

శ్లో॥ ధృత వ్రతేన హి మయా ఛందాంసి గురవోఽగ్నయః
మానితా నిర్వ్యళీకేన గృహీతం చానుశాసనమ్॥

తథాఽపి బత మే దైహ్యో హ్యాత్మా చైవాత్మనా విభుః।
అసంపన్న ఇవాభాతి బ్రహ్మవర్చస్య సత్తమః॥♦

(శ్రీమద్భాగవతము ౧ స్కం. ౪ అ. ౨౮-౩౦ శ్లో.)

ఛప్పయ

బదరీ బనమేఁ బసై కసైఁ తను వ్యాసమహాముని।
నిత్య హావన కరి వేద, శాస్త్ర ఇతిహాస పఢేపుని॥

ఋక్, యజు, సామ, అథర్వ, ఏక కే చారి బనాయే।
చారోఁ శిష్య బులాఇ, వేదక్రమ యథా పఢాయే॥

శూద్ర, నారి, వ్రతహీనద్విజ, హిత భారత రచనా కరీ।
తఊ శాంతి మన నహిఁ లహీ, అంతరాత్మా నహిఁ భరీ॥

అర్థము

వ్యాస మహాముని బదరీవనములో నివసించుచు బాగుగా శరీరమును గర్శింపజేసి నిత్యహావనమును గావించుచు వేద శాస్త్రేతిహాసములను జదివెను. ఒకే వేదమును

---

♦"నేనునిష్కపటు భావముతో సమస్త నియమములను బాలించితిని. వేదమును, గురుజనులను, అగ్నులను సమ్మాన పూర్వకముగ సేవించితిని, అయినప్పటికిని బ్రహ్మతేజ సంపన్నులలో సర్వశ్రేష్ఠుండనను నా దేహాభిమాన మగు నాత్మ అసంతుష్టమైనట్లుగ నెందుచున్నదో, నాకు కొంచెము భయముగా నెందు చున్నది!" అని వ్యాస భగవానుఁడు తన మనస్సులోఁ దర్కించుకొను చుండెను.

ఋగ్యజుస్సామాథర్వములుగ విభజించెను. తన నలుగుర శిష్యులను బిలిచి క్రమముగ వేదమును బఠింపఁజేసెను.

శూద్రులకు, స్త్రీలకు వ్రతహీన ద్విజులకు హితము చేయవలెనని మహాభారత రచనమును గావించెను. దానిచే నాతనికి మనస్సులో శాంతి లభింపలేదు; అంతరాత్మ ప్రసన్నము కాలేదు.

బయట నేత్రములను మూసిననే లోపలివి కనఁబడును. బాహ్యవిషయముల నుండి చిత్తమును దొలిగించిననే పరబ్రహ్మమందు వృత్తి యేకాకారమగును. తాను శరీరబాధలను సహించిననే యితరులకు సౌకర్యమును గలిగింపవీలగును. శ్రీకృష్ణ గుణగానము చేతనే శాశ్వత శాంతి లభించును. ధర్మ కర్మల వలన యశస్సు, ఐశ్వర్యము, లక్ష్మి ప్రాప్తి కలుగును, కాని వాసుదేవ భగవానుని పాదపద్మములందు చేయఁబడిన భక్తి ప్రాణులను గృతకృత్యులను కావించును. ఇంక మానవునకుఁ గర్తవ్యకార్య ముండదు. అప్పుడు వానికి నిర్వేదము చెందవలసిన పనిలేదు. అతఁడప్పు డానంద సాగరములో మగ్నుఁడగును. భక్తిలేని జప, తప, యజ్ఞ, పూజా, పాఠ, దాన, ధర్మాది సమస్త శుభకర్మలు వ్యర్థములు. వాటి ఫలములు లౌకికములు; లేక దివ్య సుఖభోగ మాత్రములే.

భక్తిపూర్వకముగఁ జేసిన తపస్సు అంతఃకరణమును విశుద్ధము కావించును. దానియందు భగవద్దర్శన మగును. నందనందనుఁడు దాని మీఁద విరాజిల్లఁగా నాప్రకాశము

నల్దిశల వ్యాపించును. శ్రీహరి హృదయములో నుదయింపఁ గానే అజ్ఞానాంధకారము నశించును. కామ, క్రోధ, లోభ, మోహము లను గుడ్లగూబ లెగిరిపోవును. ఇదంతయుఁ దెలిసి కొనియే లోక శిక్షణ నిమిత్తము వ్యాసభగవానుఁడు తన తల్లి యాజ్ఞనుగొని, యాకల్పాంతము నివసించుచు నరనారాయణులు ఘోర మ్మృదు తపస్సు చేసిన గంధమాదన పర్వతమునకుఁ బోయెను.

బదరీ వనములో దేవసరిత్తగు సరస్వతీ, అలక నందా నదులు కలియు చోటును కేశవ ప్రయాగ అందురు. దానికి ఉత్తరమున నున్న భూమికి "శమ్యాప్రాస" మందురు. ఆ స్థానమునఁ బర్ణ కుటీరమును నిర్మించుకొని వేదవ్యాస భగవానుఁడు తపస్సు చేయఁగా జేయఁగా జాల దినములు గడచి పోయెను.

ఒక దినమున భగవంతుఁడగు భువన భాస్కరుఁడు తన సుఖకర కిరణములతో నుదయించి జగత్తు నాలోకితము కావించు చుండెను. ఆ సమయమున వ్యాస భగవానుఁడు కేశవ ప్రయాగకు వెళ్ళెను. పుణ్య సలిల యగు సరస్వతి అత్యంత వేగముతో, దన సోదరి యగు అలకనందతోఁ గలియు చుండెను. ఆ యిద్దర హృదయములు ద్రవీభూతము లగు చున్నట్లును, ఇద్దర కన్నుల నుండి యశ్రుధారా ప్రవాహము వచ్చు చున్నట్లును, ఇద్దర ప్రేమాశ్రు కణము లెగిరి యొడ్డునకు వచ్చుచున్నట్లు, వ్యాసులవా రా సంగమమును గాంచిరి. క్షితిజమునందు భగవానుఁడు కూడ కిలకిల నవ్వు

చుండెను. ఆ నవ్వు కారణముగ నాతని శుభ్రదంతావళి నుండి కమనీయ కిరణములు బయలుదేఱి హిమాచ్ఛాదిత పర్వత శృంగములను స్పర్శించుచుండెను. దీనివలన వాటి హృదయము కూడ ద్రవించి ప్రవహించుచుండెను. ప్రకృతి శాంతముగ నుండెను. నీరవస్థానము పుణ్యభూమి. శీతముచే నంగములు ముడుచుకొని పోవుచుండెను. ఈ కారణమున మరీచిమాలి యగు సూర్యుని కిరణము లత్యంత సుఖకరముగఁ దోఁచుచుండెను. బ్రహ్మ ద్రవముతో సమాన మగు నత్యంత సుశీతల సరస్వతీ జలములతో వణఁకుచు వణఁకుచు ముని యాచమనము కావించి, యచ్చటనే ధ్యానమగ్నుఁడై కూర్చుండెను. లోకుల ప్రవృత్తి అధర్మము వైపునకు మిక్కిలి వేగముతోఁ బోవుచున్న ట్లాతఁడు కనుగొనెను. సమస్త దివ్య శక్తులు క్షీణ మగుచుండెను. ప్రజలు నాస్తికులు, శ్రద్ధాహీనులైరి. వేద, బ్రాహ్మణ, పరలోకము లందు గల వారి విశ్వాసము కుంటు వడుచుండెను. వారు పురుషార్థ హీనులు కూడ నైరి. వెనుకటి యుగములోవలె బల పరాక్రమము లిప్పటి వారిలో లేవు. వారి బుద్ధి మలినమైనది అందఱును పాపాచరణములోఁ బ్రవృత్తు లగుచున్నారు. చాల మంది అకాలమున కాల కబళ మగుచుండిరి. వారు భాగ్యహీనులై సదాచార హీనులై దుష్కర్మలు చేయఁ బ్రారంభించిరి.

'ఏమిటిది ?' అచ్చట నెవరును లేరే. సాంసారికులు అచ్చట లేరు. ఆ స్థానమున నున్న వా రందఱు ధర్మాచరణము కావించు తపస్వు లగు ఋషులే. అట్టి విజన వనములో ముని మానవుల యొక్క యిట్టి దుర్దశ నెట్లు కావించెను?"

అని మీఁరడుగ వచ్చును. ఆయన బాహ్య చక్షువులతోఁ జూడలేదు; ధ్యానమందు దివ్య దృష్టిచే నాతఁడీ యధర్మ లీల నంతను స్పష్టముగ గాంచెను. అప్పుడు నవనీతముతో సమాన మగు నాతని హృదయము ద్రవీభూతము కాఁ జొచ్చెను. సూర్య కిరణములు ముద్ద కట్టిన వెన్న ముద్దవంటి ఆతని యంతఃకరణమును తమ కిరణములచేఁ గఱగించు చున్నవా యను నట్లుండెను. లోకులకు హితమైన దేదియో యని వ్యాస మహాముని యాలోచించుచుండెను. దానినే ధ్యానించుచుండెను.

ఏమయ్యా, భగవద్ధ్యానమును వదలిపెట్టి మహాముని లోకోపకార చింత నేల చేయుచున్నాఁడు? భగవద్ధ్యానముచేఁ బ్రసన్నమైన చిత్తమును లోకుల చింతచే నేల చింతితము కావించుచున్నాఁడు? ఆతఁడచ్యుతారాధనమును పరిత్యజించి నాఁడా? అయ్యో, ఎందుకు పరిత్యజించినాఁడు? ఆతఁడు పర మారాధనములోఁ దత్పరుఁడైనాఁడు. లోకుల తాపముచే తాపితుఁ డగుటయే అత్యుత్కృష్టము నుత్తమము నగు అచ్యుతారాధన. పరావరజ్ఞుఁ డగు ప్రభువు దీనివలన శీఘ్రముగఁ బ్రసన్నుఁడగును. తమతమ శరీరసుఖము కొఱకందఱును బ్రయాసపడు చుందురు. కాని దుఃఖముచే దుఃఖితులై దానిని నివారింపవలె నను వాసనయే సంసారవాసనను మూలోచ్ఛేదనము కావింపఁ గలుగును.

ఇప్పుడు మహాముని లోకకల్యాణ కారక మగు కార్య మందు ప్రవృత్తుఁ డయ్యెను. మునుముందుగా నాతఁడు వైదిక

యజ్ఞవిస్తారము కొఱకు అసంఖ్యాకములగు ఋక్కులు కలిగి పర్వతమువలె గొప్పదియగు నొక్క వేదమునుండి, అత్యంతోపయుక్తము లగు ఋక్కుల నేఱిపేఱి అల్పసత్త్వము కలిగి, అల్పబుద్ధి గల ఋషి బాలకులు కూడ వాటిని సరళతాపూర్వకముగ ధారణ చేయగల్గునట్లుగ నాల్గు చిన్న సంహితలుగ విభజించెను. ఆ ఋగ్యజుస్సామాథర్వము లను నాల్గు సంహితలను పైల, జైమిని, వైశంపాయన, సుమంతు లను నల్గురు ప్రియశిష్యులచేఁ గ్రమముగ నధ్యయనము చేయించి, యితిహాస పురాణములను రచించి తన ద్విజేతర శిష్యుఁడును నాకు తండ్రియు నగు లోమహర్షణునకుఁ జెప్పెను.

ఇట్లు చేసినప్పటికిని మహాముని కి సంతోషము కలుగలేదు. కలియుగము ముదిరిన కొలఁది మానవుల బుద్ధి అల్పమగుచుండును. వారొక్క వేదమునైనను ధారణ చేయఁజాలరని యాతఁ డొక్కొక్క వేదమునకు శాఖల నేర్పఱచి విభిన్న గోత్ర ఋషులకుఁ బంచి 'మీరు చదువఁ గలిగిన నాల్గు వేదములను జదువుఁడు; లేదా మీవంశ పరంపరాగతమగు నొక్క వేదమునైనఁ జదువుఁడు. ఆ వేదమునంతను జదువఁజాలని యెడల తన శాఖావేదము నైనను అవశ్యము చదువవలయును. ఈవిధముగ నా మునుల పుత్రపౌత్రులును, శిష్య ప్రశిష్యులును ఆశాఖలను జదివి వేదాధ్యయనాధ్యాపనములు జరుపుచు వచ్చుచుండిరి. ఆ వేదముల ద్వారా వైదిక యజ్ఞ యాగములు, సమస్త సంస్కారములు జరుగుచున్నవి.

ఇప్పుడతఁ మరల వ్యాసభగవానుఁ డిట్లాలోచించెను. "ద్విజులకై వేదవిభాగము చేయఁబడినది. వారికి వేదముల

ద్వారా జ్ఞానము ప్రాప్తింపఁగలదు. తమ యజ్ఞయాగములను సమస్త సంస్కారములను అక్షుణ్ణముగ నుంచుకొనఁ గలరు. కాని వేదములను ప్రత్యక్షముగఁ జదువ వీలులేని స్త్రీ శూద్రాదులు జ్ఞానులకు వంచితులై యుండవలసినదేనా? వారి శక్తికి దగిన యుపాయమును జూడవలయును; ఏలననఁగా వారి కింతటి శౌచాచారము జరుగదు. సేవాకార్య భార ముచే వీరికి గురుకులవాసము కూడ జరుగనేరదు. అదియును గాక శాస్త్రాజ్ఞకూడ లేదు. కావున వీరు వేదములు చదువ కున్నను వీరికి జ్ఞానము లభింపవలయును. దీనికిఁ గూడ ప్రయ త్నింపవలయును. ఇంకొక విషయముకూడ కలదు. ముందు ముందు ద్విజులుకూడ సంస్కారహీను లగుదురు. షోడశసంస్కార ములు జరుపుట అట్లుంచుఁడు; కలియుగములోని ద్విజులకు ౧౬ సంస్కారముల పేర్లుకూడ తెలియవు. వారు సంస్కార హీనులు, శౌచ సదాచార రహితులు, సంధ్యాగ్నిహోత్ర శూన్యులై నామమాత్ర ద్విజులగుదురు. వారు తమ్ము ద్విజులని మాత్రము చెప్పుకొను చుందురు. ఇంకను ముందు ముందు తమ్ముఁ ద్విజులుగాఁ జెప్పుకొనుటకుఁ గూడ లజ్జించెదరు. శూద్రుల తోడను, అంత్యజుల తోడను, మ్లేచ్ఛుల తోడను సమస్త విధముల లగు సంసర్గము కావించుచుందురు. ఇట్టివా రందరకును మేలుకలుగు ప్రయత్నము చేయవలయును. వేదము లోని సమస్త విషయములు వచ్చునట్టి యొక గ్రంథమును రచింపవలయును. సమస్త జ్ఞాన సంగ్రహ మొకే స్థానము నకుఁ దేవలయును, పోనిండు, పూర్తిగఁ జదువక పోయినను, ఎంతవఱకు చదివిన నంతవఱకు లాభ ప్రదముగ నుండవల

యును. అందఱియొక్క ప్రవృత్తి దానియందే యుండునట్లు, ఆ గ్రంథము ఆఖ్యానములతోడను, కథలతోడను, నిండి యుండవలెను. చదువురాని స్త్రీ పురుషులు వాటిని విని జ్ఞాపక ముంచుకొని తమ సంతానమునకుఁ జెప్పునట్లుండ వలయును. ఈ విధముగఁ జదువకయే వినుటచేతనే అది ప్రచారము కావలయును."

ఇట్లాలోచించి వేదవ్యాసుఁడు మహాభారత రచనమును గావించెను. ఇది చాల పెద్ద గ్రంథ మయ్యెను. త్రిలోకములలోన దీని ప్రచార మయ్యెను. కోట్లకొలఁది శ్లోకములతో నీ గ్రంథము నిర్మింపఁ బడెను. భూమియందిది లక్ష శ్లోకములతోడనే ప్రచార మయ్యెను. ఈ గ్రంథ కారణమున నెక్కడ చూచినను వ్యాసుని ప్రశంసయే. దేవతలు, గంధర్వులందఱును మహాభారత స్తుతి విషయమునఁ బద్యములను రచించి వ్యాస భగవానుని స్తుతించిరి. వ్యాసుని విశాలబుద్ధి నల్దిక్కులఁ బ్రసిద్ధ మయ్యెను. మును లందఱును గలిసి ఆతనిని ధర్మవిషయమునఁ బ్రమాణ భూతముగ గ్రహించిరి. వ్యాసుఁడు చెప్పినదే ధర్మము. సమస్త శంకలకు సమాధానము వ్యాస వచనములచేతనే కలుగుచుండెడిది. వివాదావసరములందు ఈ విషయమున వ్యాసాభిప్రాయ మేమియో యను విచారణ జరుగుచుండును. ఈ విధముగ 'మహాభారత' ప్రతిష్ఠ పంచమ వేద సమాన మయ్యెను.

ఇట్లైనప్పటికిని వ్యాసుని మనస్సులో సంతోషము కలుగలేదు. తాను కృతకృత్యుఁడైన ట్లాతఁడు భావించుట

లేదు. ఆతని మనస్సులో నిర్వేద ముండనే యున్నది. ఏదియో లోప మాతనిని బాధించుచునే యుండెను.

శుద్ధాంతః కరణము గల పురుషుఁ డెవఁడైనను పరిశ్రమచేసి యేదైన కార్యము నొనర్చినా ఇతరు లాతనిని ప్రశంసించుటకు విసుగు చెందరు. ఏలననఁగా నాతని కార్యము లోకహితము కొఱకు నిష్కామముగఁ బరోపకార బుద్ధిచేఁ జేయఁబడిన కార్య మందఱకు సుఖ ప్రదముగనే యుండును. కాని కర్తకు సంతోషము కలిగింపనిది, యితరులకు పరమ లాభప్రదముగ నుండుఁగాక; అది సర్వశ్రేష్ఠముగ నెన్నఁ బడదు. చాల మంది తమ్ముఁ దాము మఱపింపఁ జూతురు. వారు అంతః కరణములో నుత్పన్నమైన సత్యప్రేరణను వివిధ యుక్తులచే నణఁపఁ జూచుచుందురు. వివిధము లగు తర్కములు ద్వారా మనస్సును సంతృప్తి పఱచుకొనఁ జూచుచుందురు. ఈ విధముగ వారు సత్యమునకుఁ జాల దూరముగ తొలఁగఁ జూచుచుందురు. వివేక బుద్ధి నణఁచు చుందురు. ప్రతి కార్యములోని శుభాశుభము లందును సజ్జన పురుషాంతః కరణమే ప్రమాణ మని భావించెదరు. తనకు తనలోనే సందేహముగ నున్నది. సంశయ ప్రదకార్యమే. తనకు సంతోష ప్రదమైనది; సర్వశ్రేష్ఠ మైనది. మంచి చెడ్డలకు బరిభాష మనీషిణు లిట్లే నిర్వచించిరి.

సమ్మానిత ప్రసిద్ధ పురుషుఁడు తన వేదన నెవరి దగ్గఱను ప్రకటింపఁ జాలఁడు. అట్లు ప్రకటించిన లోకులకు విశ్వాస ముండదు. ఈతఁడు తన శ్రేష్ఠతా కారణమున శిష్టా

చారముచే నిట్లనుచున్నాఁడు. కాని యిట్టి సర్వజ్ఞ
షుల కెచ్చట నైన సందేహ మనునది యుం
అని లోకు లనుకొను చుందురు. సాధారణులు
నౌననుచు ముఖప్రీతి వాక్యములను బలుకుచుంద
మన వేదనను దెలిసికొనఁ జాలరు. మనకంటె
రును, మనకు హితైషు లైనవారు నగు వారి స
మన మనోవ్యథను బ్రకటించుటచే వారు మన
తెలిసికొనఁగలరు. ప్రేమచే వారు గంభీరముగ
రించెదరు. దాని మూలమునకు వెళ్ళి దాని
గూర్చి కూడ యాలోచించెదరు. కాని యిట్టి
షుల మర్మమును దెలిసికొనఁ గలవారు సర్వత్ర
దొఱకరు. ఇట్టి సంశయచ్ఛేత్తలు దొఱకనంత వఱ
మన మనస్సులలో నూహాపోహాలు చేయవలసియే

తనలో నేమి లోటుగా నున్నదో యని
వ్యాసునకు చింత కలిగెను. ఆతఁడు సరస్వతీ న
నున్న విజన వనములోనికి వెళ్ళి, చిరకాలము ఏక
దీనినే విచారించు చుండెను. "నా చింతకు,
లోటుకు కారణ మేమై యుండును? మానవుఁ డై
ములచేఁ దాను అకృతార్థుఁడ నని తలఁచు చుం
యాతఁడు మాటి మాటికి విచారించుచుండును.

మొదటి కారణ మేమనఁగా బాహ్యాడంబ
శుద్ధ చిత్తముతో నియమములను బాలింపక పో
ననఁగా నియమ పాలనముచే హృదయమం దొక
దృఢత్వము కలుగును. ఆత్మకు సంతోషము కలుగు

రెండవ కారణము — విధిప్రకారము వేదాది శాస్త్రాధ్యయనము చేయకపోవుట. శాస్త్రాధ్యయనముచే సమస్త విధములగు సంశయములు నశించి మానవుఁడు వ్యర్థచింతల నుండి విముక్తుఁ డగును.

మూఁడవ కారణము — చదివినాఁడు కాని గురుజనుల సేవా శుశ్రూషలు చేయలేదు. సర్వ శాస్త్రముల సార్థకత పూజ్యపురుషులను, గురుజనులను నిష్కపట భావముతో సేవించుటలోనే కలదు. శ్రద్ధతోఁ బూజ్యులను సేవింపనివాఁడు జీవితములో వాఁడు సుఖముగ నుండఁజాలఁడు. వాని మనస్సులో శాంతి యుండనే యుండదు.

నాల్గవ కారణము — తాను జేయవలసిన అగ్నిహోత్ర సంధ్యావందనాది నిత్యకర్మలను సావధానపూర్వకముగఁ జేయకపోవుట. నిత్యకర్మలను జేయుటచే జీవిత మొక వ్యవస్థలో నుండును. పాపకర్మలందు ప్రవృత్తి కలుగదు. దుష్కర్మలయెడల నేవగింపు గలుగును. హృదయములో శుభకర్మలయెడల నాదరభావ ముత్పన్నమగును.

ఐదవ కారణము — జీవితములో పరోపకార మేదియును జేయకపోవుట. పరోపకారముచే దేహాత్మ బుద్ధి దూరమగును. అందఱియొక్క సుఖదుఃఖములు సమానము లని తెలిసికొను శక్తి వృద్ధియగును. జీవు లన్నిటిలో ననేక రూపములలో నొకే ఆత్మ సత్తా వ్యాప్తమై యున్నదను జ్ఞానము కలుగును. సమస్త ప్రాణుల రూపములో నా యిష్ట దేవుఁడే క్రీడించుచున్నాఁడనియు, జనతా రూపమున జనార్ద

నుఁడే యున్నాఁడను భావనతోఁ జేసిన పరోపకారము ముక్తిమార్గ ప్రదర్శక మగును. ఇదియే అఖిలాత్మ ప్రభువు యొక్క సర్వశ్రేష్ఠమగు నుపాసనము.

నేనీ వైదికకర్మలను యథాశక్తిగఁ జేసితిని. బ్రహ్మచర్యములోని సమస్తనియమములను నేను విధిప్రకారముగఁ బాలించితిని. వేదములను జదివితిని, చెప్పితిని. వాటిని యథామతిని సంక్షిప్తముగ సంకలనము కావించితిని; నాల్గు భాగములుగ విభజించితిని. యథాశక్తిగ గురుజనుల సేవ కూడ శ్రద్ధాభక్తులతోఁ గావించితిని. అగ్నిహోత్రాది కార్యములను నిత్యము నియమానుసారముగఁ జేయుచుందును.

నేను ద్విజాతునకే పక్షపాతము వహించితినా యనిన నట్లుకాదు. స్త్రీ శూద్రులకును, నితరు లందఱకును నేను మహాభారత రచనమును గూడ కావించితిని. ఉన్న జ్ఞానమును దానిలో వదలిపెట్టిన దేదియును లేదు. ఆ ఒక్క గ్రంథములోనే సమస్త వేదముల యొక్కయు, సమస్త శాస్త్రముల యొక్కయు సారతత్త్వమును నింపివేసితిని. ఇంత చేసినప్పటికిని దేహాభిమాన జీవినగు నాకు కొంచెము మనస్సులో నసంతుష్టముగ నున్నది. ఇంతకు నాకు బ్రహ్మజ్ఞానము లేదనియుఁ గాదు. నేను సమస్త బ్రహ్మతేజస్సంపన్నుఁడను కూడ. దీనికి కారణము కొంచెమైన నాకుఁ దోఁచుటలేదు. మానవుఁడు చేయవలసిన సమస్త కార్యములను నేను జేసితిని. వర్ణాశ్రమ ధర్మములను స్వయముగ విధివత్పాలనము కావించితిని. సంక్షేపముగను, విస్తారముగను అందఱయొక్క

ధర్మములను వర్ణించి యుంటిని. బ్రాహ్మణుఁడు మొదలుకొని చాండాలుని వఱకు గల అందఱకు నేను క్షేమముగనో గొప్ప గనో ధర్మ మొనర్చితిని. అందఱి కర్తవ్యములను వచించితిని. నా మనస్సులో కొఱవగా నుండుటకు నేను చేయని దేమున్నది? దంతములలో నేదైన వస్తువు చిక్కుకొనిన యెడల నాలుక తడవ తడవకు దానిని బయటకు లాగివేయుటకు అటేపోయి లాగుచుండును. అట్లే నామనస్సు కూడ యేదో ఒకదానిని లాగివేయుటకుఁ బ్రయత్నించు చున్నది. అది బయటకు వచ్చువఱకు నామనస్సునకు శాశ్వత శాంతి లభింపదు.

నాకొక సందేహము బాధించు చున్నది. గృహస్థుల విషయములో కర్మలు తప్పక చేయవలెననియు, గృహస్థ ధర్మము లత్యధిక ప్రశంశనీయము లనియు, తప్పక పుత్ర ప్రాప్తిని జెందవలయు నను నియమములు సాధారణముగా విరక్త భగవద్భక్త పరమహంసులకు విశేష రుచికరముగ నుండవు. వారికి భక్తుల యొక్కయు, భగవంతుని యొక్కయు చరిత్రలే అత్యంత ప్రియములుగ నుండును. భాగవత ధర్మమే వారికి జీవనాధారము. ఏలననఁగా వారు భగవంతునకుఁ బ్రియులు. భగవంతునకుఁ గూడ తన చర్చ యనిన చాల ప్రీతి. "తనను గూర్చిన స్తుతి యెవనికి ప్రీతిగ నుండదు?"

ఆ పరమహంసలకు సంతుష్టి కలుగనట్లుగఁ దోఁచు చున్నది. నేను మహాభారతములో భగవచ్చరిత్రలను వర్ణించి నప్పటికి, పురాణములలో భాగవత ధర్మమును గూడ నిరూ

పించినప్పటికిని, కొంచెము పొరపాటు అవశ్యమున్నది, లేక
పోయిన నామనస్సు మాటిమాటికి నన్నిట్లు బాధింపదు.

ఈ చింతలోనే వ్యాసుఁడు కూర్చుండెను. తన చింతా
కారణమును నిశ్చయించుకొనలేక పోయెను.

ఛప్పయ

పారాశర్య ప్రవీణ పరమ చింతిత చిత హూకర్ ।
సోచేఁ——మైఁనే పఢే వేద తనుకే సుఖ ఖోకర్॥
గురు సుశ్రూషా కరీ అగ్ని అవ్యగ్ర అరాధీ।
కరీ తపస్యా ఉగ్ర గ్రీష్మ పంచానల సాధీ॥
వేదవ్యాస ఇతిహాస రచి, పుణ్యపురాణ కథాకహీ।
చింతాచిత తే నాహీఁ గఈ, కఛూ ఖటక ఖటకతి రహీ॥

అర్థము

పరాశరుని కుమారుఁడగు వ్యాసుఁడు పరమచింతితుఁడై
యిట్లాలోచించెను:— "నేను శరీరసుఖమును గూడ వదలుకొని
వేదమును జదివితిని. గురు శుశ్రూషను కావించితిని. అగ్నిని
అవ్యగ్రబుద్ధితో నారాధించితిని. గ్రీష్మములో పంచాగ్ని మధ్య
మున నుగ్ర తపస్సు కావించితిని. ఇతిహాసములను రచించితిని.
పుణ్య పురాణ కథలను జెప్పితిని. కాని చిత్తములోని చింత
పోలేదు. ఏదో కొంచెము లోటు కనఁబడుచున్నది.

# వ్యాసాశ్రమమున నారదుఁడు

శ్లో॥ తస్యైవం ఖిలమాత్మానం
మన్యమానస్య ఖిద్యతః ।
కృష్ణస్య నారదోఽభ్యాగా
దాశ్రమం ప్రాగుదాహృతమ్ ॥ *

( శ్రీమద్భాగవతము ౧ స్కం. ౪ అ. ౩౨ శ్లో. )

ఛప్పయ్

బదరీ బనకే నికట బిరాజేఁ మునివర జ్ఞానీ ।
వేదవ్యాస ఇతిహాస రచే పుని శాంతి నమానీ ॥

చింతా చితమేఁ చుభీ మ్లానతా ముఖ పర్ ఆఈ ।
రహీ కౌన్ సీ కమీ ఆతమా అతి అకులాఈ ॥

ఇతనే మేఁ వీణా లియే, రామకృష్ణ గుణ గానతే ।
నారద దేఖే ఆవతేఁ, ప్రేమ వారి బరసావతేఁ ॥

అర్థము

బదరీవన ప్రాంతమున మునివరుఁడును, జ్ఞానియు నగు వేదవ్యాసుఁడు నివసించుచు నితిహాసాదులను రచించినప్పటికిని శాంతి కలుగలేదు. చింతా చిత్తముచే నాతని ముఖము నందు మ్లానత తోఁచెను. ఆత్మలో నేమి లోటు కలిగినదో తెలియక అత్యధికముగ నాకులతను జెందెలు.

---

* ఈ విధముగ వ్యాసభగవానుఁడు తన్ను హేయముగఁ దలఁచుచు ఖేదపడుచుంతలో నాతని పూర్వోక్తాశ్రమమునకు నారదమహర్షి వచ్చెను.

ఇంతలోనే వీణను బుచ్చుకొని, రామ, కృష్ణ గుణగానమును కావించుకొనుచు, ప్రేమామృతమును వర్షించుచు నారదుఁడు వచ్చుటను గాంచెను.

మానవుఁడు తన కథా కారణమును బయట వెదకునేని, బయట ఉండునవి యింద్రియ విషయములే కదా! చివరకు వాటి పరిణామము విషమువలెఁ బ్రాణాంతకమే యగును. తమ చింతను తన లోపల విచారించుచు, బాహ్య దృష్టిని తొలగించి అంతరాత్మ సడుగు నెడల నా సమయమున సమస్త ప్రాణుల మనస్సు నెఱుఁగు, మనస్సున కధిష్ఠాతృ దేవుఁడగు నారదుఁడు వచ్చి యాతని సమస్త శంకలకు సమాధానమీయఁగలఁడు.

వ్యాసుఁడు సరస్వతీనదీ తీరమున నరఁటి పొదలతో లావృతమగు తన స్థానమందు చింతామగ్నుఁడై కూర్చుండి యుండెను. శిష్యులు ప్రాతఃకాలీన అగ్నిహోత్ర సమిధాధానముల విధ్యుక్తముగ నొసర్చిరి. ఆశ్రమ గోవులను పాలు పితికి వనములో చరించుటకు వదలిరి. శిష్యగణము సుస్వరముగ బ్రహ్మఘోషము చేయుచుండిరి; కాని వ్యాసుని మనస్సులో నదే చింత యుండెను. ఇంతలో నాతని చెవులలో సుమధుర వీణా ఝుంకార నాదము పడెను. ఇంతలోనే ప్రాణులకు బ్రసన్నతా ప్రదానము కావించు సుమధుర శ్రీహరినామ సంకీర్తనముకూడ వినఁబడెను. తల యెత్తి చూచునప్పటికి ఎదుట చిరునవ్వు నవ్వుచు నారదమహర్షి నిలుచుండెను. ఆ నారదుఁడు వచ్చుట నూతన జలధర మేఘమువలె నింద్రధనుస్సు విద్యుత్సహితముగ నాకాశము

నుండి ప్రేమామృతమును వర్షింపఁజేయుచు వ్యాసునిఁ గృప జూచుటకు సాకారశరీరముతో దిగివచ్చెనా యనునట్లుండెను. తన సమ్ముఖమున దేవర్షి యగు నారదుఁడు స్వరబ్రహ్మమయ మగు వీణను మీటుటను గాంచి వ్యాసుఁడు మిక్కిలి శీఘ్ర ముగ సంభ్రమముతో వెంటనే లేచి నిలుచుండెను. ఆతఁడు భక్తితో దేవర్షికి స్వాగత మిచ్చెను. సుందర సుఖప్రదమగు నాసనమున నాతని గూర్చుండఁ బెట్టెను. శిష్యులతో త్వరగా నర్ఘ్యసామగ్రిని తేవలసినదని చెప్పెను.

సుగంధితమగు నుష్ణజలములచే దేవర్షికి పాదప్రక్షా ళనము కావించెను. పాలు, పెరుగు, తేనె, అక్షతలు, తెల్ల నువ్వులు, కుశలు, దూర్వాంకురములు, పుష్పములు, చందన మిశ్రిత జలములచే నాతఁడు భక్తిపూర్వకముగ నర్ఘ్యము నొసంగెను. సరస్వతీ జలములచే నాచమనము చేయించెను. మంత్రస్నానము కావించి యాతఁడు వల్కల వస్త్రమును, తన చేతితో వడకి సిద్ధముచేసిన యజ్ఞోపవీతము నర్పించెను. శరీరమునకు సుగంధిత చందనమును పూసెను. బదరీవనములో నుత్పన్నమైన సుగంధిత ధూపమును వేసి ముందుంచెను. ఘృత దీపమును జూపించెను. మంచి సుస్వాదు కందమూల ఫలములను ఋషి సమ్ముఖమున నుంచెను. హారతి నిచ్చెను. రెండు చేతులతో నంజలి ఘటించి పుష్పాంజలిని ఋషి చర ణముల కర్పణము చేసెను. నానాస్తోత్రములచే నాతనిని స్తుతించెను. వ్యాసుఁడు చేసిన శాస్త్రోక్తపూజను నారదుఁడు శాస్త్రవిధి చేతనే స్వీకరించెను. పూజానంతరమున పరస్ప రము కుశలప్రశ్నలు జరిగెను. నారదుఁడు వ్యాసాశ్రమము

లోని వృక్షముల యొక్కయు, శిష్యుల యొక్కయు, గోవుల యొక్కయు, అగ్ని యొక్కయు, సమీపస్థ మునులయొక్కయు, ఆతని శరీరముయొక్కయు కుశలము నడిగెను. ప్రత్యుత్తరముగ వ్యాసుఁడు తంచట కుశలమును జెప్పి మునితో నీవిధముగ నమ్రతతోఁ బలికెను. "ప్రభో! నేడు మీరు మీ దేవదుర్లభ దర్శనముచే నన్నుఁ గృతార్థుని కావించితిరి. నేఁడు నేను ధన్యుఁడనైతిని. నా తపస్సు ఫలించినది. నా వేదాధ్యయనము, గురువు, అగ్ని యొక్క సేవ సార్థకమైనది. భగవానుఁడు స్వయముగఁ గృపఁ జూచి యీ యాశ్రమమును మీ పదధూళిచేఁ బావనము కావింపఁజేసెను. దీనబంధో! ఈ సమయమున శ్రీవారి శుభాగమనము ఎచ్చట నుండియో నే నిప్పుడు తెలిసికొనఁ గోరుచున్నాను" అనెను.

నారదుఁడు ప్రసన్నతను బ్రకటించుచు "ఓ మునిశ్రేష్ఠా! నేను బ్రహ్మలోకమునుండి ఇంద్రలోకమునకు వచ్చి, వరుణలోకమునకు వెళ్ళితిని. అక్కడనుండి శ్వేతదీపమునకు వెళ్ళితిని. అక్కడనుండి వచ్చుచుండ నాకు నరనారాయణుల దర్శనము చేయవలెనను కోరిక గలిగినది. అందువలన బదకినుని దర్శనము చేసికొని నేను నిన్ను జూచుటకు ఇక్కడికి వచ్చితిని. నే నే లోకమునకు వెళ్ళినప్పటికిని సర్వత్ర నీ ప్రశంసనే వింటిని. వ్యాసుఁడు మహాభారతమును రచించి యొక యద్భుత కార్యమును గావించినాఁడని బ్రహ్మ పలికినాఁడు. దేవలోకములోఁగూడ నీమహాభారతమును గూర్చిన చర్చయే; [illegible] విద్యార్థులలో చిన్న చిన్న పిల్లలుకూడ ఆ కథలను వర్ణించుచున్నారు. ఈ విధముగ నీ కృతికి సర్వత్ర గల

ఆదరమును గాంచి నా రోమ రోమములు గగుర్పొడిచినవి. నేను నిన్నభినందించుటకు వచ్చితిని, కాని యిచ్చటికి వచ్చు నప్పటికి వేఱు విధముగఁ గాంచితిని! నీ మనస్సు స్వస్థతగ లేనట్లు నాకు తోఁచుచున్నది. చిత్తములో నేదియో చింత వ్యాపించి యున్నట్లు, అంతరాత్మ కేదియో లోటు కలిగి నట్లున్నది. ముఖము మానసిక విచారములకు దర్పణము. మనస్సులో నెట్టి విచారము ఉత్పన్న మగునో అట్టి భావ ములే ముఖమునందు వ్యాప్తమగును. నేను చూడఁగా నీ ముఖము మ్లానమైనట్లును, చిత్తములో చంచలత్వ మున్న ట్లును తోఁచుచున్నది. దీనికి కారణ మేమియో నీవు నాకు చెప్పుము" అనెను.

వ్యాసుఁడు "శ్రీవారు పలుకున దంతయు సత్యమే. దీనికి కారణమును నేను తెలిసికొనఁ జాలకున్నాను" అనెను.

నారదుఁడు "మానవుఁడు తాను అకృతార్థుఁడ నని రెండు కారణములచే నెఱుఁగుచున్నాఁడు. అది తన కర్త వ్యము నుండి చ్యుతుఁడైనను, వానిద్వారా పరోపకార కార్య మేమియుఁ గాకున్నను నీవిషయములో నీరెండును లేవు. నీవు నీ కర్తవ్యమం దెల్లప్పుడును సావధానుఁడవై తత్పరతతో నుందువు. నీ కర్తవ్య కర్మలను యథారీతిగ నొనర్చుచుందువు. పరోపకారము చేయుట నీ జీవిత వ్రతమే. నీవు వేదములను వ్యాసము కావించితివి. పురాణములను రచించితివి. వేదము లతో సమానమగు పంచమ వేదము మహాభారతమును రచించితివి. దాని నందఱు నాదరించి ప్రశంసించిరి. నీ కీర్తి బ్రహ్మాండ మంతటను వ్యాపించుచున్నది. అట్టి దానిని రచిం

చియు నీవింతగఁ జింతించుచున్నా వేలకో? నీవు నీ మనస్సు లోని మాటను నాకు చెప్పుము. నీవంటి జ్ఞానుల కిట్టి చింత శోభింపదు. నీవు బ్రహ్మవేత్తవు, బ్రహ్మతత్త్వ వక్తవు, వ్యాఖ్యాతవు. మీద్వారా యితరుల చింతలు దూరమగును" అనెను.

వ్యాసుఁడు రెండు చేతులను జోడించి శిరస్సును వంచి మిక్కిలి నమ్రతతో "స్వామీ! మీరు పలికినదంతయు సత్యమే, నేను యథాశక్తి నా సమస్త కర్తవ్యములను బాలించితిని. నాశక్తి నంతను వినియోగించి సమస్త వర్ణము లకును, సమస్తాశ్రమములకును అత్యంత హితకరముగ నుండ వలె నను బుద్ధితో నేను మహాభారత రచనమును గావించితిని; దీనిని రచించినచో నా సందేహము లన్నియుఁ బోవునని భావించితిని. నేను కృతార్థుఁడ నగుదు ననుకొంటిని. కాని ప్రభో! మీకు దాపరిక మేమున్నది. మహాభారతమును రచించినప్పటికిని నాకు శాంతి కలుగలేదు! మనస్సులో నేదియో ఒక భయ ముండనే యున్నది! ఏదియో లోటు న్నట్లు నేనిప్పటికిని అనుభవ పూర్వకముగఁ దెలిసికొను చున్నాను. 'ఇంకను గొంత మిగిలియున్నది, ఏదియో నీనుండి కొంత కొఱవడినది?' అని నామనస్సు మాటిమాటికి చెప్పు చునే యున్నది. కావున ప్రభో! నావలన కొఱవడిన దేదియో మీరే తెలవిండు. ఏకారణమున నామనస్సు ప్రస న్నత చెందుటలేదు?" అనెను.

వ్యాసుని వాక్యములను విని నారదుఁడు నవ్వి తేచి యాతఁడు వ్యాసుని గౌఁగిలించుకొని మిక్కిలి స్నేహముతో

"వ్యాసా! నీవు ధన్యుఁడవు. నిజముగ నీవు భగవదవతార మవు. ఈ పలుకులు నీ కనురూపముగనే యున్నవి. సాధారణులు తమ యంతఃకరణ వాక్కును అణఁచుకొనుటకుఁ బ్రయత్నించెదరు. లోకులు వారిని గొంచెముగఁ బ్రశంసించిరా వారు తమ్ముఁ దాము మఱచిపోవుచుందురు. తామే సర్వశ్రేష్ఠులమని పొంగిపోవుచుందురు. ఈ భావమున వారి యభ్యున్నతి ఆగిపోవును. అప్పుడింక ముందుకు సాగిపోఁజాలఁడు. ఎవరు తమ అంతర్వాణిని మాటిమాటికి వినుచు, యా లోటును బూర్తి కావించుటకుఁ బ్రయత్నించెదరో ప్రపంచములో నా మహాపురుషులే ప్రాతఃస్మరణీయు లగుదురు. నీవు వారిలోఁ జేరినవాఁడవు. నీలోటు నాకు తెలియును" అనెను.

చేతులు జోడించుకొని "మహారాజా! మీ రెఱుఁగని దేమి కలదు? ఇతరుల మనస్సులలోని విషయముల నెఱుఁగుట మీకు సాధారణ విషయమే. మీకు గుహ్యాతి గుహ్య విషయములన్నియుఁ దెలియును. మూఁగవాని భాష మూఁగవానికే తెలియవలెను; లేదా మూఁగవాని సమీపమున నుండువానికి కూడ తెలియవచ్చును. వారు పరాత్పర ప్రభువు యొక్క భాషను మౌనము మూలకముగనే అంతయును బ్రకటించుకొనుచుందురు. మననశీలుఁడగు మౌన ముని మాత్ర మా విషయములను దెలిసికొనఁగలఁడు. వైఖరీ వాణితోఁ బలుకు వ్యక్తు లా విశ్వేశ్వరుని భాష నెట్లు తెలిసికొనఁ గలుగుదురు? ఎవనికి భూత భవిష్య ద్వర్తమానములు లేవో, కాలమునకుఁగూడ కలయిత యెవఁడో అట్టి పురుషోత్తమ పరమాత్మను గూర్చి మీ రుపాసించితిరి; సేవించితిరి.

సృష్టి, స్థితి, లయము లాతనికి నిత్య వినోదములు. ఆతని భక్తి పూజలు కావించువారలకు దుర్జ్ఞేయము లేమి కలవు?

నా స్థితి యెట్లున్నదో అది మీ సమ్ముఖమున గలదు. మీ కడ దాఁపరిక మేమియును లేదు. ఒకవేళ దాచినప్పటికిని మీకు తెలియకపోదు. ఏలననఁగా మీరు ప్రాణ వాయువువలె నందఱకు లోపల బయట సమానరూపముగ విరాజిల్లుచుందురు. అందఱ అంతఃకరణములలోని విషయ ముల నెఱుఁగుదురు. మీకు లోకము లన్నిటిలోను సమాన గతి కలదు. వైకుంఠము మొదలుకొని రసాతలము వఱకు అన్నిటిలో మీరు స్వేచ్ఛగాఁ దిరుగుచుందురు. సూర్యుని వలెను, అగ్ని వాయు జలాది పంచభూతముల వలె బ్రహ్మాండములో సర్వత్ర మీ కవ్యాహత గతి కలదు. స్వామీ! మీరు నా యీ కంటకమును బీకివేయుఁడు. నాలో నే పొరపాటు కలదో మీరే దయయుంచి చెప్పుఁడు. నీవు యోగసమాధిద్వారా పరమ బ్రహ్మజ్ఞానము కలిగియున్నా వని మీరు శిష్టాచారమురీత్యా నన్ను మిక్కిలిగఁ బ్రశంసించి తిరి. స్వాధ్యాయ, వ్రత, నియమ, అగ్ని, గురు శుశ్రూష ద్వారా శబ్దబ్రహ్మ మర్మమును గూడ మీ రెఱుఁగుదురు. ఇది యంతయు సత్యమైనప్పటికిని మనస్సులో శాంతి లేదు. అది మీ యుపదేశముచేతనే ప్రాప్తింపఁ గలదు. కావున నో సర్వజ్ఞా! ఏ కార్యమువలన నాకు శాంతి కలుగునో దానిని జెప్పుఁడు. ఏ మార్గమునఁ బోయిన నాకు పరమా నంద ప్రాప్తి కలుగునో దానిని నా కుపదేశింపుఁడు. ఏల ననఁగా ప్రపంచములో ముఖప్రీతి మాటలు పలుకువారును,

ప్రశంసించువారును జాలమంది యుందురు. హితకాంక్షులు, సత్యము, సుఖప్రద మగు నుపదేశము అత్యంత హితైషులు మాత్రమే చెప్పుదురు. మీకు మించిన హితైషు లీ లోకమున నెవరుందురు ?'' అనెను.

నారదుఁడు వ్యాసుని వివేచనకు మిక్కిలి ప్రసన్నుఁడై "మంచిది, వ్యాసా! నీ వింత ప్రేమగా నడుగుచుంటివి కావున నేను నీ సమ్ముఖమునఁ జెప్పుచున్నాను, వినుము" అనెను.

నారదుఁ డత్యంత ప్రసన్నతా పూర్వకముగఁ బ్రత్యుత్తర మిచ్చుటను గాంచి వ్యాసభగవానుఁడు మనస్సునం దత్యంత ప్రసన్నుఁ డయ్యెను. ఆతఁడు మిక్కిలి శ్రద్ధా భక్తి పూర్వకముగ నేకాగ్ర మనస్కుఁడై నారదుని ముఖమునుండి వెలువడుచున్న ఉపదేశ రూపామృతము నత్యంత పిపాసువు వలె మిక్కిలి వుత్సుకతతో పానముచేయ మొదలిడెను.

సూతుఁడు "ఋషులారా! నారద భగవానుఁడు వ్యాసునకుఁ జేసిన యుపదేశమును, అతని లోపమును, నేను మీకు నివేదించెదను. ఇదియే భగవద్భక్తులయొక్క సార సిద్ధాంతము. ఇహలోక పరలోక, స్వర్గాది యింద్రియజన్య సుఖేచ్ఛను వదలి, అంతేకాదు ఇంద్రపద, బ్రహ్మపద, మోక్షాదులనుగూడ వీడినవారికే యీ యుపదేశము హిత కారకముగ నుండఁగలదు. ఎవరికి లౌకిక వైదిక కర్మలయందు ప్రవృత్తి కలదో, ఎవ రీలోకమున గర్మ నాచరించి స్వర్గమునకు వెళ్ళఁ దలచుచున్నారో స్వర్గమునుండి భ్రష్టులై మరల శుభకర్మములందే ప్రవృత్తులు కాఁదలఁచుచున్నారో

అట్టివారి కీయుపదేశము రుచింపదు. వేదమును, బరలోకమును బప్పుకొననివారికిని, ఈ శరీరమే సమస్తమని భావించువారికిని ఇది రుచికరముగ నెట్లుండఁగలదు? మీరందఱును భగవద్భక్తులు. శ్రీకృష్ణునందు చిత్తముంచి కూర్చుంటిరి; కావున నేను మీకు నారదుఁడు చేసిన యాదివ్యోపదేశమును జెప్పెదను.

ఛ ప్ప య

నారద జీనే కహా-వ్యాస! తుమ్ సబ్ గుణ ఆకర్ ।
వేద పురాణ ప్రవీణ సభీ శాస్త్ర ని కే సాగర్॥

బ్రహ్మ జ్ఞానీ ఆప్ ఇస్ తరహ్ క్యోఁ పఛతాతే।
కారణ క్యా హై? కహో భేద క్యోఁ నహీఁ బతాతే।

బోలే వ్యాస వినీత హో, ముని! మన మైన మిటాఇ దో!
కాజ్ కౌన్ కీయో నహీఁ, సబ్ సచ్ సచ్ సమ ఝాఇ దో॥

అ ర్థ ము

"వ్యాసా! నీవు సమస్త గుణాకరుఁడవు. వేద పురాణ ప్రవీణుఁడవు. సమస్త శాస్త్ర సాగరుఁడవు. బ్రహ్మజ్ఞానివి. అట్టి నీవు ఈ విధముగ నేల విచారపడెదవు? కారణ మేమి? భేదము నేల చెప్పవో చెప్పుము" అని నారదుఁ డనెను.

అంత వ్యాసుఁడు వినయముతో "నారదమహర్షీ! నా మనస్సులోని దోషమును బోఁగొట్టుము. నే నేమి కార్యమును జేయకుంటిని? అంతయు యథార్థముగఁ దెలుపు" మనెను.

# వ్యాసుని వ్యాకులతకు కారణము

శ్లో॥ ఇదం హి పుంస స్తపసః శ్రుతస్య వా
స్విష్టస్య సూక్తస్య చ బుద్ధి దత్తయోః।
అవిచ్యుతోఽర్థః కవిభిర్ని రూపితో
యదుత్తమ శ్లోక గుణాను వర్ణనమ్॥ *

(శ్రీమద్భాగవతము ౧ స్కం. ౫ అ. ౨౨ శ్లో.)

ఛప్పయ

బోలే నారద— “సభీ ఆపనే ధర్మ బతాయే।
కింతు కృష్ణ కే లలిత చరిత అతి విశద న గాయే॥

భక్తి భావ సే హీన కుకవి జో కవితా కరతే।
కాక తీర్థ సమ సముఝి హంస ముని నహి ఆదరతే॥

అబ సబ తజ ముని! భక్తి కా, ప్రేమ ప్రవాహ బహాఇయే।
భక్తి భావ దర్శాఇయే భగవత చరిత సునాఇయే॥

అర్థము.

“నీవు సమస్తధర్మములను జెప్పితివి కాని శ్రీకృష్ణ లలిత చరిత్రమును మిక్కిలి విశదముగా గానము చేయలేదు. భక్తి భావ హీనమగు కవిత నే కుకవి రచించునో దానిని కాకతీర్థముగ గ్రహించి మునిహంసలు దానిని ఆదరింపరు.

---

* మానవులు చేయు తపస్సు, వేదాధ్యయనము, యజ్ఞానుష్ఠానము, సత్కథనము, జ్ఞానము, దానము మొదలగు సమస్త శుభకర్మలయొక్క ఏకమాత్ర అక్షయఫలము వాటి అన్నిటిద్వారా ఉత్తమశ్లోకుఁడగు భగవానుని గుణ వర్ణనమందు రుచి పుట్టుటయే యని బుద్ధిమంతులగువారు చెప్పుచుందురు.

ఓ వ్యాస మహాముని ! ఇప్పు డన్నిటిని ద్యజించి భక్తి ప్రేమ ప్రవాహమును ప్రవహింపఁ జేయుము. భక్తి భావ మును దర్శింపఁజేయుము. భగవచ్ఛ్రోత్రమును వినిపింపుము” అని నారదుఁ డనెను.

సూతుఁడు “మునులారా ! ఎప్పుడైన రహస్య విష యము లేకాంతమున వచ్చును. ప్రేమ ప్లావితములును, స్నేహార్ద్రము లగు రెండు హృదయము లేకాంతమునఁ గలిసి కొను నెడల ప్రేమస్రోత ప్రాంగఁ బ్రారంభించును. జగత్పావ నము కావించు స్నేహధార ప్రవహింపఁ బ్రారంభించును. అది భూమిమీఁదకు వచ్చి పాపులకుఁ గూడ పుణ్యప్రదా నము కావించును. సుఖశాంతులను బ్రసాదించున దగును. వ్యాభగవానుఁడును, దేవర్షి యగు నారదుఁడును ఇద్దరును గలిసి పుణ్యసలిల యగు సరస్వతీ తటమున విశాలాపురి యందు నరపర్వత పార్శ్వమందుఁ గూర్చుండి ప్రేమ చర్చ చేసికొనునప్పుడు అచ్చటనుండి త్రైలోక్యపావన మగు గంగ యొక్క యీ రెండవ ప్రవాహము శ్రీమద్భాగవత రూప మున బయలుదేఱెను. ఈ ధారలో నొక విశేషము కలదు. గంగ సర్వదా అందఱకు సమస్త స్థలముల దుర్లభము కాని యీ కృష్ణకథ యను గంగ సమస్త కాలములందును సర్వత్ర సులభము. ఇది ఎప్పుడు ? వాని హృదయము అనురాగ ముచే నార్ద్ర మగు నెడల” అనెను.

నారదుఁడు “వ్యాసా ! నీవు చేసిన దంతయు నుచితము గానే యున్నది. ఈ సాంసారికులను అధర్మమునుండి తప్పించి

ధర్మానుసారులుగఁ జేయుటకు శిక్షణ నిచ్చితిరి. వివిధ కథోపాఖ్యానముల ద్వారా ధర్మ మర్మమును దెలిపితిరి, కాని నీవు భగవద్యశమును వర్ణింపలేదు. ఇదెట్లున్న దనఁగా నొక చెట్టు కెన్నో సంవత్సరములు నీరు పోయఁగా బోయఁగా ఫల సమయమున దానికి కేవలము దూదియే బయలు దేరినది. ఏ జ్ఞానముచే వాసుదేవ భగవానుఁడు ప్రసన్నుఁడు కాఁడో ఆ జ్ఞానమును నే నత్యంత తుచ్ఛముగను, వ్యర్థముగను భావించుచున్నాను'' అనెను.

వ్యాసుఁడు "స్వామీ! నేను మహాభారత మందును, అన్య పురాణములందును భగవద్గుణములను, అవతార చరిత్రలను గూర్చి వర్ణించితిని'' అనెను.

అంత మిక్కిలి స్నేహముతో నారదుఁడు "చూడుము, నీవు కొంచెమైనను భగవద్యశమును వర్ణిపలేదని నే నననుు. నీవు వర్ణించితివి కాని ఒక్క మాట, వ్యాసా! నీవు సకామ కర్మలను గూర్చి వ్యాఖ్యానించితివి. దానిలో నీవు వాటి కెంతటి బల మీయవలయునో అంతటి బల మిచ్చితివి. అట్టి బలము భగవల్లీలల కీయఁబడలే దని నీవు ఒప్పుకొనితీరవలయును. నీ వొక్క విషయమును ఆలోచింపుము. భగవద్భక్తి లేని యీ ధర్మ కర్మములు దేనికి?'' అనెను.

వ్యాసుఁడు "మునివరా! కవితయం దందఱకు రుచి కలిగింపవలెను'' అనెను.

నారదుఁడు "ఉపమాలంకారము లధికముగ నుండి యమకానుప్రాసలకు కొఱత లేకుండియు, పదవిన్యాసావళి కూడ చక్కఁగాఁ గూర్చబడినప్పటికిని పరమపావన ప్రభు పావన యశము దేనిలో వర్ణింపఁబడ లేదో దానిని నేను కవిత యని అనఁజాలను. వాక్కు ఉన్నందులకు సార్థకత కేవలము భగవన్నామ, గుణ గానమునందే కలదు. దేనిలో కమనీయ కమలములు లేవో, అమృతోపమానమగు స్వచ్ఛ స్వాదిష్ట సుమధుర జలములు లేవో, శుభ్ర విమల మనోహర మౌక్తికములు లేవో అట్టి సరోవరములో హంస లుండవు. ఆ బురదగుంటలో నీటికాకులు మాత్రమే యుండును. భగవద్భక్తులు హంసలవలెనే గుణగ్రాహులుగను, నిర్మలులుగను, అందఱ కానంద మొసంగువారుగ నుందురు."

వ్యాసుఁడు "ప్రభో! లోకరంజన సామగ్రి లేకున్న యెడల నా కవితను లోకు లాదరింపనే ఆదరింపరు" అనెను.

నారదుఁడు "కవితలో నుండవలసిన సమస్తగుణములు లేకున్నప్పటికిని, భగవద్యశమే కవితలో కలదో; భగవద్భక్తితో నది కూడుకొన్నయెడల సాధుజనము ఓ వ్యాసా! దాని నాదరింతురు. విషయాసక్తుల విషయము నేను చెప్పుట లేదు. ఇంకొక విషయ మెందుకు? భక్తిరహిత మగు మోక్ష సాధనము, జ్ఞానము శోభింపదు. కేవలము ఇహలోక పరలోక దివ్యసుఖముల ననుభవించుటకే సకామముతోఁ జేయఁబడిన కర్మలు, ప్రభు ప్రీత్యర్థముగఁ జేయఁబడని కర్మ లెట్లు శోభింపఁ గలవు? కావున నో బుద్ధిమంతుఁడవగు నో వ్యాసా! మనో

హారమును, సర్వులకు సుఖము నొసంగునదియు, జగత్పావనము కావించునదియు నగు శ్రీకృష్ణుని కమనీయ కథల నిప్పుడు నీవు సంకలనము కావింపుము. వాటినే వర్ణించుము.

వ్యాసుఁడు "మహారాజా! నే నెట్లు వర్ణించెదను? మీరు నాకు చెప్పుచుండు నెడల నేను వ్రాయుచుందును" అనెను.

ఇది వినునప్పటికి నారదుఁడు కిలకిల నవ్వి అట్టహాసము కావించి నవ్వుచు "మహాభాగా! ఇదేమి, నీ విట్టి మాటలు మాటలాడుచున్నావు. నీకు తెలియని దేమున్నది? నీవు సాధారణ మానవులవలె లీలల నేల చూపించెదవు? ఏకాగ్ర చిత్తుఁడవై ధ్యానమందు భగవల్లీలలను బ్రత్యక్షము చేసికొనుము. నీకు కఠినమగున దేదియైన కలదా? నీవు కేవలము విశుద్ధ భగవల్లీలలను, భగవంతునియొక్కయు, భక్తులయొక్కయు చారు చరిత్రలను వర్ణించుము. ఇదే నీవు చేయవలసినది. అన్యవస్తువులను వర్ణించుటచే ధ్వజమువలె చిత్తము చంచల మగును. సుడిగుండములోఁ బడిన నౌకవలె బుద్ధి యూగులాడుచుండును. ప్రవాహములో మునుఁగునట్లు మనస్సు వ్యాకులత చెందును."

వ్యాసుఁడు "మహాభారతములో నే నేమియు వదల లేదు. దానిలో ధర్మార్థ, కామ, మోక్ష, ప్రేమ భక్తిని గూర్చిన సమస్త విషయవివేచనము కలదు."

నారదుఁడు మందహాసము చేయుచు "వ్యాసా! నేను నీ మహాభారతమును గూర్చి స్తుతించెదను. నీ పరిశ్రమను

శ్లాఘనీయ మైనది. దానిలో సమస్తమును నింపివేసితి వను నది కూడ నే నొప్పుకొందు. కాని యో మహాభాగా! నా మాట నమ్ముము; దానివలన నందఱకుఁ గల్యాణము కలుగుట కఠినము. మహాభారతము గొప్ప దుర్గము వంటిది; దృఢమగు కోట వంటిది. దానిలో నీ వనేక భవనములను, సరోవరములను, రాజమార్గములను, ఫలించు వృక్షములను, వివిధము లగు పరిచారక, పరిచారికలను రచించితివి. ఆ ఫలవృక్షముల మధ్య మధ్య అక్కడక్కడ అమృత ఫల వృక్షములను గూడ నాటితివి. ఒక్కొక్క భవనములో మూలమూలల లందు కొట్టులలో నక్కడక్కడ అమృత ఫలములను దాచి యుంచితివి. ఎవఁడైన భేదము తెలిసిన బుద్ధిమంతుఁడు మాత్రమే మిక్కిలి శ్రమతో వెదకిన యెడలనే యా యమృత కల్ప ఫలములను బొందఁ గలుగును. రాత్రింబవళ్ళు దానిలో విచరించు తోటమాలి లేక సేవకుఁడు మాత్రమే యా కల్ప పాదపముల గుర్తింపఁ గలుగును. సర్వసాధారణులు వాటిని తెలిసికొన నసమర్థు లగుదురు. అందఱును జూడఁగానే సమస్తము తెలియఁగు నట్లును దానిని సేవించుటచేతనే అందఱును సుఖమును బొందఁగల దివ్య రస ఫలమును రచింప వలె నని కోరుచున్నాను. దానిని వెదకుట కే మాత్రము శ్రమ కలుగ రాదు. ఇంతే కాదు, ఆ ఫలములోని పైచర్మము, లోపలి గుజ్జు యేమియు వదలి వేయుటకు వీలుకానిది నుండవలయును. అందఱును సేవింపఁ దగిన మధుర రస మొక ముద్దగ నుండవలయును. ఆ ముద్దయినను కొఱికిన దంతములకుఁ గష్టమును గలిగించు కటు రస యుక్తముగ నుండరాదు.

చాలసేపు చీకినగాని, లేక పండ్లతో కొఱికినగాని రసము రాకుండు నట్టి కలకండవలె గట్టిగా నుండరాదు. ఆ ఫలము లోపలను రసము నిండి యుండవలెను. బయటను చీకునట్లుగ నుండవలెను. గులాబ్ జామున్ వలెను, రస గుల్లావలె నుండ వలెను. లేక కొండ తేనె యుండవలె నుండవలయును. లేదా వేడి వేడి కఱకఱ లాడు జిలేబి వలె నుండవలయును. అప్పు డప్పుడు తీసిన వెన్న ముద్దలో కలకండ పొడి కలిపి పిసికిన ట్లుండవలెను. సమపాళ్ళుగ చక్కెర, నేయి కలిపిన మెత్తని లడ్డువలె నుండవలయును.

మహాభారతములో నీవు కామ్య కర్మావశ్యకతను గూర్చి అధికముగఁ బ్రశంసించితివి. ఫలాని ఋషి యుండెడు వాఁడు; ఆతఁడు వివాహము చేసికొనక పోఁగా స్వర్గమునకు వెళ్ళఁజాలక పోయినాఁడు. అంత నాతనికి ఎట్లు వివాహము చేసికొని పిల్లలను శీఘ్రముగఁ గందునా యను చింత కలి గెను. సంతానము లేకున్న స్వర్గము లేదు; ఉద్ధారమును లేదు. అందువలన శీఘ్ర సంతానేచ్ఛచే పక్షియై పుత్రుని గనెను. ఫలాని ఋషియొక్క పితరులు సంతానము లేక పోవుటచే నరకమునకు వెళ్ళుచుండిరి. అందువలన తపస్సును మానివేసి యాతఁడు వివాహము చేసికొనవలసి వచ్చినది. ఇట్లనేక కథలను దానిలో నింపివేసితివి. ఒకవేళ నివియన్నియు నిజమే కావచ్చును. ప్రపంచములో వీటితోఁ గూడ ప్రయో జనము కలదు; కాని కర్మలయందు ప్రాణులకు స్వతః ప్రవృత్తి కలదు. వివాహము చేసికొనుటకు, సంతానము గనుటకు స్త్రీ పురుషులకు స్వాభావికముగ కోరిక యుండియే తీరును.

నేర్పకుండఁగనే యీ కర్మలయందు తమకుఁ దామే ప్రవృత్తు లగుచుందురు. ఇంతకు ధర్మముద్వారా వారి స్వేచ్ఛావృత్తిని సీమితము కావించుటయే జరుగుచున్నది. కాని అక్కడక్కడ విశదముగ వీటి విషయముననే చర్చ జరిగియుండుటచే లోకులు సంసారములోఁ గామమే సారమని భావించు చున్నారు. సంతానోత్పత్తియే పరమ పురుషార్థ మను చున్నారు. అక్కడక్కడ సూక్ష్మరూపమున నీవు భగవద్భక్తి వర్ణనము కావించితివి. ఇంతటి మహాసాగరములోఁ గామ్య కర్మలయందే స్వాభావిక ప్రవృత్తి కలిగిన పురుషుల కవి జ్ఞాపక ముండనే యుండవు. వారు స్వప్రయోజన విషయము లనే అన్వేషించుచుందురు. తన మనో విషయమును చిత్త మతి శీఘ్రముగ గ్రహించును. ఏదైనఁ బ్రసంగము వచ్చిన యెడల "ఇది వ్యాసవచన"మని పలుకుచుందురు.

వ్యాసా! నీవు చెడ్డగాఁ దలఁపకుము. మా బుద్ధులలో నీ విషయము లేనే లేదు. నీవు ఒక పక్షము విషయమునే చెప్పితివి."

అంత వ్యాసుఁడు "స్వామీ! నేను సన్న్యాస మార్గ మును గూర్చి కూడ వర్ణించియుంటిని. కామ్యకర్మలయందు రుచి లేనివారు సంసారత్యాగులగు విరాగులు కావచ్చును. సన్న్యాసమును బుచ్చుకొని సదసద్వివేచనము కావించుచు జ్ఞానమార్గావలంబనమును గావింపవచ్చును" అనెను.

నారదుఁడు "నీవన్నది నిజమే. కాని అందఱును విలక్షణ బుద్ధిగల వ్యక్తులుగ నుండరని నీ వాలోచించలేదు. ఆ సచ్చిదానందస్వరూప విభు భగవానుని మర్మమును పరమ యోగ్యవంతుఁ డగువాఁడే అభ్యాసము ద్వారా అనుభవ పూర్వకముగఁ దెలిసికొనఁ గలఁడు. కాని కర్మయందు ప్రవృత్తి కలవారలు తమకు బంధనకారణముకాని కర్మలను జేయఁదలఁతురు. కర్మలు చేయుచున్నప్పటికిని అవి నిష్కామమునకుఁ దీసికొని పోవునవిగ నుండవలెను. ఇట్టివారల కొఱకు నీవు కర్మములకుఁ దృష్టి నొసంగునట్టియు, మనః ప్రసన్నతను బ్రసాదించునట్టియు నగు లలిత భగవల్లీలలను వర్ణించుము. దానివలన కర్మబంధన ముండదు. భగవల్లోకము కూడ ప్రాప్తింపఁగలదు.

మంచిది, నీకు నే నొక విషయము చెప్పెదను. దానిని గూర్చి విచారించుము. ఒక వ్యక్తి కలఁడనుకొనుము. నీవు చెప్పిన విధ్యుక్త వర్ణాశ్రమధర్మములలోని కామ్య కర్మానుష్ఠానము చేసినాఁడు; కాని యా కర్మలను భగవద్భక్తి శూన్యుఁడై చేయును. అట్టివాని కెన్నఁడైన కల్యాణము కలుగునా? కర్మఫలము లవశ్యము కలిగితీరును. వానికి పుణ్య లోకప్రాప్తి కలుగవచ్చును; స్వర్గము లభింపవచ్చును; కాని యాతఁడు కర్మచక్రములోఁ బడిపోవలసి యుండును. దీనికి వ్యతిరేకముగ నిరంతరము భగవద్భక్తిలోనే యుండు వ్యక్తి యొకఁడు కలఁడు. తన స్వధర్మపాలనమును గూడ మఱచి పోవునంతటి తల్లీనతఁగ నాతఁడు భగవత్ప్రేమలో నుండును. ఆతఁడు శ్రీకృష్ణభక్తిని మాత్రమే తన పరమధర్మముగఁ జేసి

కొని యుండును. దైవయోగముచే నొకవేళ నాతనికి పతనము కలిగి భజన పూజనములను వదలివేసిన యెడల వాని కన్నియు వ్యర్థమై నట్లేనా? కాని, ఆతఁడు మరల భగవద్భక్తిని బొందును. ఆతఁడు చేసిన భక్తిసమస్త విఘ్నములను నాశము కావించి కల్యాణమార్గమునఁ బడ వేయఁగలదు.

ఇంద్రియ విషయములు ఈ లోకమునకు సంబంధించినవి కానిందు పరలోకమునకు సంబంధించినవి కానిందు వాటి కొఱకు ప్రయత్నించుట వ్యర్థము. ప్రారబ్ధానుసారముగ నివి ప్రాప్తించి తీరును. సాంసారికులలో ధనికుఁడు కావలఁ పనివాఁ డెవఁ డున్నాఁడు? కాని అందఱును ధనికులు కారు. మృత్యువు నెవరు కోరుదురు? అట్లు కోరకున్నను జన్మించిన వానికి మృత్యువు వచ్చితీరును. నానావిధములగు జ్వరాది రోగములను స్వేచ్ఛగా నెవరు వరింతురు? అట్లు వరింపకున్నను రోగము ప్రారబ్ధానుసారముగ నందఱ శరీరము లందును తమ కవియే యుత్పన్న మగును. ఇట్లే యింద్రియ సుఖములు కూడాను. చాలమంది జ్ఞానులు శారీరక సుఖముల కొఱకై ప్రయత్నింపరు. అట్లు ప్రయత్నింపకున్నను ప్రారబ్ధానుసారముగ వారికి శారీరక సుఖములు ప్రాప్తించును. ఈ శారీరక సుఖదుఃఖములు రెండును ప్రారబ్ధానుసారముగ వచ్చుచుఁ బోవుచుండును. అన్ని జన్మము లందిట్లే యుండును. రాజు కే సుఖము తన రాణి ద్వారా కలుగుచుండునో కుక్కకు అదే సుఖము దాని ఆడకుక్క వలన కలదు. దీనికై చింతించుటయు, ప్రయత్నించుటయు, సర్వదా దీనికై వ్యగ్రత చెందియుండుట వ్యర్థము. సమస్త

జన్మలు ప్రారబ్ధానుసారముగఁ బ్రాప్తించుచుండును. నీ వే జన్మ మెత్తినను ప్రారబ్ధము నీ వెంటనే యుండును. దాని ననుసరించియే సుఖ దుఃఖములు కలుగుచుండును. వానిని చింతించినను లభించును, చింతింపకున్నను లభించును. కావున మానవుఁ డీ విషయములో నిశ్చింతుఁడై యుండవల యును'' అనెను.

వ్యాసుఁడు ''అయితే, స్వామీ! మానవుఁ డిం కేమి చేయవలయును? మన మెల్లప్పుడును పొట్ట నింపుకొనుట భార్యా బిడ్డలను రక్షించుకొనుట చేయుచున్నాము. ప్రాప్తించని వస్తువుల ప్రాప్తికొఱకును, మన దగ్గఱ నున్నవి, మనకు శ్రమచే గాని లేక స్వతఃగానే ప్రాప్తించినవాటిని రక్షించుకొనుటకును మన మెల్లప్పుడును వ్యగ్రుల మై యుందుము. సాంసారికుల వద్ద యోగ, క్షేమము లను రెండు పనులే యుండును. యోగము సామగ్రులను గూర్చుటయు, క్షేమ మనఁగాఁ బ్రోవుచేసిన వస్తువులను రక్షించుకొని జాగ్ర త్తగ నుంచుకొనుటయు నగును. మీరు ఈ రెంటి చింతను విడువవలయు నని చెప్పుచున్నారు. ఇంకఁ గర్తవ్య మేమున్నది? చేతిలోఁ జేయి వైచికొని కూర్చుడవలసినదే కదా? అకర్మణ్యా, అలసత్వము లలవడవా?'' అని అడిగెను.

నారదుఁడు "నేను అకర్మణ్యా, అలసత్వముల నలవ రచుకొమ్మని చెప్పుటలేదు. సాంసారిక వస్తువులను బ్రోవు చేయుటయు, రక్షించుటయు నను చింతారూప మగు కర్మ లత్యంత తుచ్ఛములు ఎనుబది నాల్గు లక్షల యోనులలో

ర్భమించినప్పటికి ప్రాప్తింపని కర్మను జేయవలెనని నేను చెప్పు చున్నాను. అదియే మహత్కర్మ. దానికొఱకు చేయఁ బడిన ప్రయత్నము సార్థక మైనది. అదియే మానవునకుఁ బరమ పురుషార్థ మైనది. దానివలన నరజన్మమునకుఁ గృత కృత్యత కలదు. దాని నాశ్రయించి మానవుఁడు నిశ్చింతుఁడు కాఁగలఁడు. నీవు దానిని వర్ణింపక వ్యాకులత చెందుచు న్నావు. దానినిగూర్చి విశద విశుద్ధ వర్ణన కావింపకపోవుట చేతనే నీవు నీలో నేదియో లోటును, అకృతకృత్యతను అను భవించుచున్నావు. ఎవఁడు యత్కించిత్తుగ నైన నా రసము నాస్వాదించినయెడల నాతఁడు కృతకృత్యుఁడైనట్లే.

ప్రియదర్శనుఁడ వగు నో వ్యాసా! ఎవని మనమందిర మందు ముకుందుని మనోహరమూర్తి ప్రతిష్ఠిత మైనదో ఆతఁడు సాంసారిక ఆవాగమనములనుండి శాశ్వతముగ ముక్తుఁడు కాఁగలఁడు. ఆతఁడు సదా ఆనందసాగరమున మునుఁకలు వేయుచుండును. నీవే యాలోచింపుము; ఆ దివ్య రసమును ఒక్కసారి రుచిచూచినను, దాని మాధుర్యము ననుభవించినను దానిని మరల నెన్నటికైన వదలిపెట్టఁగలఁడా?

ఈ చరాచర జగత్తే శ్రీహరియొక్క సాకార స్వరూప మనియు, దీనిలో నాతఁడు సమాన రూపమున రమించు చున్నాఁ డనియు నీవనవచ్చును. ఇది యంతయు సత్యమే. భగవత్సృష్టికి భిన్నమైనది కొంచెమైనను లేదు. హరిమయముకాని ద్రవ్యము పరమాణువు లేదు. అణుపరిమాణమందు దాతఁడే వ్యాప్తమైనాఁడు. అయినను ఈ జగత్తునకు విలక్షణముగ నొక

భగవంతుఁడు వేఱుగ నున్నాఁడు. వానిలో దుఃఖావేశము లేదు. చింతాగంధము లేదు. పరమానంద స్వరూపుఁడు. పరమ సుఖ స్వరూపుఁడు. ఆతఁడు సుఖసాగరుఁడు. ఆనంద నిధి. ఆతఁడు సగుణసాకారుఁడు. మురళీధారి. అందఱి మనస్సులను హరించువాఁడు. అందఱను ప్రేమించువాఁడు. ఆతని మందహాసము మనస్సు ముగ్ధపఱచును. ఆతని అనుపమ రూపము కన్నులలోనికిఁ జొచ్చుకొని పోవుటచే సర్వత్ర ఆతఁడే కనఁబడుచుండును. ఈ జగత్తంతయు విలీన మగును. ఆతని చూపులో మాదకత కలదు. ఆతని వంశీరవమున విశ్వమోహినీ శక్తి కలదు. ఆతని కథ లేమైన చెప్పుము. ఆతని చరిత్రలవలన నీవు కృతకృత్యుఁడ వగుదువు. ఆతనిని వర్ణించి నీవు ధన్యుఁడ వగుదువు.

నీవు సర్వజ్ఞుఁడవు. లోకమున కూరక చూపుట కీ భావమును నటించుచున్నావు; నాకు గౌరవ మిచ్చుచున్నావు. జ్ఞానపరంపరను నిర్మించుట కీ నటన చేయుచున్నావు. నీవు సాధారణ మానవుఁడవు కావు. నీవు స్వయముగ సాక్షాత్తుగ శ్రీహరి అంశావతారమవు. నీవు లోకకల్యాణము నిమిత్తమై యీ యవతారమును ధరించితివి. అజన్ముఁడ వయ్యు నీవు జన్మించితివి. నీవే సమస్తక్రీడలు కావించితివి. శాంతితో నేకాంతమందు నీవొనర్చిన క్రీడలను స్మరించి వాటిని బాగుగా వర్ణింపవలయును. వాటివలన లోకులకుఁ గల్యాణము కలుగవలయును. బుద్ధిమంతులలో తీక్ష్ణాతి తీక్ష్ణమగు బుద్ధి యున్నందులకు, తపస్సులలోని అత్యుత్కట తపస్సున్నందులకును, సమస్త విధములగు వేదశాస్త్రాధ్యయనము చేసినందులకును,

సమస్త విధము లగు రాజసూయ, అశ్వమేధాది యజ్ఞములు చేసినందులకు; ఇంతయేల? జ్ఞాన, ధ్యానం కథావార్త లన్నిటికి నేకమాత్ర ఫలము వాసుదేవ భగవానుని చరణము లందు టకు భక్తి కలుగుటయే. సమస్త కథ లందుం గల సార్థకత నందనందన ఆనంద కంద శ్రీకృష్ణ చంద్రుని చారుచరిత్రలను వర్ణించుటలోం గలదు. ఏవాక్కుచే వాసుదేవుని గుణవర్ణనము కావింపం బడలేదో ఆవాక్కు వాక్కుకాదు. పరమ శ్రవణీయ ములగు శ్రీకృష్ణుని గుణ గానమును వినని చెవులు చెవులు కావు. వ్యర్థ ఛిద్ర మాత్రములు. శ్రీహరియొక్క మంగళమయ మనోహర నామములు మానవుని సంసార సాగరమునుండి దాటింపం గలవు. విపత్తునుండి రక్షించును. శాశ్వత శాంతి సదనమునకు సుఖ పూర్వకముగం జేర్చును.

వ్యాసా! నేను నా యనుభవ పూర్వక మగు వాక్య ములను పలుకుచున్నాను గాని విన్న విషయములు చెప్పుట లేదు. నేను పూర్వ జన్మములో దాసీ పుత్రుండను. సాధనా విహీనుండను. నాకు ద్విజాతులకు వలె సంస్కారములు లేవు. గురుకుల వాసముచేసి అధ్యయనమును జేయలేదు. వీటికి నా కధికారమును లేదు. నే ననాథుండను. నా తండ్రి యెవరో కూడ నాకు తెలియదు. ఈ విధముగ కుల, కర్మ, విద్యా, సాధనాదు లేమియు లేనివాండ నైనప్పటికిని కేవలము సుమధుర శ్రీహరినామ గాన ప్రభావము చేతనే వాసుదేవ భగవానుని గూర్చి శ్రద్ధతోం జేయంబడిన సంకీర్తన ప్రభా వము చేతనే నేనీస్థితికి వచ్చితిని. లోక నిందితుండను లోక వందితుండ నైతిని. దాసీ పుత్రుండను బ్రహ్మ మానసపుత్రుండ

నని పిలువఁబడితిని. మానవుఁడను దేవర్షి నైతిని. అనాదృతుఁడను నేఁడు చరాచర లోకమునకుఁ పరమాదరణీయుఁడ నైతిని. వీటి అన్నిటికిని ఏకమాత్ర కారణము వాసుదేవ భగవానుని యందు భక్తియే. ఆతని నామ, గుణ, లీలా శ్రవణ, గాన, కథనముల యొక్క పరిణామమే. కావున నీవు కూడ భగవంతుని యొక్కయు, భక్తుల యొక్కయు యశోగానమును కావించుము. దీనివలన లోకములో నీకు గొప్ప ఖ్యాతి లభింపఁగలదు. సాంసారికులకు మిక్కిలి యుపకారము కలుగును. దీని నాశ్రయించి వారు అపార సంసారసాగరమును సరళతా పూర్వకముగ తరింపఁగలరు. నీకును శాశ్వత శాంతి లభింపఁ గలదు'' అనెను.

ఇట్లు పలికి నారదుఁడు మెదలకుండెను. వ్యాసుఁడు ఉత్సాహముతో నాతని వైపుననే చూచుచుండెను.

ఛప్పయ

మద మాతే కో యథా మద్య కా హిత జతలానా।
తథా కర్మమేఁ నిరత పురుష కో విషయ బతానా॥

పుని బోలే ముని వ్యాసా—'ఆశ అబ హోగీ పూరీ।
కింతు కథా కుఛ్ కహీం ఆపనే అభీ అధూరీ॥

దాసీసుత కైసే భయే, సంత్ సంగ్ కస లగీ మతి।
చరిత సుఖద సబ్ సునాదో, హోత హృదయమేఁ హర్ష అతి॥

## అర్థము

మదమత్తుఁడగు వానికి మద్య మెట్లు హితముగ నుండునో, అట్లే కర్మ నిరతునకు విషయము లని చెప్పవలయును. తర్వాత వ్యాస మహాముని యిట్లు పలికెను—'ఇప్పుడాశ నెఱవేఱఁ గలదు. కాని మీ రిప్పుడు చెప్పిన కథ కొంచెము అసంపూర్తిగ నున్నది.

మీరు దాసీ సుతు లెట్లైతిరి? సత్సంగమునందు నీ మన స్సెట్లు లగ్నమైనది? ఈ సుఖద చరిత్రము సంతను వినిపింపుఁడు. అపుడు నా హృదయమునందు హర్షము కలుగఁ గలదు.

# నారద పూర్వజన్మ వృత్తాంతము

శ్లో॥ అహం పురా తీత భవేఽభవం మునే।
దాస్యాస్తు కస్యాశ్చన వేదవాదినామ్॥
నిరూపితో బాలక ఏవ యోగినామ్,
శుశ్రూషణే ప్రావృషి నిర్వివిక్షతామ్॥ *
(శ్రీమద్భాగవతము ౧ స్కం. ౫ అ. ౨౩ శ్లో.,

ఛప్పయ

ముని వర ! మైంనే మహామోహి వశ దుర్గతి పాఈ।
కింతు కృష్ణ కీ కృపా పాఇ వహ్ విపతి బితాఈ॥
చారు చరిత హైం మధుర కృష్ణ కే అతి సుఖకారీ।
ఉనకా అభినయ రచ్యో మునిన ఆజ్ఞా సిరధారీ॥
లీలా రాస విలాస కీ, అతి రహస్యయుత మధుమఈ।
నిరఖి మునిన కీ సుధి గఈ, మతి మోహిత సబ కీ భఈ॥

అర్థము

ఓ వ్యాస మహామునీ! నేను మహామోహవశమున దుర్గతిని బొందితిని; కాని శ్రీకృష్ణుని కృపావిశేషమున నా విపత్తును గడచితిని. శ్రీకృష్ణుని చారు చరిత్ర మతి మధుర మైనది; అతి సుఖకర మైనది. మునుల యాజ్ఞను శిరసావహించి దాని నభినయించితిని.

---

* నారదుఁడు వ్యాస భగవానునితో నిట్లు చెప్పుచున్నాఁడు— "ఓ మునీ! నీ పూర్వ కల్పమునందు నేను వేదవాదు లగు బ్రాహ్మణుల యింట నొక దాసీ గర్భమునఁ బుట్టితిని. ఆ సమయమున మా కడకు చాతుర్మాస్య వ్రతము కొఱకు కొంతకాల ముండుటకు కొందఱు మహాత్ములు గుంపుగ వచ్చిరి. నేను నా చిన్నతనములోనే వారి సేవకై నియుక్తుఁడ నైతిని.

అతి రహస్యయుతమును, మధుమయము నగు రాసలీలా విలాసమును మునులు కాంచి శరీరములు మఱచిరి. అందఱి మతులు మోహితము లయ్యెను.

శ్రోతావక్త లిద్దరును రసికులైనచో సుఖద మగు నానంద స్రోత యుబుకును. వక్తకంటె శ్రోత గొప్పతన మని చెప్పఁబడినది. వక్త గోవువంటివాఁడు. దాని స్తనములలో యథేష్టముగ పాలు నిండియున్నవి; కాని శ్రోత యను దూడ ఉల్లాస స్నేహములతో స్తనములందు కుమ్మి వాటి నది ప్రేమ పూర్వకముగ, పానము చేయునంతవఱకు గోవు పాల నీయనే ఈయదు. దూడ లేకపోయినప్పటికిని వ్యాపారి స్వార్థవశమున గోవుదగ్గఱనుండి పాలను లాగును; కాని దాని మీఁద వాని ప్రేమ లేదు. అనురాగముతోఁ దీయఁబడిన పాల గుణము అద్భుతముగ నుండును. తాంబూర తీగలలో సప్తస్వరముల సుమధుర ధ్వను లున్నవి. కాని యెవ్వరైన వానిని మీటునంత వఱకు దానినుండి హృదయాహ్లాదమును కావించు సంగీత సృష్టి కలుగదు. నారదునివంటి వక్త, వ్యాసునివంటి వేదవేదాంగవేత్త, పరమ రసికుఁడగు శ్రోత యున్నప్పుడు రస సముద్ర ముప్పొంగకుండుట అసంభవము.

నారదుఁడు తన పూర్వజన్మ అసంపూర్ణకథను సూత్ర రూపముగఁ జెప్పి మెదలకుండునప్పటికి వ్యాసుని యుత్సాహ మతిశయించెను. అతఁ డత్యంతానురాగముతో "స్వామీ! మీ రొక యద్భుత విషయమును జెప్పితిరి. మీరు మొదట దాసీ పుత్రు లనియు, భగవన్నామ, గుణ, కీర్తన ప్రభావ

ముచే దేవర్షు లైతిరనియుఁ జెప్పితిరి మీ రీ నారద శరీరము చేతనే దాసీపుత్రు లైతిరా లేక వేఱు దేహము తోడనా? మీరు పితామహు లగు బ్రహ్మమానస పుత్రులని మే మిది వఱలో వినుచుంటిమి. సృష్ట్యారంభమున నుద్భవించితి రనియు, మీ వద్దకు మాయామోహము చేరఁజాలదనియు వింటిని. అట్టియెడ మీ రే కర్మకారణమున దాసీ పుత్రు లైతిరి?" అని అడిగెను.

వ్యాసుని వాక్యములను విని మందహాసము చేయుచు నారదుఁడు "వ్యాసదేవా! నే నీ నారద శరీరముచే దాసీ పుత్రుఁడను కాలేదు. మొదట నేను ఉపబర్హణుఁ డను గంధర్వుఁడను. స్వకృతాపరాధముచేత నే నేను గంధర్వయోని నుండి యీమర్త్యలోకమందు శూద్రుఁడనై పుట్టితిని" అనెను.

అత్యంతాశ్చర్యమును బ్రకటించుచు వ్యాసుఁడు 'ప్రభో! మీ రొకదాని కొకటి అద్భుత విషయమును జెప్పి నా సందేహము నినుమడించుచున్నారు. మీరు విశ్వమునం తటను స్వేచ్ఛగా నే విఘ్నమును లేక యే భ్రమణను చేయుచుందు రనియు, మీరు జన్మ కర్మబంధన రహితు లనియు లోకు లందఱును జెప్పఁగా నేను వినియుంటిని. అట్టి యెడ నెప్పుడు గంధర్వు లైతిరి? దాసీ పుత్రు లెప్పు డైతిరి? ఈ విషయములన్నియు మీ కెట్లు జ్ఞాపకమున్నవి? మాబోటి వారికి నిన్నటిరాత్రి చూచిన స్వప్నముకూడ జ్ఞాపకముండదు" అని అడిగెను.

నారదుఁడు తన స్వరమును గొంచెముగ హెచ్చించి ప్రేమకోప స్వరమున "వ్యాసా! నీ వేమి పిల్లల వలె శంకింప వలదు. అన్నిటి నెఱింగియు నీవు అజ్ఞానుల వలె ప్రశ్నించుచున్నావు. ఏమయ్యా! ఈ సృష్టి యిప్పుడైనదా? నీవు ఆదివారము మధ్యాహ్న మందు శ్వేతద్వీపములో నుండి, మరల ఆదివారముననే మధ్యాహ్న మందు బదరీవనమున శ్రీనారాయణ ప్రసాదము నెట్లు గ్రహించితివి? ఆదివార మొక్కటియే కదా! మధ్యాహ్న సమయము కేవలము ఆదివారమునాఁడే యుండదు. ప్రతిదినమును ప్రాతర్మధ్యాహ్న సాయంకాలము లుండును, ఆదివారము, సోమవారము ఎల్లప్పుడును వచ్చుచుఁ బోవుచుండును. సంవత్సరము కాగానే ఆ ఆఱు ఋతువులు మరల మరల వచ్చుచుండును. ఇది నిరవధి. అనఁగా నెడతెంపు లేనిది. ఈ చక్ర మెల్లప్పుడును నడచుచుండును. మూర్ఖులు, అజ్ఞులు, సమయ, మహాత్మ్యమును, కాల విపర్యయమును దెలియని వారు సమయమున కవధి లేదా యని శంకించుచుందురు. ఆ బుద్ధిహీనుల దృష్టి యందు కేవలము కొన్ని వేలు, లక్షల వర్షముల సమయమే పరిధిగా నున్నది. నా సమక్షమున నెన్నిమార్లు సృష్టి అయినదో తెలియదు. ఎందరు బ్రహ్మలు నేను చూచుచుండఁగనే మారిపోయినారో తెలియదు. మానవుఁడు నిద్రించి ప్రాతఃకాలమున లేచి యెట్లాశ్చర్యమును జెందఁడో, అట్లే ప్రళయానంతరమున నీ సృష్టి క్రమమును గాంచిన నాకు ఆశ్చర్యమేమియు కలుగదు. బ్రహ్మసంకల్పముచే నేను పుట్టుచుందును, అందువలన నేను బ్రహ్మపుత్రుఁడ నని పిలువఁ బడుచున్నాను.

లేకున్న నే నెందఱ బ్రహ్మల రాకపోకలను జూచెడు వాఁడనో. నీవీ సృష్టిక్రమ శృంఖలా బంధములో పడవలదు. సముద్రములో సదా అనంతము లగు తరంగములు ఎట్లు వచ్చుచుఁ బోవుచుండునో అట్లే ఈ సృష్టిక్రమముకూడ. గంగాప్రవాహ మెట్లు నిరంతరము ప్రవహించుచుండునో అట్లే యీ సంసార చక్రము సాగుచుండును. దీని వార, తిథి, సంవత్సర చక్రములో పడితివా నీ కెన్నటికిని జ్ఞానము కలుగదు. దీనిలో సారాతిసార మగు భగవద్భక్తిని గూర్చి విచారించుము. ఏ సంఘటనముచే. ఏ ఉపాఖ్యానముచే వాసుదేవ భగవానుని చరణ చింతనము జరుగునో, ఏ కథా శ్రవణముచేఁ గేశవుని పునీత పాదపద్మముల మీఁద ప్రేమ యుత్పన్న మగునో యదియే విచారణీయ మగు విషయము. నే నీ కల్పములోని సమాచారమును జెప్పుటలేదు, వేలాది కల్పములోని సమాచారమును జెప్పుచున్నాను'' అనెను. వ్యాసుఁడు వినీత భావముతో ''దీనబంధో! నా సందేహము తీరినది. మీరు గంధర్వు లెట్లైతిరో ఆ వృత్తాంతము నిప్పుడు చెప్పుఁడు'' అని అడిగెను.

కొంచెముసేపు మౌనముగనుండి మరల గంభీరుఁడై ప్రేమాశ్రువులను తుడిచియుంచుచు గద్గద కంఠముతో నారదుఁడు ''వ్యాసా! ఈ కథ చాల మనోహరమైనది. హృదయమందు ప్రేమభావ సంచారము కావించునది. దానిని నీ సమ్ముఖమునఁ బ్రకటింతును. శ్రద్ధా పూర్వకముగ వినుము'' అనెను.

ఒకానొకప్పుడు దేవేంద్రుని సభలో సమస్త ఋషులు, మునులు, యక్షులు, గంధర్వులు, విద్యాధరులు, దేవతా గణము కూర్చుండి యుండిరి. ఋషులు "నారదా! నీకు సర్వత్ర అవ్యాహతగతి కలదు. గోలోకములో సదా శ్రీహరి రాసలీల చేయుచుండు నని వినియున్నాము. ఆ లీల అత్యంతాహ్లాద కారిణి. ఏలననఁగా దానికి జనని ఆధ్యాశక్తి శ్రీమతి రాధికాదేవి. నీ వనేకమార్లు గోలోకమునకు వెళ్ళుచుందువు. యత్నించి త్వరగ నా లీలా రసాస్వాదనమును మాకుఁ గూడ కావింపుము" అని అడిగిరి.

"మునులారా! నందనందనుని యా లీల అత్యంత రహస్య మైనది. అవన్నియు ప్రకృతి కతీత మగు విషయములు. ఏ యింద్రియములు స్వాభావికముగ నే విషయముల వైపునకు తమకుఁ దామే పరువిడుచుండునో అవి ఆ దివ్య లీల నెట్లు దర్శింపఁ గలవు? దీనివలన నొక నూతనానర్థము రాఁగలదు. ఆ ప్రకృత్యతీత మగు దివ్యాతి దివ్య సౌందర్యమందు కామభావ సంకల్పము కూడ కలిగినా చేసిన దంతయు వ్యర్థము కాఁగలదు" అని నే నంటిని.

ఋషులు పట్టుదలతో "నారదా! మాకు చాల కోరిక గ నున్నది. దానిని మేము చూడవలె నని ఆకులత చెందుచున్నాము. ప్రత్యక్షముగఁ జూచు భాగ్యము మా కెట్లు కలుగును? నీవు అధిసయముద్వారా యత్నించి దాభాసముగ మాకు చూపించుము. దానివలన మేము కృతకత్యుల మగుదుము" అనిరి. నే నిట్లాలోచించితిని— "సరే, యీామిషచే

నైనఁ గొంచెము సేపు కృష్ణకీర్తనము, కృష్ణ లీలా స్మరణము కలుగఁ గలదు. కావున! నే నా మహర్షులను, దేవతలను కొంచెము వ్యవధి నడిగితిని. ఫలాని దినమున మీరు మా కభినయమును జూపింప వలయు నని ఒక తిథి నిర్ణయింపఁబడెను.

ఋషుల యాజ్ఞను బొంది నేను గంధర్వ లోకమునకు వచ్చితిని. వ్యాసా! దేవత లందఱిలో గంధర్వులు, విద్యాధరులు సౌందర్యములో నద్వితీయులుగ నుందు రను సంగతి మీ రెఱిఁగినదే. ఈ గంధమాదన పర్వతము మీఁదకు గంధర్వ, విద్యాధర యువతులు విహరించుటకు వచ్చుచుందురు మీరు వారిని జూచుచునే యుందురు. సంగీతములో వీరు జన్మచేతనే ప్రవీణులుగ నుందురు. ఱెక్కలు రాఁగానే పక్షుల పిల్ల లెగురుటకుఁ బ్రారంభించునట్లు గంధర్వులు పుట్టుకతోడనే తమకుఁ దామే సస్వరగానము చేయఁ బ్రారంభింతురు.

నే నా గంధర్వ విద్యాధరులలో అత్యంత సుందర బాల బాలికలకు రాస లీలాభినయ శిక్షణ నిచ్చితిని. వారికి విధ్యుక్తముగ శ్రీకృష్ణ నృత్య శిక్షణ నిచ్చితిని. సఖులకు సంగీతమును నేర్పితిని. ఇంకా కావలసిన యుపయోగకరము లగు విషయములను గూర్చి శిక్షణ నిచ్చితిని. వారందఱు నా శిక్షణద్వారా పరమప్రవీణులైరి.

వ్యాసా! ఆ సమయమున నా యుత్సాహమునకు మేఱ లేకుండెను. నేను వేసిన యుద్యానవనమును జూచి తోఁటమాలి మన ముకురము వికసించినట్లు నాచే నేర్పఁబడిన

యీ మనోహర రాసమండలీ ప్రవీణతచే నే నత్యధికానందము నొందితిని. నియత తిథి వచ్చినది. నందనవనములో నొక ప్రశస్త ప్రాంగణమందు రంగస్థల మేర్పఱుపఁబడినది. చిత్ర విచిత్ర దివ్యాంబరములచే చిత్ర విచిత్ర చాందినీలతో నా పందిరి అలంకరింపఁబడినది. అక్కడక్కడ నందనవనములోని దివ్య పుష్పమాలలు వ్రేలాడుచుండినవి. విశ్వకర్మ స్వయముగఁ దన చేతులతో అద్భుత అలౌకిక రచనమును గావించెను. గోలోక దృశ్యము లన్నియుఁ బ్రదర్శింపఁబడెను. కల్పవృక్ష పుష్పముల మంద మంద సుగంధమును గైకొని మారుతము మందగతిని వీచుచుండెను. సర్వత్ర దివ్యపుష్పములు వికసించినవి. వాటిపై మధులోలుపము లగు మత్త మధుపములు గుంజారవము కావించుచుండెను. మొదలు పెట్టుటకు ముందుగనే ఋషులు, మునులు, దేవతలు గంధర్వులు, యక్షులు, నాగులు వచ్చి తమతమ నిర్దిష్టస్థానములందుఁ గూర్చుండిరి. ఇంకొకవైపు యౌవనమదముచే మదవతు లగు స్వర్గములోని అసంఖ్యాకములగు అప్సరసలు విద్యుత్సమాన మగు తమ దివ్య వస్త్రభూషణముల మెఱపులచే నా సభను బ్రకాశింపఁజేయుచు నుండిరి. సభ క్రిక్కిరిసి యుండెను. ఒక సూది వేసినను ఆ శబ్దము వినఁబడునంతటి నిశ్శబ్దముగ సభ యుండెను. అందఱును తదేక దృష్టితో దత్తచిత్తులై రంగభూమి వైపునకే చూచుచుండిరి. ఇంతలోనే రంగభూమిమీఁది తెఱ పైకి లేచినది. ఆ గంధర్వ విద్యాధర బాలబాలికలు తమ దివ్యసంగీతము నారంభించిరి. తర్వాత రాసలీలాభినయమును జూపించిరి. అందఱును మంత్రముగ్ధుల

వలె మౌనముగ నుండిరి. ప్రేమకారణమున నందఱి కంఠములు రుద్ధము లయ్యెను. దేవతల కనుఱెప్పలు పడవు సరిగదా, ఆ సమాజములోఁ గూర్చుండిన వారందఱికును ఱెప్పలు పడుటలేదు. తమ్ముఁ దాము మఱచిరి. వారు సమాధిస్థులవలె నా యభినయామృత సాగరమున నిమగ్నులైరి. బాహ్యజగత్తు వారికి గుర్తు లేనే లేదు. ఇట్టి సమయములోనే తెఱ పడినది. రెండవదృశ్యమును జూపుటలో ఆలస్యమైనది. నా మనస్సుకూడ అత్యంత సుందరులగు గంధర్వకన్యలయందు కొంచెముగ నాసక్తి చెందినది. ఆ సమయమున వారి యపూర్వసౌందర్యమును గాంచఁగానే చిత్తమందు కొంచెముగఁ జంచలత కలిగెను. ఇది వికారజన్య భావమో, ప్రేమవిస్మృతియో నేను నిశ్చయము చేయఁజాలకుంటిని. నేను నన్ను మఱచితిని. ఋషుల ఆనందమునకు విఘ్నము కలిగెను. దృశ్యమును దొలగించునప్పటికి వారి బాహ్యజగత్తు తోఁచెను. వారి ప్రేమసమాధికి భంగము కలిగెను. ఈవిధముగఁ దమ యానందములో నిట్టి యంతరాయమును గాంచి వారు దుఃఖితులై, ఆ దుఃఖావేశముచే 'వెళ్ళుము, నీవు గంధర్వుఁడవై యే రూపమందాసక్తి చెంది నిన్ను నీవు మఱచితివో వారి కధీనుఁడవు కమ్ము' అని శపించిరి.

అప్పటికి నాకు కన్నులు తెఱిపిడి పడెను. కాని యిప్పుడింకేమున్నది? అయినదేమో అయిపోయినది. బాణము ధనుస్సునుండి వదలినది. ఇఁక లక్ష్యమువఱకు వెళ్ళితీరును. అభినయము జరుగుచునే యుండెను. ఆనందములో నిరానంద తరంగములు పరువిడి వచ్చినవి. రంగభంగమయ్యెను. నేను

[illegible] వెళ్ళి ఋషుల పాదములను బట్టుకొని, నేనుద్ధరింపఁ బడుట కుపాయము నడిగితిని. అంత ఋషులు "నీవు గంధర్వుఁడవై జన్మింపవలెను. ఎవరిని గాంచి నీ చిత్తమందు చంచలత్వము కలిగెనో వారు నీమీద అత్యంతానురక్తు లగుదురు. కాని సత్సంగము, కృష్ణకీర్తన ప్రభావముచే మరల నీవు నారదుఁడవై పుట్టఁగలవు" అనిరి. ఇట్లనఁగానే సభ భంగమాయెను. ఋషులు, మునులు తమ తమ స్థానములకు వెళ్ళి పోయిరి.

సత్యవాదులును, అమోఘవీర్యులును, తపోధనులు అగు నా బ్రహ్మర్షుల వాక్యములు వ్యర్థములు కావు. కాలాంతరమున నేను గంధర్వుఁడ నైతిని. అక్కడనుండికూడ భాగ్యవశమున బ్రహ్మశాపముచే నేను దాసీపుత్రుఁడ నైతిని. ఈ శూద్ర జన్మములోనే నాకు సత్సంగము ద్వారా భగవద్ధ్యానము, కృష్ణకీర్తన మందాసక్తి కలిగెను. ఆ మూలమున నాకీ నారదదేహము ప్రాప్తించెను." ఇట్లు చెప్పి నారదుఁడు తన పూర్వజన్మకథ నుపసంహరించెను.

ఛప్పయ

రంగ భూమి మేఁ రమ్యా రాస కా రసమయ అభినయ।
[illegible] సబని కో చిత్త చమత్కృత హోఇ సు అతిశయ॥
[illegible] మగ్న మేఁ మైల ధస్యో, రస బిరస భయో సబ్।
నారీగణ పై హోఉ మునిన మిల శాపదియో తబ్॥
వందన కరి బినతీ కరీ, హోయ్ శాపకో అంత కస్।
రతి సంగతి హరి భక్తి హో నారద పుని, ముని కహ్యో అస్॥

## అర్థము

రమ్య రసమయమగు అభినయము చేయుటకు రంగ భూమి నిర్మింపఁబడెను. ఆ రాస లీలలను గాంచఁగానే అందఱ చిత్తములు అతిశయ చమత్కృతి కలిగెను. నా మనస్సులో మైల ప్రవేశించెను. అప్పుడు రసమంతయు విరస మయ్యెను. అప్పుడు మునులు నీవు నారీలంపటుఁడవు కమ్మని శపించిరి.

వారి ననేకవిధముల వందనము కావించి వినతులు కావింపఁగా శాప మంత మగును. సత్సంగతిచే హరి భక్తి కలిగి మరల నారదముని వగుదు వనిరి.

# గంధర్వుఁడుగా నారదుఁడు

శ్లో॥ అహం పురాభవం కశ్చి
గ్గంధర్వ ఉప బర్హణః।
నామ్నాతీతం మహాకల్పే
గంధర్వాణాం సుసమ్మతః॥ *
(శ్రీమద్భాగవతము ౭ స్కం. ౧౫ అ. ౬౯ శ్లో.)

ఛప్పయ

ఇసీ సృష్టి సే పూర్వ కల్ప మేఁ అతి హీ సుందర।
ఉప బర్హణ గంధర్వ నామ థా మైఁ మునివర!।
నఖ సే శిఖ తక్ సుఘడ్ మనోహర మేరీ మూరతి।
దివ్య గంధయుత దేహ శరీరీ మానోఁ రతి పతి॥
మేరే మనహర రూప పర్, అబలా అతి ఆసక్త థీఁ॥
మదన మథిత మదమత్త థీఁ, సబ్ సమాజ అనురక్త థీఁ॥

అర్థము

ఓ వ్యాస మహాముని! నే నీ సృష్టికి పూర్వకల్పమున అతి సుందరుఁడను. ఉప బర్హణుఁ డను పేరు గల గంధర్వుఁడను. నా స్వరూపము నఖ శిఖ పర్యంతము బలిష్ఠమై మనోహరమైనది. మన్మథునివలె దివ్య గంధము గల శరీరము కలవాఁడను.

---

* నారదుఁడు యుధిష్ఠిరమహారాజుతో నిట్లు చెప్పెను— ఓ రాజా! నేను గడచిన మహాకల్పములో ఉపబర్హణుఁ డను గంధర్వుఁడను. మిగిలిన గంధర్వు లందఱును నన్ను మిక్కిలిగ సమ్మానించుచుండురు.

నా మనోహర రూపముపై అబలలు అత్యాసక్తిని జెందియుండిరి. వారు కామపీడితులై మదమత్తలై అందఱును సమానముగ ననురక్తలై యుండిరి.

మిఠాయి వమ్మువాఁడు మొట్టమొదట గాహకులకు మూల్యమును గైకొనకయే కొంచెముగ రుచి చూపించును. ఆ రుచిచే వా రాకర్షింపఁబడి వివశముగ మిఠాయిని కొని తీరెదరు. అట్లే నారదుఁడు తన పూర్వజన్మ కథను చెప్పి, రాబోవు ప్రసంగమును సూక్ష్మరూపముగఁ జెప్పివేసెను. అంత భాగవత కథాలోలుపుఁ డగు వ్యాసుని యుత్సుకత అతిశయించెను. ఆతఁడు దేవర్షి నారదునితో "స్వామీ! మీరు అద్భుత మగు మీ పూర్వజన్మ కథను జెప్పి నాకు మిక్కిలి యుపకారము కావించితిరి. మీరు గంధర్వులై యెట్లు పుట్టితిరి. తర్వాత శూద్రుడవై యేల పుట్టితిరో వినఁ గోరుచున్నాను. భగవంతుని యొక్కయు, భక్తుల యొక్కయు చరిత్రలు సమాన సుఖము నొసంగునవిగ నుండును. ఇంతే కాదు. భక్తుల చరిత్రలు భగవచ్చరిత్రలకంటె మించినవి. మీరు భక్తులు కూడాను, భగవదవతారము కూడా. మీ చరిత్ర శ్రవణముచే నాకే కాదు సమస్త లోకములకు సుఖ శాంతులు ప్రాప్తించును" అనెను.

వ్యాసభగవానుఁ డిట్లడుగఁగా నారదుఁడు "ముని వరా! నేను నా తర్వాత వృత్తాంతమును వినిపించెదను. నీవు ధ్యానపూర్వకముగ వినుము. ఋషులయొక్కయు, మునుల యొక్కయు భావసమాధికి భావసంకరము కలుగుటచే వారికి

మానసిక వ్యథ కలిగెను. వారందఱును భగవద్భావమందు భావితులైరి. శ్రీహరి దివ్య లీల లందు వారి చిత్త మాసక్తి చెందియుండెను. నేను వారి సుఖమున కంతరాయము కలిగించితిని. అందువలన వారు నన్ను గంధర్వుఁడవు కమ్మని శపించిరి. ఋషుల వాక్యము లన్యథా కాఁజాలవు. నేను పోయి గంధర్వులలోఁ బుట్టితిని. అక్కడ నా పేరు ఉపబర్హణుఁడు.

నా సౌందర్యమును గూర్చి చెప్పవలసిన దేమున్నది, సౌందర్యపు మూసలోఁ బోసి బ్రహ్మ నన్ను రచించినాఁడా యనునంతటి సౌందర్యముగ నఖశిఖ పర్యంత ముంటిని. శరీర కాంతి తప్తకాంచన సన్నిభమై యుండెను. నవనీతము వంటి స్నిగ్ధత కలదు. నాకు శృంగారము చేసికొనుట యనిన చాల యిష్టము. ఎల్లప్పుడును శరీర సౌందర్యమునే వృద్ధి చేసికొను చింతలోనే యుండెడు వాఁడను. మనస్సులో మనోహరతా హంకారము వ్యాప్తమై యున్నది. నేత్రములు సదా మదముతో నిండియుండును. నా శరీరమునుండి సదా దివ్య సౌరభము బయలుదేఱు చుండెడిది. ఆ మూలమున దగ్గఱ నుండువారు స్వయముగనే నా వైపున కాకర్షింపఁబడు చుందురు. వ్యాసా! సౌందర్య మదము మానవుని సత్పథము నుండి భ్రష్టుని గావించును. స్త్రీ హృదయ రచన అత్యంత కోమల తంతువులచేఁ జేయఁబడినది. వాటిమీఁద సౌందర్య ప్రభావ మమితముగఁ బడుచుండును. సుసజ్జిత సుందర పురుషుని గాంచి, యేదో పరమ సాధ్వి మాత్రమే జాగ్రత్తగ నుండఁగలదు. లేకపోయిన సాధారణముగ స్త్రీల ధైర్యము

జారిపోవును. కావుననే శాస్త్రకారు లీ విషయముపై మాటి మాటికి 'తన తోఁబుట్టినవాఁడైనప్పటికి, యువకుఁడైన పుత్రుఁడైనప్పటికి ఏకాంతములోఁ జనువుగ వ్యర్థ సంభాషణము చేయరాదని చెప్పియున్నారు. తన సోదరి కానిండు, పుత్రిక కానిండు, మాతృస్థానీయ యగు వేఱొక యువతి యగు పూజ్య స్త్రీ కానిండు, వారితో నేకాంతమున నధికముగ సంభాషింపరాదు, వారి హావభావ కటాక్షములను ధ్యానపూర్వకముగ నేకాంత మందు నవలోకన చింతనములు కావింపరా దని పురుషుల విషయములోఁ గూడ చెప్పఁబడియున్నది. ఇద్దరిలోను సౌందర్య మున్నయెడల విషలిప్త బాణమువలెఁ బనిచేయఁగలదు.

గంధర్వులలో నీవిషయము లేనే లేదు. వారు అందఱితోడను నవ్వుదురు, ఆడుదురు, క్రీడింతురు. నా సౌందర్యము నెడల స్త్రీ లందఱును ముగ్ధ లగుచుండిరి. సుందర రసభరిత కుసుమ సమీపమున మధుపములు చుట్టుకొను నట్లు గంధర్వ యువతులు నన్నుఁ జుట్టుకొనుచుండెడువారు. మధుర వస్తువు కొఱకై చాల చీమలు తమకుఁ దామే గుమికూడి నట్లు చాల మంది గంధర్వ కన్యకలు నా దగ్గఱకు వచ్చుచుండెడువారు. నృత్య మొనర్చుచున్న మయూరమును గాంచి చాల ఆడ నెమిళ్ళు దానిని జుట్టుకొని దాని యుత్సాహము నత్యధికముగఁ బెంచుచు, కొంచెముగ మధుర శబ్దమును జేయుచుండు రీతి నేను గానము చేయుటను గాంచి యా మదవతు లగు యువతులు తమ కోకిల కూజిత కమనీయ కంఠముతో నాతోఁ గలిపి పాడుచుందురు. అప్పుడు నా

యుత్సాహ మినుమడించి నాకళ యంతయు దాని కదియే ప్రస్ఫుటిత మగు చుండును.

నేను సౌందర్య మదమత్తుడను. నాకు లోకము కొంచె మైనఁ దెలియుట లేదు. సౌందర్య గర్వము నా వినయమును, సదాచారమును, లోక లజ్జను కూడ నాశము కావించినది. రూపవంతుఁ డగు వాఁడు తనతో సమాన మగు వాఁ డెవ్వఁడు లేఁడను కొనుచుండును. ఈ విధముగ నేను సౌందర్య సురా పానము కావించి యున్మత్తుని వలెనై ఆట పాటల యందును, నృత్యము నందును గాలము గడపుచుంటిని. నా గొంతుక మధుర స్వరము కలది. నా పాట కన్నియెడలను ప్రశంశయే. ఇవన్నియు నున్నప్పటికి పూర్వజన్మ సంస్కారములకు వశీ భూతుఁడనై నేను శ్రీహరి గుణాను వాద గీతములనే గానము చేయుచుండెడు వాఁడను. ఆ యీ విషయములను గూర్చిన అన్య గీతము లనిన నాకసహ్యము. అందువలన నా భగవ ద్గుణాను వాదమునకు సంబంధించిన కీర్తనల ఖ్యాతి సమస్త లోకము లందును వ్యాపించినది.

ఒకనాటి మాట. ప్రజాపతు లందఱును గలిసి యొక గొప్ప యజ్ఞమును చేసిరి. ఆ యజ్ఞమునకు గొప్ప గొప్ప గంధర్వులు పాడుటకుఁ బిలువఁబడిరి. గొప్ప గొప్ప అప్స రసలు నృత్యము చేయుట కాహ్వానింపఁబడిరి. నాకు గొప్ప పేరుండెడిది. నాకుఁ గూడ ఆహ్వాన మందినది. ఇది నా కళా ప్రదర్శనమునకు ఉత్తమావకాశ మని గ్రహించి నేను కూడ ఆ దేవసత్రమునకుఁ బోయితిని. కాని నన్ను సౌందర్య సుర

ఉన్మత్తుని గావించినది. నేనొంటరిగ వెళ్ళలేదు. నా మనో హర మండలితోఁ గూడుకొని మిక్కిలి యాడంబరముతో సన్నద్ధమై మిక్కిలి శృంగారముతో గర్వముతో నేను ప్రవేసించితిని. ఆ సమయమున నా శోభ అత్యద్భుతము. తన గంగడోలు భారముచే మందమందముగ నడచు గోవుల మధ్య ఆఁబోతు వెళ్ళునట్లుగా తమ శ్రోణీ పయోధర భారముచే మందగతిని మిడిసిపడుచు వెళ్ళు నా గంధర్వ యువతులచేఁ జుట్టుకొనఁబడి వెళ్ళుచుంటిని. చాల హరిణీ సమూహము తమ యూథపతిని మాటిమాటికి తమ గొప్ప గొప్ప విశాల నేత్రములతోఁ జూచుచు వెళ్ళుచున్నట్లు కమల నయన లందఱు తమ కమనీయ కటాక్షములచే నన్ను సంతోష పెట్టుచు వెళ్ళుచుండిరి. ఆడ నెమిళ్ళతోఁ జుట్టుకొనఁబడిన యున్మత్త మయూరము నృత్యము చేయుచు మందగతి వెళ్ళునట్లు నేను గూడ వారి రూప మాధుర్యము నందాసక్తుఁడనై నృత్యము చేయుచు వెళ్ళుచుంటిని. ఆడ యేనుఁగుల గుంపుచేఁ జుట్టుకొనఁబడిన భద్రగజము వాటిని ప్రేమించుచు వెళ్ళుచున్నట్లు నేను కూడ నా ప్రేమను గూడ వారిపైఁ బ్రదర్శించుచు సభలోఁ బ్రవేశించుచుంటిని. చాల ఆడు తేనెటీఁగల మధ్య ఝుంకార ధ్వని చేయుచు వెళ్ళుచున్న మధు లోభి యగు మత్త మధుపమురీతి, తమ కాంతిచే దశదిశలను బ్రకాశింపఁ జేయు నా శ్యామ గంధర్వాణిలతో గానము చేయుచు నే నా సభకు వెళ్ళితిని.

నే నచ్చట సభాసదులకును బ్రణామమును జేయలేదు, దేవతలు, ఋషులు, ప్రజాపతుల యెడల సమ్మానము

నైనఁ బ్రదర్శింపలేదు. అప్పు డా సమయమున నేను నాలో లేను. నా నెత్తిన సౌందర్యభూత మెక్కినది. అది నా వివేకము నంతను నాశము చేసినది. లోకలజ్జ, వినయము, శిష్టాచారము ఇవి కాముకులను వదలిపెట్టి వెళ్ళిపోవును. ఇంక నవి నా దగ్గర నెందుకుండును. ఉద్ధత నిర్లజ్జునివలె నే నా సభలోనికిఁ బోయితిని. ఈ యవినయమునకు విశ్వ సృష్టిచేయు ప్రజాపతు లందఱును క్రుద్ధులై "అరే! నీ వవినయునివలె మా కవజ్ఞ గావించుచు నీ సత్రమునకు వచ్చితివి, కావున నీవు శూద్రుఁడ వగుము. భూమి మీఁద నీవు శూద్రుఁడవై పుట్టఁగలవు" అని నాకు శాప మొసగిరి.

ప్రజాపతు లిచ్చిన యీ శాపమును వినునప్పటికి బాగుగా భంగు త్రాగినవాని మత్తు పుల్లని పెరుగు త్రాగుటచే దిగిపోవునట్లు నా సౌందర్య మదము దిగిపోయినది. నా కన్నులు తెఱపిడి పడినవి. ఎటు చూచినను అంధకారమే కనఁబడు చుండెను. ఇప్పుడు నేను దేవలోకమును వదలి మర్త్యలోకమునకు వెళ్ళవలసివచ్చెను. అక్కడ శూద్రుఁడనై పుట్టి యే యే కుకర్మలు చేయవలసి వచ్చునో తెలియదు. నే నీ స్త్రీల వలలోఁ బడి నా సర్వస్వమును బోఁ గొట్టుకొంటిని. సద్గుణము లన్నియు నన్ను వదలి యిదివఱకే పోయినవి. ఏ సుందర గంధర్వ శరీరమును గాంచి నింతగ నభిమాన గర్వమును జెందితినో దానిని వదలవలసి వచ్చెను. నేను చాల పొరబడితిని. నే నిఁక నింతుల పొత్తు చేయను. సదాచార భ్రష్టులఁ గావించు నీ సుందర వనితల సంబంధ మింక నేను పెట్టుకొనను," అని యీ విధముగఁ బశ్చాత్తా

పము చెందుచు నేను ప్రజాపతుల పాదపద్మములకుఁ బ్రణామము కావించి, దీనతతో వారితో, నే నుద్ధరింపఁ బడుట కుపాయము నడిగితిని. ప్రజాపతులు "మా శాప మన్యథా కాఁ జాలదు. అయితే నీ వెక్కువ రోజులు శూద్రుఁడవై యుండవులే. చాల కొలఁది కాలములోనే నీవు దానినుండి విముక్తిఁ జెందెదవు. మహాత్ముల సత్సంగ ప్రభావముచే మరల నీకు దేవర్షిత్వము ప్రాప్తించును" అనిరి.

ప్రజాపతుల యీ వచనమును వినునప్పటికి నాకు సంతోష మయ్యెను. నా రూప మదమునకు, కామ చేష్టలకు పశ్చాత్తాపమును జెందుచు వెంటనే గంధర్వ యోనినుండి పతితుఁడ నైతిని. భూమి మీఁదకు వచ్చి యొక్క శూద్ర గర్భమునఁ బుట్టితిని. శూద్ర గర్భమున జన్మించినప్పటికిని నాకు సత్సంగము ప్రాప్తించెను. నాకు నా తండ్రి సంగతి తెలియదు. ఆతఁ డెవరో, ఏ గోత్రమువాఁడో తెలియదు. కాని నా తల్లి బ్రహ్మవాదులగు మునులకు దాసి. ఆమె యెల్లప్పుడును వారి సేవా శుశ్రూషలయందే తత్పరురాలై యుండును ఇంక నామెకు సంతానము లేదు. ఆమెకు సర్వస్వము నే నే. ఆమె యేమియుఁ జదువుకొనలేదు. ఆమెకు పరమార్థ పథమునందును బ్రవేశము లేదు. ఆమె యీ సంసార సుఖములనే సర్వశ్రేష్ఠముగ నెంచుచుండును. సంసారు లందఱెట్లో ఆమెయు నట్లే. మిక్కిలి దీన చిత్తురాలు, కృపణ. ఆమె మోహము, మమత అంతేయు నా మీఁదనే. ఆమెకు నేను బహిఃప్రాణమను. ఆమె యెల్లప్పుడు నా లాలన పాలనను గూర్చిన చింతతోడనే యుండె

డిది. నా కేదైన కొంచెము కష్టము తగిలెనా వ్యగ్రురా లయ్యెడిది. రాత్రు లంతయు మేల్కొని యుండి ఆమె నన్ను గాపాడుచుండెడిది. అక్కడక్కడ నుండి మంచిమంచి వస్తువులను పరీక్షించి తెచ్చి నాకు పెట్టుచుండెడిది. ఆమెకు ఎనిమిది జాములు నా ధ్యానమే. చివరకు నిద్రపోవునప్పుడు కూడ నన్ను గూర్చిన స్వప్నము చూచుచుండెడిది. ఈ విధముగ నే నైదేండ్లవాఁడ నైతిని.

మా అమ్మ మనోరథములు రాత్రింబవళ్లు పరువిడుచుండును. ఆమె యిట్లనుకొనుచుండెడిది — "ఇప్పటికి మా అబ్బాయి అయిదేండ్లవాఁ డైనాఁడు. ఇంకఁ గొంచెము పెరిగి పెద్దవాఁడైన నింక నైదారేండ్లకు ఎక్కడనైన పిల్లను జూచి పెండ్లి చేసెదను. గజ్జల మ్రోతతో నింటికి బొమ్మ వంటి కోడలు వచ్చినట్లైన వా రిద్దరిని ముచ్చటగఁ జూచుకొందును. అప్పుడు నా మనోరథము సఫల మగును. నేను ధన్యురాల నగుదును."

వ్యాసా! ఈ సంసారములో తల్లిదండ్రుల కొక్కటే శ్రేష్ఠమైన కోరిక యుండును. అదేమనఁగా — మా పిల్లవాఁడు పెద్దవాఁడు కావలెను. ముద్దవంటి చక్కని కోడలు రావలెను. దానికి కూడ పిల్లలు పుట్టవలెను. ఇంతవఱకే వా రాలోచింతురు. ఇదియే వారి జీవితమున కంతిమ అభిలాష. మా తల్లివిషయములోఁ గూడ నింతయే. ఆమె ఒక్కొక్కప్పుడు ప్రేమతో నిండిపోయి నాతో "ఒరే! నాయనా! చూడుము, నీ విట్లు చేసిన నీకు మంచి పెండ్లాము వచ్చు"

నను చుండెడిది. వ్యాసా! నాకీ పెండ్లాము, పెండ్లిమాటలు కొంచెమైన నచ్చెడివి కావు. నా మీఁద తల్లి కింతటి మోహ ముండుటకూడ బాగుండలేదు. నేను పంజరములో బంధింపఁబడిన పక్షివలె నుంటి నని భావించుచుంటిని. బాల్యమునుండియు నాకు సాంసారిక విషయము లనిన విరక్తి. తల్లియెడల నా మనస్సులో మమత్వము లేదు. నా కది ఒక భారమువలెఁ దోఁచెను. ఆమె యేమైన ననుకొనునేమో నని యేమియుఁ జలికెడువాఁడను కాను; కాని యామె వివాహము చేసెద ననిన చేసికొనఁగూడ దనుకొనుచుంటిని. వ్యాసా! చిన్నతనమునుండియే పిల్లల స్వభావములు బయటపడుచుండునని తెలిసికొనుము. ఏ పిల్లలు మొదటినుండియు పెండ్లాము, పెళ్ళికూతురు అను మాటలు మాటలాడుచు, బాల బాలికలతో పెండ్లాటలు ఆడుకొనుచుందురో, వారు తప్పక సంసారు లగుదు రని తెలిసికొనవలెను. అరంభము నుండియే సాంసారిక విషయముల యెడల నేవగింపు కలిగి, ఆటలలోఁ గూడ భవల్లీలానుకరణము చేయుచుండినను, ఆరంభమునుండియే సాధు సత్పురుషుల యెడలను, భగవద్భక్తుల యెడలను అనురాగ మున్నయెడల వారు ముందు ముందు నంతసాధువు లగుదు రని తెలిసికొనవలెను. ఏదో విధముగ నీ ముసలిది రాలిపోయి, నా కండ్లముందు మృత్యువాతఁ బడినచో తా నేదైన సరణ్యమునకుఁ బోయి శాంతిఁ బొందెద; హరిభక్తిలో నేను కాలము గడిపెద ననియు ప్రేమతో శ్రీహరి గుణములను గానము చేయుచుందు ననియు తలంచుచుంటిని. ఈ విధముగ తల్లి తలఁచుకొను

చుండెడిది; నే నింకొక విధముగఁ దలఁచెడువాఁడను. వ్యాసా! ఈ విధముగ నాకు బాల్యము గడిచిపోయినది.

ఛప్పయ

హుఆ యజ్ఞ ఇక విశద సభీ గంధర్వ బులాయే।
విశ్వ సృజోఁ కీ ఆయసు పా హమ్ సబ్ భీ ఆయే॥
సుందరియోఁ సే ఘిరా రూప మద మేఁ మతవాలా।
అవినయ మేరీ నిరఖి శాప సబ నే దే డాలా॥
జా, పృథ్వీపర్ అభీ తూ, శూద్ర యోని మేఁ ప్రకట హో।
మేరీ అనునయ పర్ కహా - సంత సమాగమ నికట హో॥

అర్థము

దేవలోకములో నొక యజ్ఞము జరిగెను. అక్కడికి వేయి వేలుగ గంధర్వు లంద రాహ్వానింపఁబడిరి. బ్రహ్మదేవుని యాజ్ఞానుసారముగ మే మందఱమును అచ్చటికి వెళ్ళితిమి. సుందరీమణులచేఁ జుట్టుకొనఁబడి రూప మదముచే మదించిన నా యవినయమును గాంచి, ఒరే! వెళ్ళు, నీవు భూమిమీఁద శూద్రుఁడవై జన్మింపుము.'' అని శపించిరి. అంత నేను కాళ్ళమీఁద పడఁగా "అయితే నీవు సంతసమాగమము కలుగుచోట పుట్టెద'' వని యనుగ్రహించిరి.

# శూద్రుఁడైన నారదునకు సత్సంగము

శ్లో॥ తత్రాన్వహం కృష్ణ కథాః ప్రగాయతా
మనుగ్రహే ణాశృణవం మనోహరాః।
తాః శ్రద్ధయా మేఽను పదం విశృణ్వతః
ప్రియశ్రవస్యంగ మమాభవద్రుచిః॥ *
(శ్రీమద్భాగవతము ౧ స్కం. ౫ అ. ౨౬ శ్లో.)

ఛ ప్ప య

దాసీ కా మైఁ పుత్ర కర్మ శుచి మేఁ రుచి రహతీ।
మేరీ మాతా మహా మోహా ముఝసే థీ కరతీ॥

చాతుర్మాస్య నిమిత్త వహాఁ బహు మునివర ఆయే।
సేవా సౌంపీ ముఝే సునే హరి చరిత సుహాయే॥
సీథ ప్రసాదీ పాఇ కేఁ, పాప పహాడ్ పలా గయే।
భగవత చరిత సుహాగయే, హియ మేఁ శ్యామ సమాగయే॥

---

* నారదుఁడు వ్యాసునితో నిట్లు చెప్పుచున్నాఁడు— ఓ పరమ ప్రేమాస్పదుఁడ వగు నో వ్యాసా! మా అమ్మ నన్ను చాతుర్మాస్య దీక్షలో నొకే స్థానమున నివసించు మునుల సేవలో నియమించి నప్పుడు, నేను ప్రతి దినము కృష్ణ కథను వినుచుంటిని. ఆ మహాత్ములు నిత్యనియమములో మిక్కిలి మధుర మనోహర మగు కథలను జెప్పుచుండెడివారు. ఆ కథలలో ప్రతి పదమును మిక్కిలి ధ్యానముతో శ్రద్ధా పూర్వకముగ వినుచుండెడు వాఁడను. అట్లు వానిని వినఁగా వినఁగా నెవని శ్రవణ కీర్తనము లత్యంత మనోహరములో, ఆ శ్యామసుందరుని మనోహర మూర్తి యందు నా మనస్సు లగ్న మయ్యెను, ప్రభు పాదపద్మము లందు భక్తి యుత్పన్న మయ్యెను.

అర్థము

దాసీపుత్రుఁడ నగు నాకు శౌచ కర్మలందు రుచి యుండెడిది. నా తల్లికి నాయందు మహామోహ ముండెడిది. ఇంతలోఁ జాతుర్మాస్యలు గడుపుటకై చాలమంది మునిశ్రేష్ఠు లచ్చటికి వచ్చిరి. నేను వారి సేవ చేయుటకు వియుక్తుఁడనై వారు చెప్పుకొను హరి చరిత్రములను వినుచుంటిని.

వారి ప్రసాదాన్నమును దినఁగా నా పాప పర్వతము పడిపోయెను. భగవచ్చరిత్రలు నాకానందము నొడఁగూర్చెను. అవి వినఁగా వినఁగా నా హృదయములో శ్యామసుందరుఁడు నిండిపోయెను.

ప్రపంచములో నెక్కడ చూచినను స్వార్థమే సామ్రాజ్యము చేయుచున్నది. అందఱును తమ తమ స్వభావముల మీఁదనే కూర్చుందురు. అందఱును స్వార్థ సిద్ధికొఱకు తహ తహ లాడుచుందురు. లోభియగు పుత్రుఁడు తండ్రి పరలోక గతుఁడైనఁ దనకు మనోరథ సిద్ధి కలుగు ననుకొనును. స్వార్థ పరుఁడగు తండ్రి — కుమారుఁడు తెలివిగలవాఁడై సంపాదించి నన్నము పెట్టు ననుకొనును. అందఱి స్థితియు నిట్టిదియే యని గ్రహింపవలయును. నిజమైన ప్రేమ గల సంబంధులు చాల అరుదుగ నుందురు. నారదునియొక్క పూర్వజన్మలోని దాసీ మాత యెడల నిట్టి భావమును గ్రహించి వ్యాసుఁడు నవ్వి, మఱలఁ జిఱునవ్వు నవ్వుచు నారదునితో "స్వామీ! నా కొక సందేహ ముత్పన్నమైనది. మీ పూర్వజన్మపు దాసీమాతకు మీ మీఁద యింతటి మమతా మోహాము లుండెడివి.

మీ కామె యెడల నిసుమంతైన స్నేహము లేదు. పైగా నామె యెప్పుడు చచ్చునా? యని కోరుకొనుచుంటివి. కారణమేమి?" అని అడిగెను.

వ్యాసుని వాక్యములను విని నారదుఁడు కొంచెము గంభీరుఁడై, కొంచెము సేపాగి "వ్యాసా! ఈ జగత్తంతయుఁ దమ తమ కర్మాధీనమై వర్తించుచుండును. మానవుఁడు పూర్వజన్మ సంస్కారములచే వివశుఁడై సమస్త కార్యము లొనర్చుచుండెను. పూర్వ జన్మములో నేదోవిధముగ సంబంధ మున్నయెడల నాతఁడే వచ్చి యీ జన్మములోఁ దమకు సంబంధుఁ డగును. పూర్వజన్మ సంస్కారములు లేక యెవరితోడను సంబంధము కలుగనే కలుగదు. ఈ విధముగానే ప్రపంచములో పద, ప్రతిష్ఠా, సర్వప్రియతల స్థితియు నుండును. పూర్వజన్మములో యథేష్టముగ నన్నదానము చేసినయెడల నీ జన్మమందు అట్టి ప్రసిద్ధి ప్రశంస యే యుండును. అన్నదానము చేయక ప్రసిద్ధి కలుగనే కలుగదు. పూర్వజన్మములో నెందఱియెడల సమదర్శిత్వమును ప్రకటించునో ఆతఁ డంతగా లోకప్రియుఁడగును. పూర్వజన్మములో నెంతగా బాహ్యతపస్సు చేసినాఁడో వానికి రాఁబోవు జన్మలో అంతటి శారీరకసుఖము ప్రాప్తించును. బాహ్యతపస్సుచే నాంతరిక శాంతి ప్రాప్తించును. వైరాగ్యము వలన సమస్త ప్రాపంచిక సంబంధములం దుదాసీనత కలుగును. ఇట్టి స్థితియే పుత్రాది సంబంధీకుల విషయములోఁ గూడ. పుత్రు లైదు రకములుగ నుందురు. న్యాసహర్త, ఋణభోక్త ఋణదాత, ఉదాసీన, సత్పుత్రులు.

మన దగ్గఱ నెవఁడైన విశ్వసించి యేదైన వస్తువును దాఁకట్టు పెట్టిన, దానిని మరల వాఁ డడుగఁగా మన మీయకున్న యెడల వాని కత్యంత క్లేశము కలుగును. ఆతఁడే వచ్చి మనకు పుత్రుఁ డగును. ఆతఁడు మిక్కిలి రూపవంతుఁడు, గుణవంతుఁడు, పితృ భక్తుఁ డగును. తండ్రి ఆతని కొఱకు చాల ద్రవ్యమును వెచ్చించును, చదువు చెప్పించును, వివాహము చేయును, చివర కాతఁ డల్పాయుష్కుఁడై చచ్చిపోవును. పూర్వజన్మములో వాని కా తాకట్టు ద్రవ్యము పోయిన యెట్లేడ్చెనో అట్లే గుణవంతుఁ డగు పుత్రుఁడు చచ్చుటచే నీ తండ్రి దుఃఖించును.

ఎవరి దగ్గఱనైన ఋణమును గైకొని మనము తీర్పకున్న యెడల వాఁడుకూడ వచ్చి పుత్రుఁ డగును. స్వభావముచే మిక్కిలి క్రోధి యగును. బాల్యకాలము నుండియే తల్లిదండ్రులకు దుఃఖము కలిగించుచుండును. రోగిగా నుండును. ఆటలోనైనను తల్లిదండ్రులను కొట్టి పరువెత్తును. నవ్వును, అందఱతోఁ బోట్లాడును. ఇంటిలో కలహించును. ఒంటరిగా మంచి మంచి పదార్థములు తినును. తల్లిదండ్రు లెప్పుడు చత్తురా యని ప్రతీక్షించు చుండును. చచ్చిన తర్వాత శ్రాద్ధ తర్పణములు కూడ చేయఁడు. ఈతఁడు ఋణభోక్త పుత్రుఁ డని పిలువఁబడును.

ఎవఁడైన మన దగ్గఱ ఋణము గైకొని యివ్వలే దనుకొనుఁడు. వాఁడు కూడ ఋణము తీర్చుటకుఁ పుత్రుఁ డగును. పుట్టఁగానే రాత్రింబవళ్ళు పరిశ్రమ చేసి వాఁ డిసు

మంత్రైనఁ దినఁడు. రాత్రింబవళ్ళు ధనము సంపాదించి తల్లి దండ్రుల కిచ్చుచుండును. వారు చచ్చిపోఁగా వారికి మిక్కిలి కోలాహలముగ పైతృక కార్యములు చేయును. ఈతడు ఋణ దాత పుత్రుఁ డని పిలువఁబడును.

ఒకఁడు సత్పుత్రుఁ డగును. మన మేదైన దేవతకు గాని, భగవంతునకుఁ గాని, సంత మహాత్ములకు గాని సేవ చేసితి మనుకొనుఁడు, శ్రద్ధాపూర్వకముగ తపస్సు చేసితి మనుకొనుఁడు. వ్రతము చేసితి మనుకొనుఁడు. దానికి ప్రసన్నులై వారు స్వయముగఁగాని, పుణ్యాత్మ పురుషుఁడు గాని మన తపఃప్రభావముచేఁ బుత్రుఁ డగును. ఆతఁడు మాతా పితృ భక్తుఁడు, గుణి, సత్పాత్రుఁడు, ధార్మికుఁడు, దేవతా, ఋషి, పితృకార్య నిరతుఁడు, అందఱకు సుఖము నొసంగువాఁడు, వంశోద్ధారకుఁడు, సుఖసంపత్తుల భోగించు వాఁడు సత్పుత్రుఁ డని పిలువఁబడును.

ఒకడు ఉదాసీనుఁడుగాఁ గూడ నుండును. ఇతనితో మనకు పూర్వజన్మములో విశేష సంబంధ మేమియును లేదు. ఏదో కారణ విశేషము వలననో లేక శాప వశముననో పుత్రుఁ డగును. వానికి పుట్టి నప్పటి నుండియు మాయా మోహము లుండవు. జ్ఞాన ప్రభావము చేతనో, లేక భగవద్భక్తి కారణముననో ఆతనికి సాంసారిక కర్తవ్యము లన్నియు గౌణములుగ నుండును. వానికి భగవద్భక్తి యొక్కటియే కర్తవ్యము. ఆతఁడు పుట్టుకతోడనే ఉదాసీనుఁడుగ నుండును. సాధు సంగము కథాశ్రవణము, భగవద్భక్తి, సంతమహాత్ముల సేవ

భగవద్విగ్రహార్చనలయందు బాల్యకాలమునుండియే ఆతనికి
రుచి కలుగును. ఆతఁడు వివాహబంధనములోఁ బడఁడు.
ఒకవేళ నేదియో విశేష కారణవశమున బంధనములోఁ బడి
నప్పటికిని, ఆతనికి పుత్రులు పుట్టరు. లోభమును జెందఁడు.
పరోపకార నిరతుఁడై యెల్లప్పు డుండును. ఆతనికి పుత్రులు
కలుగని కారణ మేమనఁగా నాతఁడు పూర్వజన్మములో నెవరి
తాకట్టు సొమ్మును హరింపలేదు. ఎవరికిని అప్పులు ఎగబెట్ట
లేదు. ఏదియుఁ గోరలేదు. ఒకవేళ నే సంబంధము చేతనైన
పుత్రుఁడు కూడ కలిగినా వానిమీఁద మమకార ముండనే
యుండదు. అందఱు పుత్రులెట్లో వీనినిగూడ అట్లే భావిం
చును. నౌకరులు, భృత్యులు' పశుపక్ష్యాదులతో నెట్టి
సంబంధమో సోదర, మిత్ర, మాతా పిత్రాది సంబంధులతోఁ
గూడ నట్టిదే సంబంధమని యెఱుఁగవలయును.

నా తల్లితో పూర్వజన్మములో నిచ్చి పుచ్చుకొను
సంబంధ మేమియును లేదు. ఉండిన ఆమె యుండవలసినదే.
నాకు మొదటినుండియు సాధుసంగము మీఁదనే అభిరుచి.
ఇంటిమీఁద నాకు ధ్యాస లేదు. మా తల్లి దాసీగా
నున్నది ఒక మంచివిద్వాంసుఁడగు బ్రాహ్మణునివద్ద. కాని యాత
నితో నేను చనువుగ మాటలాడెడువాఁడను గాను. ఆయన
దగ్గఱ నాకు సిగ్గుగ నుండెడిది. మే మాయనకు దాసుల
మైతిమి. మా కాతఁడు యజమాని. వ్యాసా! అందఱు
ప్రేమను గోరుచుందురు. ఇతరుల ప్రేమించుటకును అందఱు
నువ్విళ్ళూరుచుందురు. ఎవరికైన సత్యప్రేమ ప్రాప్తించినా,

మరల వారివలన హృదయపూర్వక ప్రేమ ప్రాప్తించినా వారే ధన్యులు. మా తల్లి మాత్రము మాయలోనే పడి యుండెడిది. ఆమెతో అఱవిడిచి మాట్లాడెడువాఁడను కాను. నా మనస్సు సాధుసంగము కొఱకు తహతహ లాడుచుండెడిది. నేను బాల్యకాలము నుండియే గంభీరుఁడను, చతురుఁడను, సుశీలుఁడను, సర్వప్రియుఁడను, ఎవఁడైన మహాత్ముఁడు దొఱకినచో నాతని చరణముల మీఁదపడి యేడ్చి నా హృదయ జ్వాలను శాంతింపఁ జేసికొనవలె ననుకొనెడు వాఁడను.

యథార్థమగు వాసన యెన్నటికైన నవశ్యము పూర్తి యగును. అట్లే నా యీ సద్వాసనకూడ పూర్తి యయ్యెను. ఒకసారి జ్యేష్ఠమాసములోఁ గొందఱు మహాత్ములు మా గ్రామమునకు చాతుర్మాస్య వ్రతము సలుపుటకు వచ్చిరి. వారు ఎనిమిది నెలలు తిరుగుచునే యుందురు. నాల్గు నెలలు వర్షాకాలములో నొక్కచోటనే యుండి నియమ వ్రతము సలుపుదురు. మా గ్రామము గంగాతటమునఁ గలదు. అది బ్రాహ్మణ అగ్రహారము. ఈ సంవత్సరమున మునులు ఆ చాతుర్మాస్యములు పాలింప నిశ్చయించిరి. ఊరిబయట భగవతీ భాగీరథీ తటమున నొక విస్తృతవనములో నా మునుల కుటీరములు నిర్మింపఁబడినవి. గ్రామస్థులు వారి భిక్షాదులకు తగిన యేర్పాటులు కావించిరి. అది మా యజమాని బ్రాహ్మణుని యింటి సమీపముననే. మా అమ్మ యెవరి దగ్గర దాసీగా నుండెనో ఆ బ్రాహ్మణుఁడు మిక్కిలి స్నేహముతో నాతో "అబ్బాయీ! చూడు, నీ వా మహాత్ముల సమీపమున

నుండుము. వారి కే సేవ కావలయునో చాల ప్రేమతోఁ జేయవలయును. దీనివలన నీకు చాల మేలుకలదు" అనెను.

నాకు నిధి దొఱకిన ట్లుండెను. నిర్ధనునకు ధనము లభించినను, గ్రుడ్డివానికి దృష్టి లభించినను, అపుత్రుడగు ధనికునకు పుత్రుఁ డుదయించినను, జన్మాంతర కారాగార వాసునకు విముక్తి కలిగినను ఎంతటి సంతోషము కలుగునో అంతకంటె నెక్కువ సంతోషము నా కీ విషయమునఁ గలిగినది. అక్కడ సమీపమందే మా అమ్మ యేదియో పని చేయుచుండఁగా నామెతోఁ గూడ మా యజమాని బ్రాహ్మణుఁడు "కృష్ణదాసీ! నీ కుమారుని నే నచ్చట సాధు సేవకై నియమించితిని. వారు గొప్ప భజనానందు లగు మహాత్ములు. వారివద్ద భోజనాదులకు లోటేమియు నుండదు. అత్యుత్తమ మగు భగవత్ప్రసాదము నిత్యము లభించుచుండును. అదియునుఁ గాక ఆ మహాత్ముల సత్సంగముచే వీనికి మేలు కూడ కలుగఁ గలదు.

బీద తల్లి ఏదోవిధముగఁ దన సుతునకు సుఖము లభింపవలె నని కాంక్షించుచుండును. నా తల్లి మిక్కిలి ప్రసన్నతతో "వీఁడు మీ పిల్లవాఁడే. మీ యిష్టమువచ్చిన చోట నుంచుఁడు. మహాత్ముల సేవచే నేమి లభింపదు ? వారి కృప కలిగి, వారు ఆశీర్వాదము నొసంగిరా మా పిల్లవానికి చక్కని పెండ్లాము వచ్చును" అనెను.

ఆమెకు కోడలు ధోరణియే ధోరణి. మా యజమాని బ్రాహ్మణుఁడు నన్ను మహాత్ముల సమీపమునకుఁ గొనిపో

యెను. వారిలో నందఱకంటె వృద్ధుఁడును, అందఱకంటె గొప్ప మహాత్మునితో నాతఁడు "ఈ కుఱ్ఱవాఁడు సుశీలుఁడు, మీ చరణ సన్నిధి నుండఁగలఁడు. మీకు సేవా శుశ్రూషలు కావింపఁ గలఁడు" అనెను.

ఆ మహాత్ముఁడు నన్ను జూచెను. నా మీఁదఁ గృపా దృష్టులు పఱచుచు మధుర వాక్యాలతో "మంచిది, ఇక్కడ భగవత్సేవ యందు సహాయపడఁగలఁడు. కొంచెము బాహ్య కైంకర్యము చేయఁగలఁడు" అనెను.

ఇంకేమున్నది, నా భాగ్యము పండినది. నే నా మహాత్ముల చరణ శరణమున నుంటిని. వ్యాసా! ఆ నాల్గు మాసములలో నాకు లభించిన సుఖము, ఇప్పు డీ పదునాల్గు భువనములలోఁ దిరిగి చూచినప్పటికిని నాకుఁ గనఁబడలేదు. ఆ మహాత్ము లందఱు నెంతటి గొప్పవారో, ఎంతటి త్యాగులో, ఎంతటి భజనానందులో చెప్పుటకు వీలులేదు. వా రొక్క క్షణమైనను వ్యర్థముగ గడుపరు. అందఱు నరుణోదయమునకు ముందుగనే లేచెదరు, శీఘ్రముగ శౌచాది నివృత్తిని జెంది పుణ్యతోయ యగు భగవతీ భాగీరథీ యందు స్నానము చేయుదురు. వారి సంధ్యాది కర్మలన్నియు నక్కడనే చేసి వత్తురు. వచ్చి అందఱును జప, పూజా, పారాయణములలో నిమగ్ను లగుదురు. కొందఱు మహాత్ములు భగవత్సేవ యందుందురు భగవంతునికి హారతి జరుగునప్పుడు అందఱును గలిసి కీర్తన చేయుదురు. అంత విష్ణు సహస్రనామాది స్తోత్రములను, వేదపాఠము నొనర్తురు. భగవంతునకు నివేదన చేసెదరు. అందఱును గలిసి ప్రసాదమును గైకొందురు. గంగకు

వెళ్ళుదురు. మాధ్యాహ్నిక సంధ్యాకృత్యములను గావింతురు. అంత నమృతోపమాన మగు భగవచ్చరిత్ర కథలు చెప్పంగా నందఱును మిక్కిలి శ్రద్ధాభక్తులతో శ్రవణము చేయుదురు. మఱల నందఱును గలిసి భగవానుని సుమధుర నామములను సంకీర్తన చేయుదురు. సంకీర్తన నుండి లేవగానే అందఱును శౌచాదులకు వెళ్ళిపోవుదురు. సంధ్యా హారతి కాఁగానే కీర్తన జరుగును. సత్సంగము జరుగును. పరమార్థ చర్చ లేనిది ఒక్క క్షణమైన గడువదు. వారి కార్యము లన్నియు కృష్ణార్పణ బుద్ధితో, మిక్కిలి నియమ సమయమున సకాలమునకు జరుగుచుండును. ఎన్నడును ఏ కార్యమునందును ప్రమాదాలస్యములు జరుగనే జరుగవు. చూచుటకు నా వయస్సు చాల కొద్దిదైనప్పటికి పూర్వజన్మ సంస్కారముల చే నా కన్నియుఁ దెలియును. నా జీవితములో నీ స్వర్ణావసరము నాకు చాల అదృష్టము వలన వచ్చిన దను కొనుచున్నాను. దీనిని మిక్కిలి సావధానముగ దత్తచిత్తుఁడనై యుపయోగించు కొనవలయును. ఆ సాధువుల కెవరి యెడలను మమతామోహ ములు లేక పోయినప్పటికిని, వా రందఱు సమదర్శనులైనప్ప టికిని నా సరళతను, సత్యతను సేవాపరాయణతను, సంయ మమును సదాచారమును గాంచి వారు నా మీఁద విశేష కృపఁ జూపెదరు. నేను గూడ అవ్యగ్రుఁడనై వారి సేవా శుశ్రూషలందు సదా తత్పరుఁడ నగుచుందును. అందఱికంటె వృద్ధుఁ దపస్వియు నగు ఆచార్యుఁడు నా మీఁద పుత్ర స్నేహ ముంచెడువాఁడు. అతని నిష్కపటప్రేమనుబొంది నా హృదయ పద్మము వికసించినది. అతని ప్రియమైన స్వచ్ఛమగు తెల్లని

గడ్డమును జూడవలె ననియే నా హృదయము కాంక్షించు చుండును. ఆ మహాత్ముని దెట్టి తేజస్సు గల ముఖమండలము! ఆతఁడు నవ్వుచు సంభాషించుచుండెనా, ఆతని నోటి నుండి పూలు రాలుచున్నట్లుండెడిది. ఆతఁడు కథను జెప్పునపుడు అమృతవర్షము కురిపించుచున్నట్లుండును. చెప్పుచుండఁగా నాతని కంఠము గద్గదిక మగుచుండును. నేత్రముల నుండి ప్రేమాశ్రువులు ప్రవహించుచుండును. మధ్య మధ్య వాక్కు గద్గదిక మగుటచే కథ ఆగిపోవుచుండును. ఆతఁడు తనలో తా నుండెడివాఁడు కాడు. భావమగ్నుఁడై వేఱు లోకమునకు వెళ్ళిపోయెడు వాఁడు. ఆ లోకము నుండియే ప్రేమావేశములో దివ్యవాక్కులతో కథను జెప్పుచుండును. ఆయన యెప్పుడు మాట్లాడినను మొట్టమొదట ప్రేమతో బుజ్జగించుచు "బిడ్డా!" అనుచుండును. ఆతరువాత నేదైన పని చేయుమని చెప్పును. ఆహా! ఆయన సరళస్వభావ మెట్టిది?

నేనుగూడ నా శరీర మోహము నంతను ద్యాగము కావించితిని. ప్రాతఃకాలమున నాతఁడు లేచుటకు పూర్వమే లేచెడువాఁడను. లేవఁగానే ఆశ్రమమునంతను చిమ్మెడు వాఁడను. ఇంతలోనే టకటకమను పాదుకల శబ్దముతో కమండలువును జేతఁబూని ఆ మహాత్ముఁడు శౌచాదులకై పోవుచుండుట కనఁబడును. నేను చీపురును పారవైచి భూమి మీఁదఁ బడి సాష్టాంగ నమస్కారము చేయుదును. "అరే, ఎవరురా, అబ్బాయి, హరిదాసా! నీవు త్వరగా చాల పెందలకడ నిద్ర లేచెదవురా!" ఇట్లనుచు బుజ్జగించి వెళ్ళిపోవును. ఆతఁడు వెళ్ళిపోగానే ఆతని చరణముల క్రింది

ధూళిని దీసికొని మెల్లగా నా శిరస్సున శరీరమం దంతటను పూసికొనెడు వాఁడను. ఇంకను మహాత్ము లెవరైనఁ గనఁబడిన సందఱ చరణములకుఁ బ్రణామము చేయుచుందును. ఆశ్రమమునంతను చిమ్మి, కలయంపి చల్లి బాగుగా స్వచ్ఛము కావించి నేను గంగాతటమునకు వెళ్ళుదును. స్నానాదులను గావించుకొని తులసీ పుష్పాదులను గోయుదును. ఆచార్య మహారాజువారి ఆసనమున కొక ప్రక్క పూజావేదిక కలదు. ఇంకొకవైపు భగవంతునకు వంటశాల కలదు. నేను స్వామి సమ్ముఖమునసే గంప పెట్టుకొని కూర్చుండి భగవంతుని కొఱకు మాలలను గట్టుచుందును. స్వామివారి పూజా పాఠములను గూడ చూచుచు వినుచుందును. వంటలోఁగాని, పూజలోఁగాని, ఇంక నేయే కార్యములలో అవసరముండునో అప్పుడు "హరిదాసూ!" అని పిలుచుచుందును.

అప్పుడు నేను "స్వామీ! నేను వచ్చితిని" అని ప్రత్యుత్తర మిచ్చుచుందును. తత్క్షణమే లేచి వారేపనిని జెప్పిన ఆ పనిని జేసి మరల నాస్థానమునకు వచ్చి కూర్చుందును. హారతియందును, పూజాకథయందును, కీర్తనయందు అన్నిటి యందు మిక్కిలి శ్రద్ధతో సమ్మిళిత మగుచుందును. ఆ ముని గణ మెట్టి మనోహర కీర్తన చేయుచుందురు! ఇప్పుడు కూడ దానిని స్మరించిన నా హృదయము గద్గదిక మగుచున్నది. వారిలో నొక గౌరవర్ణము కలిగి పొట్టిగానుండు గొప్ప రూపవంతుఁ డగు మహాత్ముఁ డుండెడువాఁడు. ఆ మహాత్ముని దెట్టి మనోహరమగు మూర్తి. అతఁడు వీణను మీటుచు భగవద్గుణానువాదమును గీర్తించుచుండిన కోకిల కూజితము

వలె నుండెడిది. ఎట్టి మధురస్వర మా సాధువుది! ఆ గీత
ముల నెట్టి తన్మయత్వముతో గానము చేసెడువాఁడు!
పాడగా పాడగా శ్రావణ భాద్రపదములలోని వర్షము వలె
నాతని నేత్రములనుండి అశ్రువర్షము కురియుచుండెడిది.
అక్కడ నున్న మహాత్ముల కన్ను లన్నియు నీటితోఁ దడిసి
పోయెడివి. నేను నా యశ్రుపూరితము లగు నేత్రములతో
ననిమేషముగ నాతని వైపునకే చూచుచుండెడు వాఁడను.
ఇటువంటి వీణ నాకు కూడ నుండిన నేను కూడ ప్రేమలో
మునిఁగి శ్రీకృష్ణ కీర్తనము చేయుచుందునుగదా యని నేను
నా మనస్సులో మాటిమాటికి అనుకొను చుండెడు వాఁడను.
ప్రేమతో ప్రభు యశమునకు సంబంధించిన పదములను
గానము చేయుదును. కాని దాసీ పుత్రునకు వీణ యెక్కడి
నుండి వచ్చును? ఒకవేళ వచ్చిన దానిని వాయించుట
నేర్పున దెవరు? అందుల కని లోననే యిముడ్చుకొనియుండి
యా కీర్తనమును వినియే సంతసించెడు వాఁడను. ఆ సుమధుర
గానమును ఎంత విన్నను తృప్తి కలుగదు. ఇది యింకను జరి
గిన బాగుండు నని నాచిత్తము కోరు చుండెడిది; కాని అక్కడ
సమస్త కార్యములు సమయాను సారముగ జరుగును.

భగవంతునకు నైవేద్యము కాఁగానే సంతమహాత్ములు
పంక్తిగాఁ గూర్చుండి భగవన్నామోచ్చారణము చేయుచుఁ
జేయుచుఁ బ్రసాదమును గైకొనఁగానే వారి ఆకులన్నియుఁ
దీసివేయుదును. వాటి కంటుకొనిన అన్నకణము లను మిక్కిలి
సావధానముగ నేఱి, వారి యాజ్ఞను బొంది యా మహా
ప్రసాదమును గైకొనెడు వాఁడను. ఆచార్య మహాత్ముని

పళ్ళెరములో మిగిలినదానిని గూడ యేఱి తినెడు వాఁడను. ఒకదినమున నేను వినీత భావముతో వారిని "స్వామీ! నే నీ ప్రసాదమును గైకొందునా?" అని అడిగెడువాఁడను. ఇది విని కొంచెము సేపు ఆతఁ డాలోచించి "సరియే" అనును. ఇంకేమున్నది. నా పని అయినట్లే. వ్యాసా! శుద్ధముగా వంట చేసి భగవంతునికి సమర్పించి పచ్చని కోమల తులసీ దళములను వేసి ప్రభువున కర్పించిన యప్పు డా యన్నము 'మహాప్రసాద' మగును. ఆ మహాప్రసాదమును సంత భగవ ద్భక్తులు తీసికొనిన తర్వాత మిగిలినది మహా మహాప్రసాద మనఁబడును. ఆ ప్రసాదమును వారి యాజ్ఞచే శ్రద్ధాభక్తు లతోఁ గైకొనిన సమస్త పాపములు నశించును. అంతఃకరణ మాలిన్యము పోవును.

పెద్ద పెద్ద పాత్రలలో ప్రసాదము తయారు చేయఁ బడును. వాటిలో తులసిని త్రుంచివేసి భగవంతునకు సమ ర్పింపఁబడును. తర్వాత మహాత్ములా పాత్రలను తోము దురు. నేను చిన్నవాఁడ నైతిని. నే నంతటి పాత్రల నెత్తను లేను, వారు నా కెన్నడును తోమవలసిన దని చెప్పను లేదు. చిన్న చిన్న పాత్రలను నేను తోమి తీసికొనివచ్చెడు వాఁడను. దినమున కొక్కసారి మహాత్ముల ఉచ్ఛిష్టాన్న ప్రసాదమును దిని నేను ఆనందించెడు వాఁడను. దానిని దినుట చేతనే నా యంతఃకరణము శుద్ధమై పోయినది. ప్రసాద మును గైకొనిన తర్వాత కథలో కూర్చుందును. ఏకాగ్రచిత్త ముతో కథను వినుచుందును. తర్వాత మరల గంగాతటము నకు వెళ్ళి మంచి మంచివి చాల తీసికొని వచ్చుచుందును.

శౌచక్రియకై మహాత్ములు సరళముగఁ దీసికొని పోవుటకై చక్కని పచ్చని మృత్తికను త్రవ్వి తీరమార్గమున నుంచుచుండెదను. ఆ మహాత్ముల చర్య నాకు చాల ప్రియముగ నుండెడిది. నా జీవితము నిరర్థకము గదా యనుకొనెడు వాఁడను. నాదికూడ ఒక జీవితమైనది. పృథ్వికి భారభూతుఁడనైతిని. తులసిని కోయునపుడు "ఈ తులసి యెంతటి ధన్యమైనది? భగవత్సేవకు ఉపయోగించుచున్నది. ఆతని నెత్తికెక్కుచున్నది" అని యేడ్చెడు వాఁడను. పుష్పములను దీయుచు వాటికి లోలోన నమస్కారము చేయుచు "ఓ పుష్పములారా! మీరు పూచినందులకు సార్థకము చెందితిరి. మీరు భగవత్సేవ కుపయోగించుచున్నారు. నా బోటి మూఢున కా ప్రాప్తి లేదుకదా! పలుదోముపుల్లలు కోయుచు "ఈ వృక్షములోని యీ కొమ్మలు సాధుకార్యమం దుపయోగపడుటచే ధన్యములైనవి" అనుకొనుచుండును. మృత్తికను త్రవ్వుచుఁ గూడ "నాకీ మృత్తిక చాల మంచిదియే. ఈ విధమైన నా భక్తిహీన జీవనమందు నాకు మాటిమాటికి దుఃఖము కలుగుచున్నది. ఆ మహాత్ముల దగ్గఱ చాల గోవులున్నవి. నేను వాటి దూడలతో నాడుచుందును. పచ్చని పచ్చిగడ్డిని దెచ్చి వాటి నోళ్ళలోఁ బెట్టుచుందును. వాటిని సోదరులవలెఁ బ్రేమించుచుందును. ఈ విధముగ నా మహాత్ముల సత్సంగములో నా కా దినములు గడచుటయే తెలియలేదు. ఎప్పుడు తెల్లవారినదో ఎప్పుడు ప్రొద్దు క్రుంకినదో కూడ నాకు తెలియలేదు. అక్కడ కథా కీర్తనలయొక్క

సుమధుర గంగాప్రవాహము ప్రవహించుచుండును. ఆ ప్రవాహము నిరంతరము అవ్యాహతగతిచేఁ బ్రవహించుచుండును.

ఆచార్య స్వాములకు రాత్రులందు చరణసేవ కూడ నేను చేయుచుండును. ఆ తపోధనుని స్పర్శ యెంత సుఖదమైనది! ఆయన తన నిస్స్వార్థప్రేమచే నన్ను స్నేహ సాగరములో నిమగ్నుని కావించెడువాఁడు. ఎప్పుడైన సత్సంగములోఁ జర్చ నడచు నెడల ఇతర సాధువులతో నా విషయమున "ఈ కుఱ్ఱవాని వయస్సు చాల చిన్నదే కాని మంచి సంస్కారిగాఁ దోఁచుచున్నాఁడు. కథ నెంత ఏకాగ్రదృష్టితో వినును! కీర్తన గద్గదికుఁడై యెట్లు చేయును! వీఁ డెవఁడో యోగభ్రష్టునివలెఁ దోఁచుచున్నాఁడు" అనుచుండును. మహాత్ముని ముఖమునుండి ప్రశంసను విని లోలోన నాకు చాల సంతోషము కలుగుచుండెడిది. కాని లజ్జావశమున నేను తల వంచుకొననైన వంచుకొనెఁడువాఁడను; అక్కడనుండి లేచి యింకొక చోటికైనను వెళ్ళిపోయెడువాఁడను.

ఆ మహాత్మునకు నా కథాజీవనమందు చాల ప్రభావము పడినది. నా మతి శ్రీకృష్ణ చరణారవిందములమీఁద అచలముగ నున్నది. నాకీ జగత్తంతయు స్వప్నమువలెఁ దోఁచుచుండెను. నాకు సర్వత్ర శ్యామసుందరుని మనోహర మూర్తియే గోచరించుచుండెను. సదసద్రూప మగు నీ జగత్తును నేను పరబ్రహ్మ స్వరూపముగ నాలోపలను అనుభవించుచుండును. ఈ బాహ్యప్రపంచము మాయికము. తనకు తానే కల్పింపఁబడినదని తోఁచును.

నాకు తల్లిని గూర్చిన చింతయు లేదు, ఇల్లును గూర్చిన చింతయు లేదు. తల్లి ప్రతిదినము వచ్చి నన్ను చూచిపోవుచుండెడిది; మహాత్ములకుఁ బ్రణామము చేసి పోయెడిది; గంటలకొలది కూర్చుండును; మహాత్ముల సమక్షమున నేడ్చెడిది; నాకు మేలు కలుగవలెనని ప్రార్థన చేసెడిది. మహాత్ములు ఆమెను వివిధ విధముల నోదార్చుచు "అమ్మాయీ! ఈ నీ పుత్రుఁడు మిక్కిలి తెలివిగలవాఁడు. వీని విషయములో నీవు చింతింపఁగూడదు" అనుచుందురు. కాని బ్రహ్మ మాతృహృదయమును చాల విచిత్రముగ చిత్రించినాఁడు. ఆమె ప్రతి దినము నన్ను "అబ్బాయీ! ఏమియు కష్టము లేదుగదా! భోజనాదు లన్నియు సరిగా జరుగుచున్నవి గదా?" అని అడుగుచుండును. నేను "అమ్మా! ఇచ్చట మహాత్ముల శరణములోఁ గష్టముతోఁ నేమి పని? ఇక్కడ సర్వత్ర ఆనందమే ఆనందము" అనెడువాఁడను.

ఈ విధముగా వ్యాసా! ఆ దినములెంత సుఖముగ గడచినవి. ఇది చెప్పవలసినదికాదు; నా హృదయమునకే తెలియు. ఇట్లు చెప్పుచుఁ జెప్పుచు నారదుని కంఠము రుద్ధమైపోయెను. ఆతఁడు కొంచెముసేపు భావసమాధిలో నిమగ్నుఁ డయ్యెను.

ఛప్పయ

కృష్ణ కీరతన కరూఁ కథా నితప్రతి శుభ సునతా ।
సేవా శ్రద్ధా సహిత సభి సంతని కీ రతతా ॥

సురత మనోహర చరిత మైల మన కో సబ్ ఛూాట్యో ।
శ్రీపతి పదపద రతి భఈ జగత సే నాతో టూాట్యో ॥

చిత్త భ్రమర సతసంగ మధు, శ్రీహరి గుణ గానే లగ్యో ।
మనమేం మోదమహా భయో, హృదయప్రఫుల్లితహ్వాంగయో

అర్థము

ఓ వ్యాసా ! నేను ఆ మహాత్ముల సత్సంగములో నున్న ప్పుడు శ్రీకృష్ణకీర్తనను చేయుచుండెడువాఁడను. ప్రతినిత్యము శుభచరిత్రలను వినెడువాఁడను. సమస్త సాధు సంతమహాత్ములను శ్రద్ధాభక్తులతో సేవించెడు వాఁడను. ఈ మనోహర చరిత్రలను వినఁగా నా మనస్సులోని మలినమంతయుఁ బోయినది. శ్రీ మహావిష్ణుని యందు ప్రీతిగలిగినది. జగత్సంబంధము తెగినది.

చిత్త భ్రమరము సత్సంగ మధువును గ్రోలుచుండును. శ్రీహరి గుణగానము జేయుచుండును. దానివలన మనస్సునకు మహామోదము కలిగినది. హృదయము ప్రఫుల్లిత మైనది.